# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

విడి ప్రతి వెల రు. 4-00

సంపుటము 82 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 8

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248


## మనలో మాట

మన భాష అందమైనది. మనకి "విహితము" "అహితము" అయిన సందర్భాలకు సరిపోయేసామెతలెన్నో వున్నాయి! ఒక్కొక్కసారి దెప్పిపొడిచే సామెతలు గూడా మెత్తబడిపోయి - ఉపశమనాన్నిస్తాయి! ఊరట కలిగిస్తాయి. "అయ్యొచ్చే వరకు అమవాస్య ఆగదు" అన్న సామెత ఒకటుంది! దీపావళీ అమావాస్య నిజానికి అమావాస్య కాదు. నలుదెసలా కాంతులు చవ్వుల్లు విరిసే పండుగ! అప్పటికి అందే యీ "సంచిక"లోనే మా పాఠకులకు ప్రకటనకర్తలకు, రచయితలకు ఏజెంట్లకు యీావన్మందికి దీపావళి శుభాకాంక్ష లందిస్తున్నాము!

అనివార్యమైన అవాంతరాలవల్ల యిందులో కొన్ని ప్రత్యేక శీర్షికలను యివ్వలేకపోయాము. "దెయ్యాల కథల పోటీ"కి గడువు పెంచిన కారణం ఒకటి - అనుకున్న దానికన్న యెక్కువ కథ లందటం, రెండూగా - వాటి ఫలితాలను - అక్టోబరు 27 సంచికకు వాయిదా వేస్తున్నాము! సూపర్ హీరో సీరియలు (మనోహర రచయిత్రి మన్నెం శారదగారి సూపర్ స్పెషల్) పై సంచికలోనే అందించాలని మా 'ఉబలాటం!' అవుతున్న ఆలశ్యానికి మన్నించి సచిత్ర వారపత్రికను ఇతోధికంగా ఆదరించగలరన్న విశ్వాసంతో వున్నాము!

## వీక్లీ పోస్ట్

### హత్తుకునే కవిత

సాంఘికంగా, సామాజికంగా, మానవజీవనసరళిలో ఎదురవుతున్న, ఎదుర్కొంటున్న సామాన్యమానవుడి సమస్యల గురించి "అర్ధరాత్రి" లో రాష్ట్ర పంచాయతీ శాఖామాత్యులు శ్రీ పోడమిడి చంద్రశేఖర్, అద్భుతంగా, హృదయానికి హత్తుకునేలా తమ కవితలో అభివర్ణించారు. శ్రీ చంద్రశేఖర్ "కవి" అన్న విషయం మా "ఆంధ్ర సచిత్ర వార పత్రిక" పాఠకులకు తెలిపినందులకు అభినందనలు.

శతభిషం, వరంగల్

(70 వ పేజీ చూడండి)




### ముఖచిత్రం:

హల్లో! నేనండీ!"
అంటున్న కొత్త తార గిరిజ
(ఫోటో : కె. ఆర్. వి. భక్త)

### పైవారం :

### మన్నెం శారద

"సూపర్ హీరో"!

## ఈ వారం ప్రత్యేకం :-

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు - దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ | ఎడిటర్: వీరాజీ | ముద్రాపకుడు, ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ 13-10-1989 | శక సం. 1911 ఆశ్వయుజమాసం 21వ తేదీ




మన వైమానికదళం *1947*లో కేవలం *10* స్క్వాడ్రన్‌ల బలం కలిగి ఉండేది! యివాళ యాభై స్క్వాడ్రన్‌ల బలంతో అరివీర భయంకరరంగా ప్రకాశిస్తున్నది- మనదేశంతోపాటు స్వయంగా యుద్ధ విమానాలు, యుద్ధవిమానాలను మోసుకుపోయే నౌకలను తయారు చేయగలశక్తి మన ఖండంలో చైనా, బ్రెజిల్, అర్జెంటీనాలకే వున్నది! మన ఆకాశయోధుల అస్త్రతూణీరంలో పది వందలకు మించి రకరకాల యుద్ధ విమానాలున్నాయి. వీటిలో "మిరాజ్-*2000*" యుద్ధ విమానాలు చాలా ముఖ్యమైనవి. ఇవిగాక మనకి కాన్‌బెర్రా, హంటర్, అజీత్, కిరణ్, చేతక్, మిగ్-*21*, మొదలు *29*దాకా రకరకాల మిగ్గులు, జాగ్వార్‌లు యిట్లా చాలా చాలా శక్తిమంతమైన విమానాలు మన దేశ వైమానికదళానికి ఎదురులేని మహాశక్తిని అందిస్తూ వున్నాయి! యాభై ఆరు సంవత్సరాలు జేగీయమానంగా పూర్తి చేసుకుని- *57*వ సంవత్సరంలో అడుగు పెడుతూ, వైమానికదళం- భారత రాజధాని ఆకాశంలో మహోజ్వల ప్రదర్శనలు చేస్తున్న సెప్టెంబర్ *8* ఆదివారం ఉదయం- అకస్మాత్తుగా అపశ్రుతి దొర్లింది. చూపరులు గుండెల మీద ఒకచెయ్యి- ముక్కున వ్రేలూ- వేసుకుని అచ్చెరువు ముద్రలో తన్మయులై మిరాజ్-*2000* యుద్ధ విమానాలు వేస్తున్న పల్టీలు, గిరికీలు చూస్తూనే "అమ్మో" అంటూ అవాక్కైపోయారు.

మిరాజ్-*2000* విమానం ఒకటి మహాద్భుత విన్యాసాలలోని అంతిమ చరణంలో- దేన్ని 'ఢీ' కొన్నదో లేక యే లోపానికి గురి అయినదో తెలియదుకాని తృటిలోపల తుత్తునియలై, భస్మీపటలమై సమీపంలోనే కూలిపోయి- క్రింది శకటాలకు, జనవాసములకు నిప్పు పెట్టింది. అందులోని పైలట్ యుద్ధం చేస్తున్నప్పుడు మాత్రం పొందదగిన "వీరమరణం" ముందే- ఆనందోత్సాహ సమయాన- పొంది- ఆకాశదహనమైపోయాడు! ఇటువంటి వీరుని- అద్భుత వైమానికుని కోల్పోయిన భారతమాత, ఆసేతు హిమనగమూ దుఃఖ కంపిత అయిపోయింది! వినోదంలో యిటువంటి విషాదం వల్ల అపారనష్టం సంభవించింది. అమూల్యమైన ప్రాణాలకు హాని జరిగింది. అమిత మూల్యమైన మిరాజ్-*2000* విమానాల బలగానికే తీరని లోపం వాటిల్లింది!

"హోనీకోకాన్ టాల్ సక్తాహై?" అనుకొని యిటువంటి ప్రమాదాల పట్ల విజ్ఞులు నిట్టూర్పులు విడువరాదు- ఎందుకంటే ఆనందోత్సాహాల వెల్లువలో ఒక్క విమానం రెక్కకైనా దెబ్బ తగలకూడదు!-

ఈ సంఘటన వినంగానే చాలామందికి గత సంవత్సరం సెప్టెంబర్‌లో పశ్చిమ జెర్మనీ విమాన స్థావరమైన 'రామ్‌స్టీన్'లో కూలిపోయి తీరని ప్రాణ నష్టాన్ని కల్గించిన 'యిటాలియన్ విమాన ప్రమాదం' ఒకటి వెంటనే గుర్తుకు వస్తుంది!- అప్పుడు అరవై మంది నిర్దోషులు సజీవదహనమైపోయారు- కొన్ని వందల మందికి వొళ్లంతా కాలిపోయింది! ఇట్టి 'ఉత్సవాల' తీరు తెన్నులను మార్చుకోవలసిన అవసరాన్ని యీమాదిరి ప్రమాదాలు హెచ్చరిస్తున్నాయి!

తన హాని లోకనింద అంటారు యిటువంటి ప్రమాదాలను!! ఉత్సవాలు సంబరాలు తప్పకుండా చేసుకోవాలి కాని ప్రాణాల మీదకు తెచ్చుకొనే విన్యాసాలను కేవలం యుద్ధరంగానికే దాచి వుంచుకోవాలి! ఈ ప్రమాదం జరిగింది కనుక వెనక్కి సహజంగా మన ఆలోచనలు వెళ్తాయి! ప్రపంచంలో మన విమానదళానికి చెందిన ప్రమాదాల సంఖ్య మిగతా దేశాలతో పోల్చి చూస్తే కొంచెం ఎక్కువగానే వుంటున్నది! *1977-78*లో మన వైమానికదళ ప్రమాదాల సంఖ్య *46* అంటున్నారు! అయినా కూడా మన ఎయిర్ చీఫ్ మార్షల్‌గారు యీ దుర్ఘటన కారణంగా ముందు యిటువంటి విన్యాసాలకే 'స్వస్తి' పలకబోమని ప్రకటించడం దుస్సాహసమే అవుతుంది కాని వీరోచితం గాదు!-

*1983*లో వైమానికదళ విమాన ప్రమాదాల మీద ఒక ఉన్నత స్థాయీ సంఘం *1977-82* ల మధ్య కాలంలో జరిగిన "ప్రమాదాలు" ఆధారంగా క్షుణ్ణంగా పరిశోధనలు చేసి ఒక నివేదికను సమర్పించింది. గవర్నమెంటువారు దాని మీద యింకా యెటువంటి నిర్ణయం తీసుకోలేదు. 'కమిటీ పరిశీలనా కాలమైన ఐదు సంవత్సరాలలో *262* విమాన పతనాలు- ప్రమాదాలు జరిగాయిట! వాటిలో *40*శాతం మాత్రం 'పైలట్స్' తప్పిదాల వల్ల జరిగాయని వెల్లడైంది! అటువంటప్పుడు కేవలం పైలట్ దుందుడుకుతనమే ప్రమాదహేతువు అని కొట్టిపారేయలేం కదా!

మిరాజ్-*2000* 'మిగ్'లు జాగ్వార్‌లు జాజ్జ్వల్యమానంగా నడిపే మన వైమానిక వీరులు- పిరికిపందలై భయపడాలని మన ఉద్దేశం కాదు- నిష్కారణంగా 'పందుగవూట' ప్రాణాలొడ్డే విన్యాసాలెందుకు చేయాలన్నదే మన దుఃఖం! అంచేత తర్ఫీదు పొందినప్పుడు- నిర్మానుష్య ప్రాంతాలలో 'మాదిరి విన్యాసాలు' చేసినప్పుడు తప్ప- పండుగలకి పబ్బాలకి యిట్టి 'వీరంగా'లను అరికట్టడమే మంచిది! గవర్నమెంట్, ఎయిర్‌ఫోర్స్ అధిపతులు కూడా గత చరిత్ర అందించిన గుణపాఠాల ఆధారంగా సముచిత నిర్ణయాలు తీసుకుంటారనే ఆశిద్దాం!

●

# మహాత్ముని 'స్వప్నం' సేవాగ్రామ్!




సేవాగ్రామ్ అనగానే ఆదొక పవిత్ర స్థలంగా మనకి అనిపిస్తుంది సేవాగ్రామ్ మహాత్ముని స్వర్గం మహాత్ముని ఆశ్రమాలలో ఒకటైన ఈ ఆశ్రమం మహారాష్ట్ర లోని వార్ధా జిల్లాలో వార్ధాకి 9 కి మీ దూరంలో ఉన్నది. సేవాగ్రామ్ ఇప్పటికీ మనకు ఒక పవిత్ర స్థలంగా కన్పిస్తుంది ఈ ఆశ్రమంలో పెంకులతో నిర్మించిన గృహాలు ఆరు ఉన్నాయి. ఒకటి ఆదినివాస్ రెండు కస్తూరిబాకుటి, మూడు బాపుకుటి, నాలుగు బాపువంట గది–ఇవికాక మరో రెండు ఉన్నాయి.

బాపు ప్రార్థనాస్థలం, బా కుటి.



ఈ ఆశ్రమం నిర్మించినపుడు ఆదినివాస్ ఒక్కటే ఉండేది అప్పుడు కస్తూరిబా చాలా మంది పురుషుల మధ్య ఆ గృహంలో ఉండటం చాలా ఇబ్బంది కరంగా ఉండేది ఆ ఇబ్బందిని గమనించి వార్ధాకు చెందిన నాటి ప్రముఖ పారిశ్రామిక వేత్త జమన్‌లాల్ బజాజ్ (నేటి బజాజ్ వంశ మూలపురుషుడు) – కస్తూరిబా కుటి నిర్మించి ఇచ్చారు

అప్పట్లో గాంధీజీ కోసం వచ్చే స్త్రీలంతా కస్తూరిబాతో కలిసి బాకుటిలో ఉండేవారు తర్వాత బాపు కుటి, వంటశాల మొ నిర్మించారు బాపుకుటిలో అప్పుడు బాపు కూర్చున్న ఆసనం, అలమరా, చిన్న వ్రాత బల్ల అన్నీ అలానే ఉంచారు. బాపుకుటిలో మొత్తం నాలుగు గదులు ఒక వరండా ఉన్నాయి ఒక గదిలో సామాను (నాడు బాపు ఉపయోగించినవి) అలానే ఉంచారు తర్వాతి గదిలో లెట్రిన్ చాలా విశాలంగా నిర్మించారు అప్పట్లో ప్రయోగాత్మకంగా నిర్మించిన సెప్టిక్ టాయిలెట్ అది ఇందులో ఉన్న సామాను కూడ అలానే ఉంచారు




సేవాగ్రామ్ సందర్శించిన తెలుగు యువ రచయితల సంఘం (నాగపూర్) కార్యదర్శి జాగృతీ కిరణ్‌తో ఆశ్రమ ప్రముఖుడు, గాంధీజీ సహవాసి ఆనందరావు బాకడేజి

అప్పట్లో బాపు టాయిలెట్‌లో ఉన్నపుడు కూడ నాయకులు వచ్చి చర్చించేవారట. తర్వాతి గదిలో బాపుకు మసాజ్ చేయడానికి చెక్క బల్లలు ఉన్నాయి. బాపు ఆసనం ఉన్న గదిలో నాడు బాపు మరణించినపుడు ఉన్న చేతికర్ర, చెప్పులు అద్దాల అల్మరాలో అమర్చారు.

బాపుకుటికి వెనకాల ఉన్న గృహంలో లైబ్రరి ఉన్నది. ఇప్పటికీ బాపు ఉపయోగించిన పుస్తకాలు అలానే ఉంచారు. ముందు గదిలో నాకు ఆశ్చర్యాన్ని కల్గించిన విషయం. ఒక పెద్ద చెక్క పెట్టె, ఒక పెద్ద చెక్కతో చేసిన కత్తెర లాగున్న సాధనం ఉన్నాయి. అది ఏమిటి అని అడగ్గా అప్పట్లో పాములు వస్తే బాపు వాటిని చంపక పట్టి పెట్టెలో దాచి ఉంచేవారట, చంపితే అది జీవహింస అవుతుందని.

## సప్త సూత్రాలు

బాపుకుటిలో ప్రతి ఒక్కరిని ఆకర్షించే ఒక విషయం వ్రాసుంది. "ఇఫ్ యూ ఆర్ ఇన్ ది రాంగ్ యూ కెనాట్ ఎఫర్డ్ టు లూజ్ యువర్ టెంపర్ ఇఫ్ యూ ఆర్ ఇన్‌ది రైట్ యూకెన్ ఎఫర్ట్ టు కీప్ ఇట్." బాపుకుటిలో నుండి వచ్చాక అందరినీ ఆకర్షించే ఏడు సూత్రాల బోర్డు.

1. కామర్స్ వితౌట్ ఎథిక్స్
2. ప్లెజర్ వితౌట్ కాన్‌సైన్సు
3. పాలిటిక్స్ వితౌట్ ప్రిన్సిపుల్
4. నాలెడ్జ్ వితౌట్ క్యారెక్టర్
5. సైన్స్ వితౌట్ హ్యూమానిటీ
6. వెల్త్ వితౌట్ వర్క్
7. వర్‌షిప్ వితౌట్ సాక్రిఫైస్

ఆది నివాస్, బాకుటి, బాపుకుటి లముందు పెద్ద ఖాళీ ప్రదేశం ప్రశాంత మయిన వాతావరణాన్ని కలుగజేస్తూ – దాని చుట్టూ కర్రలతో దడిలా అమర్చారు. ఇక్కడ బాపు రోజ ప్రార్థన చేసేవారట. ఈ ప్రదేశానికి ఒక ప్రక్క రెండు మర్రి చెట్లు ఉన్నాయి. ఒకటి బాపు, రెండోది కస్తూరిబా నాటినవి.

## బాపు భోజనం

బాపు వంటశాల ఎంతో సాధారణంగా ఉన్నది. ఇప్పటికి ఇక్కడ అదే విధంగా భోజనం తయారు చేస్తారు. యాత్రికులు బాపు తిన్న భోజనం తినాలంటే ఒక పూట ముందు చెప్తే బాపు భోజనం మనం తినవచ్చు. ఆశ్రమంలో ఇంకా ఖాది భాండార్, స్టోర్ ఉన్నాయి.

ఆలిండియా కాంగ్రేస్ మీటింగ్ జరిగాక బాపు, కస్తూరిబా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 1942 ఆగష్టు 9న అరెస్టయినారు. తర్వాత ఇద్దర్నీ పూనాలోని ఆగాఖాన్ జైలులో ఉంచారు. కస్తూరిబా ఆగాఖాన్‌లో అస్వస్థత చెంది తీవ్ర అనారోగ్యంతో 1944 ఫిబ్రవరి 22న మరణించారు.

క్విట్ ఇండియా ఉద్యమం తర్వాత బాపు ఇక ఈ ఆశ్రమానికి రాలేదు. అన్నీ ఢిల్లీలో జరుగు తుండేవి.

మనకు స్వాతంత్ర్యాన్ని తెచ్చిన, దానికి కారణమయిన మహోద్యమాన్ని నడిపిన చారిత్రాత్మక ప్రదేశం సేవాగ్రామ్. అందుకే అహింసకు ప్రతిరూపంగా సేవాగ్రామ్‌ను చెప్పుకోవచ్చు.

ఇప్పుడు యిక్కడ ఒక ఇంజనీరింగ్, ఒక మెడికల్ కాలేజి నడుస్తున్నాయి.

(కాపుల్ దేవరపల్లి శ్రీనివాసరావు, సుఖదేవ్ రౌత్‌లకు కృతజ్ఞతలతో ...)

**ఫొటోలు, వ్యాసం : జాగృతికిరణ్**

బాపు ఆసనం, వ్రాత బల్ల, లాంతరు, పుస్తకాల అల్మెరా.





# శాంతి బహుమానం!

ఇరవై తొమ్మిది సంవత్సరాలుగా భారతదేశంలో ప్రవాస జీవనం గడుపుతున్న టిబెట్ మఠాధినేత 54 సంవత్సరాల దలై లామాకి ప్రపంచ శాంతి నోబుల్ బహుమానం రావడం ఉచితమో అనుచితమో భారతదేశంలో ఎవ్వరూ ఆలోచించటంలేదు దలైలామా యిక్కడ తలదాచుకుంటున్న దగ్గర్నించీ చైనాకి మాత్రం భారతదేశం మీద కోపంగానే వుంది - టిబెట్ మీద 29 సంవత్సరాలుగా చైనా తిష్ట వేసుకొని కూర్చున్నది - బహుశా వారికి తమ మతాధినాయకుడికి నోబెల్ శాంతి బహుమానం రావటం ఆనందం కావచ్చును - నోబుల్ శాంతి బహుమానం పోయినసారి అయిక్య రాజ్య సమితి శాంతి సేనకి వచ్చింది. ఈ ఏడాది ఐ.పి.కె.ఎఫ్. అంటే శ్రీలంకలో భారతీయ శాంతిసేనకి వస్తుందేమో ననుకున్నవాళ్లెక్కరైనా వుండరా? కాని బుద్ధ మఠాధిపతి దలైలామాకి యీ అవార్డు రావడం వివాదాతీతంగా వుంది - రష్యా నాయకుడు మెహాయిల్ గార్బచేవ్‌కి అమెరికా జార్జి బుష్‌కి యివ్వలేదు. కనుక నాకు మీకు సంతోషంగా వుంటుంది. దలైలామాగారు యింకా మంచి వయస్సులో వున్నారు. కనుక బుద్ధం శరణం గచ్ఛామి అంటూ యిండియాలో కూర్చుని టిబెట్ విమోచనోద్యమానికి, ప్రపంచంలో శాంతికి పాటుపడవచ్చును - భారతదేశంలో పొలిటికల్ గేమ్స్ ఆడనంతకాలం ఆయన గురించి మనం చింతించవలసిన పని లేదు. సన్యాసి కనుక ఆయన గురించి మనం చింతించవలసిన క్కరలేదు. మనది సెక్యులర్ రాజ్యం - అందులో బౌద్ధమతం చాలా చిన్న పిసరు వున్నది కనుక పేచీలు తలెత్తటం లేదు!

అందుకనే హిందూ, ముస్లిం, సిక్కు, ఇసాయీ మతాల చిహ్నాల కతీతంగా - మన రూపాయి కాగితాలమీద, నాణేలమీద మూడు సింహాల (నాలుగో సింహం బుర్ర అవతలవైపుంటుందిట) బొమ్మ పెట్టారు మన తెలివైన పెద్దలు. బౌద్ధమతం - సిఖ్ఖు మతం కూడా హిందూమతంలోని అంతర్భాగాలే అనుకుంటారుట కొంతమంది కాని సిఖ్ఖులు, బౌద్ధులు మాత్రం అలా అనుకుంటారో అనుకోరో భారతదేశంలో అందరికే తెలుసు. బుద్ధభగవానుడు పుట్టిన దేశం నేపాల్ అసలు సిసలు హిందూదేశం అయింది. బుద్ధుడు ఆదరణ పొందిన భారతదేశంలోని రాజముద్రలు ప్రభుత్వ చిహ్నాలు అన్నీ "బౌద్ధ స్మారక చిహ్నాలు" - భారతదేశంలో వున్న గొప్పతనమే అది. ఈ దేశమే ఒక పుష్పక విమానం - ఎన్ని మతాలు యిజాలు తలెత్తినా మరో కొత్త మతానికి కొత్త పార్టీకి యిక్కడ చోటు వుంటుంది. షాబుద్దీన్ గారందుకునే కొత్త పార్టీ పెట్టతేనే బెటర్ అనుకున్నాడు. ప్రభుత్వంలో వున్న పార్టీ ఏదైనా దాంతో బేరం పెట్టుకోడానికి కొత్త పార్టీయే మంచిది !

అది అయిన తరువాత జైళ్లు నింపడానికి పూనుకున్నారు కాంగ్రెసువాళ్లు. ప్రజా ధనం చాలా ఖర్చు చేస్తే తప్ప తెలుగుదేశం గవర్నమెంటు - కాంగ్రెసువారిని జైళ్లల్లో పెట్టి - మళ్లీ విడుదల చేయలేదు - కనుక జైల్ భరో వల్ల పరోక్షంగా వెచ్చించబడ్డది ప్రజాధనమే! కాని ఎన్నిక లొస్తున్నాయి కనుక యేదో విధంగా ప్రజల కళ్లల్లో పడటానికి యీ జైలు కెళ్లడం రావటం - చేశారు చెన్నారెడ్డిగారి అనుయాయులు అనుకోవాలి - రాజకీయ పార్టీలు ఎటువంటి వేలం వెర్రివేషాలు వేసినా ప్రజలు సీరియస్‌గా పట్టించుకోరు - అదో తమాషాగా వుంటుంది కనుక పత్రికలకి మేత కూడా కనుక యిటువంటి వాటిని మనం 'వెల్‌కమ్' చేయాలి. కొంతకాలం క్రితం తెలుగుదేశం 'బాస్' శ్రీ ఎన్.టి.ఆర్. రోడ్డుమీద "పవ్వళింపు సేవలు" అందుకోలేదా? కాంగ్రెసు వారు మరో పని చేస్తే కేంద్రం అధీనంలో వుండి విపరీతంగా నష్టపోతున్న పోస్టలు డిపార్ట్‌మెంట్‌కి కొంచెం ఉడతాభక్తి సేవ చేసినవారవుతారు - ఎందుకంటే యీ ఏడాది పోస్టాఫీసు బిజినెస్‌లో 70 కోట్ల నష్టం వుంటుందని శ్రీ గిరధర్ గోమాంగో గారంటున్నారు - కాంగ్రెసువారంతా తలో పోస్టు కార్డు తీసుకొని రాష్ట్రపతి పేర లేదా యిష్ట దైవం పేర శ్రీ ఎన్.టి.ఆర్., గవర్నమెంట్‌ని బర్తరఫ్ చేయమని కోరుతూ ఉత్తరాలు రాయించి పోస్టు చేయించితే బాగుండదూ? - మనలో మాట పోస్టాఫీసు బిజినెస్‌లో "లాస్" ఎందుకురాదు? ఆదివారం - ఆదివారమని - సోమవారం మహార్నవమి అని మంగళవారం దశమి అని వరుసగా మూడేసి రోజులు పోస్టాఫీసులు మూసేస్తాంటే! దేశంలో దసరా గ్రీటింగులు అమ్ముకునేవాళ్ల పొట్టకొట్టారా విధంగా - బానిసదేశంలో ఆదివారాలు ఎక్స్‌ప్రెస్ డెలివరీలు యిచ్చేవారు యిప్పుడు అమావాస్యకి, పౌర్ణమికి గూడా శలవులు యిచ్చేలాగ వున్నారు - ఇదేం దారుణం అని అడిగే ప్రతిపక్ష పుణ్యాత్ముడు లేడు దేశంలో !

**- వీరాజీ**




## తర్వాత ఏమిటి ?

కోటి సంతకాలు- వేలిముద్రల ఉద్యమం అయిపోయింది. కాంగ్రెసు పార్టీకి దీనివల్ల ఏమొచ్చిందో చెన్నారెడ్డిగారికే తెలియాలి -


రాగతి పండరి


అదేమిటో....
కూరతాలింపుల్లో
నూనె వెయ్యకుండా
ఇలా ఎట్లా వండేవ్!


రేపు దీపావళి
ప్రమిదల్లోకి
నూనె కావద్దూ మరి


ఇంత సేపూ
దీపావళి జువ్వలు
బాగా ఎగరేసి
వచ్చారా!


కంగారు పడకు పండగనాడు మా ఆవిడ
ముస్తాబు ఇంతే - పండగ పనిలో అసలు
తీరిక వుండదు మరి!!




దొంగాడు ఇల్లంతా
దోచుకెళ్లినా ఇవి వదిలేసి
వెళ్లాడు.....
నూనె డబ్బా


వెధవది....
3 సౌండు బాంబులంటే
వున్న భయం
పెళ్లాం అంటే లేదాదినా!


ఢాం

# సీరియల్

# ద్రౌపది

## ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ–21 :** ద్రౌపదితో ఖాండవప్రస్థం చేరిన పాండవులు నారదుని సలహాపై రాజసూయయాగం నిర్వహిస్తారు. మయ సభలో తనకు జరిగిన పరాభవానికి ప్రతీకారంగా దుర్యోధనుడు పాండవుల సంపదను హరించి, ద్రౌపదిని నిండు కొలువులో అవమానిస్తాడు. ధృతరాష్ట్రుడివల్ల దాస్య విముక్తి పొందిన పాండవులు అనుద్యూతంలో ఓడిపోయి అడవుల పాలవుతారు. పన్నెండేళ్ల అరణ్యవాసానంతరం పాండవులు మత్స్య దేశాధీశుడు విరాటరాజు కొలువులో మారు పేర్లతో ఆశ్రయం సంపాదిస్తారు. సైరంధ్రిని చెరబట్టేందుకు యత్నించిన సుధేష్ణ తమ్ముడు కీచకుని వధకు నర్తనశాలలో ముహూర్తం పెడతాడు భీముడు.

కీచకుడికి కూడా ఆ రాత్రి నిద్రలేదు.

తన బలాన్ని పశుబలమని నిందించి, తన ఐశ్వర్యాన్ని కాలదన్ని తన ప్రేమను నిర్లక్ష్యంగా తిరస్కరించిన సైరంధ్రి ముందు మోకరిల్లయినా ఆమె సౌందర్యాన్ని దోచుకోవాలన్న కామాతురతలో వున్నాడు వాడు. ఆమెకోసం తల్లడిల్లి పోతున్నాడు. ప్రొద్దున్నే సుధేష్ణ మందిరానికి వచ్చి ద్రౌపది కోసం వెదికాడు. ద్రౌపది కావాలనే అతని కంట పడేలా పది సార్లు లోపలికీ బయటకూ తిరిగింది. కీచకుడు ఆమెను సమీపించి 'ఇప్పటికైనా నీకు నా శక్తేమిటో తెలిసి వుంటుంది విరటుడు నామమాత్ర ప్రభువు. అతనికి నేనంటే భయం. నువ్వు నిన్న కొలువుకి వెళ్ళి మొరపెట్టుకుంటే నిన్ను రక్షించడానికి ఒక్కడూ ముందుకు రాలేదు. చూశావుగా? ఇకనైనా నాతో వచ్చి సుఖంగా వుండు. మహారాణిలా అన్ని భోగాలూ అనుభవించు.' అన్నాడు.

ద్రౌపది వయ్యారాలు పోయింది. ప్రేమ నటించింది. 'కీచకా! నువ్వంటే నాకిష్టమే. కాని లోకులెవరైనా చూస్తారేమోనని తగని భయం నాకు. మన సమాగమం మూడో కంటికి తెలియ నివ్వనని ఒట్టేస్తే.....' అని కళ్ళతో నే కవ్వించింది.

కీచకుడు పరవశుడయ్యాడు.

'నేను నీ దాసుణ్ణి, నువ్వు చెప్పినట్టే చేస్తాను. నువ్వు నాకోసం ఎక్కడికీ రానక్కర్లేదు. నేనే నువ్వు వున్న చోటుకి రహస్యంగా వస్తా. నా కౌగిట్లో నిన్ను ఆనందపు అవధులు దాటిస్తా' అన్నాడు.

అప్పుడతని కళ్ళలో కదలాడిన కాంక్ష చూసి ద్రౌపది నవ్వుకుంది.

'అట్లావద్దు. నువ్వు నా దగ్గరికి వస్తే అందరికీ తెలుస్తుంది. మనం ఏ అరమరికలూ లేకుండా, ఎవరి భయమూ లేకుండా ఒకరితో ఒకరు కలిసి పోవాలంటే నర్తనశాల బాగుంటుంది. చీకటి పడితే అక్కడ ఎవరూ వుండరు. ఈ రాత్రికి అక్కడికి రా. నిన్ను కోర్కెల పందిరి ఎక్కిస్తా' అంది.

కీచకుడు పరమానంద భరితుడయ్యాడు.

ద్రౌపది అంత తేలికగా లొంగుతుందనుకో లేదు వాడు.

వెలుగు పోయి చీకటిప్పుడౌతుందా అని కాచుకు కూర్చున్నాడు. రాత్రవగానే మంగళస్నానం చేసి తెల్లటి పంచె కట్టి తెల్లటి ఉత్తరీయం భుజం మీద వేసుకుని, చందనాను లేపనం సింగారించుకుని సైరంధ్రి దగ్గరకు బయలుదేరాడు. కీచకుడు నర్తన శాలకు వస్తున్నాడని తెలిసి భీముడు ఆడవేషంలో అంతకుముందే అక్కడికి చేరాడు. రాణివాసం నుంచి ద్రౌపది కూడా వచ్చింది. ద్రౌపది కీచకుడి కంట పడకుండా ఓ స్తంభం చాటున దాక్కుంది. ఆడవేషంలో వున్న భీముడు పట్టు చీర చుట్టుకుని నర్తన శాలలో సిద్ధం చేసిన పర్యంకం మీద అటువైపుకు తిరిగి పడుకున్నాడు. గడియ వేయకుండా తలుపులు తెరచి వున్న నర్తన శాలలోకి చడీ చప్పుడూ కాకుండా ప్రవేశించాడు కీచకుడు.

పర్యంకం చేరుతూనే భుజం మీద చెయ్యి వేసి 'మాలినీ! అందాల సుందరీ' అన్నాడు.

ఆడ వేషంలో వున్న భీముడు వులకలేదు, పలకలేదు.

కీచకుడు పక్కనే కూర్చుంటూ –

'ఒక్క ఆభరణం లేకపోయినా ఎంత అందంగా వున్నావు!' అంటూ ముఖాన్ని తన వైపుకు తిప్పుకో బోయాడు.

సైరంధ్రికి కోపం వచ్చిందేమో అనుకుని వూరడింపులూ, బుజ్జగింపులూ, లాలింపులూ మొదలెట్టాడు.

'కీచకా! స్త్రీ వశీకరణలో నువ్వు యింతటి ఘటికుడవని నాకు తెలీదు' అంది పర్యంకం మీది పడతి.

'ఆహా! నా చిలక మాట్లాడిందే' అంటూ కీచకుడు 'ఏదీ దగ్గరకు రా' అని పిల్చాడు.

అంతే. భీముడు లేచి నిల్చున్నాడు. వికటాట్టహాసం చేశాడు. జరిగిన మోసం గ్రహించి కీచకుడు కయ్యానికి దిగాడు.

నర్తన శాలలో భీముడూ కీచకుడూ యుద్ధం చేసుకుంటున్నారు. ఆ కాలంలో అలవి మాలిన బలవంతులు నలుగురే నలుగురు. ఒకడు భీముడు. రెండు శల్యుడు. మూడు బలరాముడు. నాలుగో వాడు కీచకుడు. వాళ్ళు ఒకళ్ళ చేతిలో ఒకళ్ళు చావల్సిందే కాని అయిదో వాడి చేతిలో చావడం అసంభవం.

అలాంటి మహావీరులు భీమ కీచకులు, వాలి సుగ్రీవుల్లా చాలా సేపు భీకరంగా పోరాడుకున్నారు.


ఆయువుపట్లలో పొడుచుకున్నారు. మోచేతులతో_
కుమ్ముకున్నారు. గుట్టు చప్పుడుగా గొంతులు
పిసుక్కున్నారు. పిడి గుద్దులు గుద్దుకున్నారు.
ఉక్కు పంజరం వంటి బాహుమధ్యంలో కీచకుణ్ని
భీముడు బంధిస్తే_ కీచకుడు తప్పించుకుని భీముడి
మీద కురికి గుండెల మీద బలంగా తన్నాడు.
భీముడు ఆ దెబ్బని పట్టించుకోలేదు. ఎగిరి కీచకుడి
రొమ్ము మీద కూర్చున్నాడు. పిడికిలి బిగించి

పైకెత్తాడు. "నీవంటి వాళ్ళ వల్లే భూమికి పాపభారం పెరిగింది. అహంకారం, మదం, మత్సరం, స్త్రీలోలత ఆవేశించిన నీ బోటి దౌర్భాగ్యుల వల్లే దేశంలో అరాజకత్వం పెరుగుతోంది. నిన్ను సంహరిస్తే గాని భూమాత సంతోషించదు" అని ఒక్కపోటు పొడిచాడు.

కీచకుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు. భీముడు వాడ్ని పట్టుకుని వుండలా చుట్టి దూరంగా పారేశాడు. సంతోషం పట్టలేక ద్రౌపది వచ్చి భీముణ్ణి గట్టిగా చుట్టేసుకుంది. అతని ముఖాన్ని ముద్దుల్తో ముంచింది. రొప్పుతూన్న భీముణ్ణి గుండెల్తో చేర్చుకుని సేదతీరేవరకూ అనునయించింది.

ఆ తరవాత భీముడు లేచి పాకశాల వేపు నడిచాడు.

సైరంధ్రి, రాణి వాసానికి నడిచింది.

ఎవరూ చూడకుండా గబగబా వెళ్ళి, శరీరానికి అంటుకున్న రక్తమంతా కడుక్కుని స్నానం చేశాడు భీముడు. నెత్తురు కంపు పోయేలా మంచి గంధం పూసుకున్నాడు. జరిగిందంతా తలుచుకుని చిరునవ్వు నవ్వుకుంటూండగా ఇంతలో –

"ఓ దయామయా! జయా! ఓ మహాబలవంతా! జయవంతా! శౌర్యతేజోమయా ఓ విజయా! దీనావనా! ఓ జయత్సేనా! పరాక్రమ శీలా! ఓ జయద్బలా! రండి! రక్షించండి! వీళ్ళు నన్ను కీచకుడి శవంతో కట్టి శ్మశానానికి తీసుకు పోతున్నారు. ఓ గంధర్వ పతులారా త్వరగా రండి. మీ ధర్మపత్నిని కాపాడండి" అంటూ ఆర్తనాదం చేస్తున్న ద్రౌపది గొంతు వినపడింది. భీముడు అదిరి పడ్డాడు.

క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా ప్రాకారపు గోడ దాటి శ్మశానం వైపు పరుగెత్తాడు.

ఒక పెద్ద చెట్టు పీకి భుజాన వేసుకుని కోపంతో శరీరాన్ని పెంచి, భయంకరాకారం ధరించి నిలబడ్డాడు.

"....అదుగో గంధర్వుడు! చచ్చాం! పదండి! పరుగెత్తండి!" అని కీచకుడి శవాన్నక్కడే పారేసి అరుస్తూ పరుగెత్తారు అక్కడి వాళ్ళంతా.

కొందరు గబగబ అక్కడ వున్న చెట్లెక్కారు. మరికొందరు దగ్గరలో వున్న మడుగులో దాక్కున్నారు. ఇంకొందరు భయంతో కాళ్ళాడక నేల మీద చతికిలబడి పోయారు.

భీముడు వాళ్ళని చూసి పెద్దగా నవ్వుతూ నాలుగడుగులు ముందుకు వేశాడు. పారిపోతున్న వాళ్ళందర్నీ వెనక్కి మళ్ళించి, దాక్కున్న వాళ్ళను బయటకు ఈడ్చి అందర్నీ ఒకేతీరున చిత్రవధ చేశాడు.

అప్పటికి గాని అతని మనసుకు ఊరట కలగలేదు. పక్కకు తిరిగి చూసేసరికి, మాంసపు ముద్దలా వున్న కీచకుడి శవం పక్కన తాళ్ళతో బంధింపబడిన సైరంధ్రి కనిపించింది.

గబ గబా ఆమె కట్లు వూడదీసి

'పాంచాలీ! ఏమిటిదంతా? మళ్ళీ ఏమైంది?' అని అడిగాడు.

ద్రౌపది వెక్కి వెక్కి ఏడుస్తూ తెరలు తెరలుగా మాట్లాడ్డం మొదలు పెట్టింది.

'భీమసేనా! ఏం చెప్పను? కీచకుణ్ణి చంపి నువ్వెళ్ళి పోయాక నేను రాణి వాసానికి వెళ్ళి అక్కడ వున్న వాళ్ళతో "నన్నవమానించి నా భర్తలైన గంధర్వుల చేతుల్లో చచ్చి పడున్నాడు కీచకుడు. వెళ్ళి చూడండి" అన్నాను. వాళ్ళందరూ కాగడాలు తీసుకు వెళ్ళి వాటి వెలుతురులో కీచకుడి శవాన్ని చూసి పెద్దగా అరవడం మొదలు పెట్టారు. ఉపకీచకులకీ సంగతి తెలిసి పరుగెత్తు కెళ్ళారు. ముక్కూ మొహమూ ఏకమైన అన్న శవాన్ని చూసి వాళ్ళు నేల మీద పడి దొర్లుతూ ఏడ్చారు. "అసలు కాళ్ళేవి? చేతులేవి? శిరస్సేది?" అనుకుంటూ వాళ్ళేడుస్తుంటే నేను కుతూహలం పట్టలేక ఒక చెట్టు చాటు నుంచి తొంగి చూసేసరికి "అదిగో! ఆ

# లేపాక్షి బసవయ్య

"లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా" అంటూ అడవి బాపిరాజు గానం చేసింది, అనంతపురం జిల్లా, లేపాక్షిలోని 'బసవన్న'ను గూర్చే. అక్కడ విజయనగర రాజుల కాలం నాటి అపూర్వ శిల్ప సంపద కాలవాలమైన ఆలయాలున్నాయి. అచట కొంత దూరములో అందర్నీ ఆకర్షించి అలరించేది బ్రహ్మాండమయిన "బసవడి" (నంది) విగ్రహం. బండరాతిని బసవన్నగా మార్చిన అజ్ఞాత శిల్పుల పనితనం అత్యద్భుతం.

ఇక్కడ శిల్పుల ఉలులు ఊపిరి పోసుకొని ఉత్సాహముతో ఉరకలు వేసి, ఉన్నతోన్నతమైన ప్రతిభను ప్రదర్శించి బసవన్న విగ్రహాన్ని చెక్కాయి. అక్కడ పడి వున్న బ్రహ్మాండమైన బండరాతినే, దక్షిణ దిశనున్న దక్షిణేశ్వరుణ్ణి తిలకిస్తున్నట్లు మలచిన 'నంది' ఇది.

ఈ బసవయ్యను క్రింది నుండి చూస్తే పూర్తిగా చూడలేము- పైకెక్కి అడుగడుగూ పరిశీలించి చూచి ఆనందించవలసిన "లేపాక్షి బసవయ్య" ఈయన లేచే దెప్పుడో!- కలియుగం అంతమెప్పుడో!!

సేకరణ : శ్రీమతి వి. విజయలక్ష్మీరెడ్డి



పాపిష్టిదే సింహబలుడి ప్రాణాలు తీసింది. పట్టుకోండి. దీన్ని మన అన్న శవంతో పాటు కాల్చి పారేద్దాం. మదన వేదనతో ప్రాణాలు కోల్పోయిన మన అన్న ఆత్మకు శాంతయినా కలుగుతుంది" అంటూ అందరూ నన్ను పట్టుకున్నారు. ఒకడు వెళ్ళి నన్ను కూడా కీచకుడితో కలిపి దహనం చేసేందుకు విరటుడి దగ్గర అనుమతి తీసుకు వచ్చాడు. వెంటనే నన్ను ఈ శవం మీద పడేసి గట్టిగా తాళ్ళతో బంధించి శ్మశానానికి తీసుకుపోతు ంటే భయపడిపోయి మిమ్మల్నందర్నీ పిలుస్తూ గట్టిగా ఏడ్చాను' అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

భీముడు ఆమెను ఓదార్చి 'ఉపకీచకులందరూ నా చేతుల్లో చచ్చారు. నువ్వింక నిశ్చింతగా అంతఃపురానికి వెళ్ళు' అని ద్రౌపదిని సాగనంపి తను గబగబ పాకశాల వైపు కదిలి వెళ్ళిపోయాడు. అప్పటికి లీలగా తెల్లవారుతోంది.

సైరంధ్రి శ్మశానం దాటి ఇవతలకు వచ్చి దగ్గర్లో వున్న పద్మసరోవరంలో సచేల స్నానం చేసింది. సూర్యుడు ఆకాశపు వాకిళ్ళు తెరుచుకుని మెల మెల్లగా బయటకు వస్తున్నాడు. సైరంధ్రి రాజ వీధి వెంట అంతఃపురానికి వెడుతూంటే ఆమెను చూసి జనమంతా హడలిపోయారు. ఆడ పులిని చూసిన లేడిపిల్లల్లా పారిపోతున్న ప్రజలను చూసే సరికి సైరంధ్రికి పట్టరాని నవ్వొచ్చింది. కాని నిగ్రహించుకుని మెల్లగా రాణివాసంలోకి ప్రవేశించింది. సంతోషాన్ని ప్రకటిస్తున్న శరీరాన్నీ, మనస్సునూ అదుపు చేసుకుంటూ ఏమీ ఎరగనట్టే మామూలుగా మహారాణి దగ్గరకు వెళ్ళింది సైరంధ్రి.

సైరంధ్రిని చూడగానే సుధేష్ణకు ముచ్చెమటలు పోశాయి. భయం, సంభ్రమం, శోకం అన్నీ ఒకేసారి కలిగాయి మహారాణికి. సహోదరులందరూ ఒకేసారి చచ్చిపోయే సరికి ఆ శోకం భరించ లేకుండా వుందావిడ.

పెద్దగా ఏడ్చేసింది.

ఇంతలో విరటుడు వచ్చాడు.

మహారాజును చూస్తూనే సైరంధ్రి అక్కడ నుంచి తప్పుకుంది.

'... మహారాణీ! జరిగిన దానికి విచారించి లాభం లేదు. ఇకనైనా సైరంధ్రిని ఇక్కడ నుంచి వెళ్ళి పొమ్మని నా మాటగా చెప్పు. మగవాళ్ళామె దగ్గరకు వెడితే ఏం చేటు మూడుతుందో నని భయం వేస్తోంది. లేకపోతే నేనే చెబుదును. అదీగాక ఇలాంటి విషయాలు మగవాళ్ళు చెప్పేకన్నా ఆడవాళ్ళు చెబితేనే బాగుంటుంది. ఆమె చూడబోతే అందాల రాణి! ఇక ఈ పురుషులం చూవా భోగలాలసులం. ఆమెను చూసి ఉన్మాదులై ఏం పిచ్చి వేషాలు వేస్తారో తెలీదు. అందుకని ముందే మంచి మాటలతో సైరంధ్రిని సాగనంపటం మంచిది' అన్నాడు విరటుడు సుధేష్ణ కన్నీరు తుడుస్తూ.

సుధేష్ణ కూడా మహారాజు చెప్పింది నిజమే అనుకుంది. విరటుడు వెళ్ళిపోయాక సైరంధ్రిని పిలిచి 'మాలినీ! నువ్వు అతిలోక సౌందర్యవతివి. మగవాళ్ళు చాలా చంచల మనస్కులు. ఎప్పుడేం సంభవిస్తుందోనని మహారాజు భయపడుతున్నారు. నిన్ను ఈ రాజ్యం వదిలి వెళ్ళిపొమ్మని తన ప్రార్థనగా నీతో చెప్పమన్నారు. నా తమ్ముళ్ళందరూ నీ కారణంగా....' అని ఏదో అనబోయి దుఃఖంతో గొంతు పూడుకు పోవడం వల్ల మాట్లాడ లేకపోయింది మహారాణి. కొంచెం సేపటికి తెప్పరిల్లుకుని 'బలవంతులైన భర్తలున్నారని వరస పెట్టి అందర్నీ చంపిస్తున్నావు. ప్రజలందరూ నీ పేరు వినడానికే భయపడుతున్నారు. నీకు పుణ్యం వుంటుంది. మా రాజ్యం వదిలి పెట్టి ఎక్కడికైనా వెళ్ళిపో' అంది బ్రతిమాలుతూ.

'మహారాణీ! ఇంకొక్క పదమూడు రోజులు ఆశ్రయ మిచ్చారంటే నా ప్రతిజ్ఞ తీరిపోతుంది. సైరంధ్రి ప్రతిజ్ఞేంటోందేమిటా అని భయపడకండి. ఇన్నాళ్ళూ నాకు ఆశ్రయమిచ్చి ఆదుకున్న మీ దంపతులకు నా గంధర్వ పతులు కనబడి కృతజ్ఞతలు చెప్పకుంటారు. అమ్మా! నాకు నేనై చెప్పుకోకూడదు కాని నా భర్తలు కరుణామయులు! ఉపకారపరులు! మీకు ఏదో విధంగా మేలు చేసి తీరుతారు. నా మాట నమ్మండి. మీకు సేవలు చేసిన సైరంధ్రిని మాత్రం నిర్దయగా వున్నట్టుండి వెళ్ళిపొమ్మనకండి' అని జాలిగా అడిగింది మాలిని.

'సరే! అయితే ఈ పదమూడు రోజులూ వుందువు గానిలే! నీ మనస్సుకు ఎలా సంతోషం కలుగుతుందో అలాగే అన్ని ఏర్పాట్లూ చేయిస్తాను. నా భర్తనూ, నా కొడుకున్నీ మాత్రం కొంచెం కనిపెట్టి చూస్తూ వుండు' అని సైరంధ్రిని పంపించేసి శయన మందిరంలోకి వెళ్ళిపోయింది మహారాణి.

(ఇంకా వుంది)




ముడిపెడుతూ ఉంటారు. ఎక్కువమంది ఫెయిల్ అయితే స్టాండర్డ్ బాగుందని అనడం ఆమోదయోగ్యమయిన విషయం కాదు. నిజానికి అభివృద్ధి చెందిన దేశాల్లో పరీక్షల్లో ఫెయిల్ కావడం అనేది లేదా ఆ భావనను అంగీకరించరని, ఇంగ్లాండులో అయితే అసలు డిటెన్షన్ పద్ధతి లేనేలేదని అన్నారు.

మన రాష్ట్రంలో 7 మరియు 10వ తరగతుల్లో డిటెన్షన్ పద్ధతి ఉంది. దీనిపట్ల మన దృక్పథం మారాలి. ఎక్కువ శాతం విద్యార్థులు కృతార్థులయ్యేటట్లు శ్రమించాలి.

విద్యార్థి పరీక్షల్లో కృతార్థుడయ్యేందుకు ఉపాధ్యాయులు, తలిదండ్రులు, మేనేజ్‌మెంట్లు, తదితర సాంఘిక వ్యవస్థలు పాటు

# "విద్యా బోధనలో మార్పు"

## పాఠశాలల విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ టి. వెంకారెడ్డి

పాఠశాలలు తెరిచే సమయానికి విద్యార్థులకు పాఠ్య పుస్తకాలు సరఫరా చేయడంలో ప్రభుత్వం ఎందుకు సఫలీకృతం కావడంలేదన్న ప్రశ్నకు ఈ సంవత్సరం అటువంటి పరిస్థితి ఉత్పన్నంకాదని పుస్తకాలు కావలసినంత స్టాకు ఉందని సామాన్యంగా పుస్తకాలు మారకపోతే ఇబ్బంది ఉండదని పాఠశాలల విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ టి. వెంకారెడ్డి జవాబు చెప్పారు.

పుస్తకాలు మారినప్పుడు వాటిని ప్రింటు చేయించడంలో ఒకొక్క సమయంలో జాప్యం అవుతూ ఉంటుంది. పైగా పాఠశాలల్లో చేరే విద్యార్థుల సంఖ్య బాగా పెరుగుతోంది, విద్యా సంస్థలు పెరుగుతున్నాయి. ఇవన్నీ దృష్టిలో ఉంచుకుని పుస్తకాల ప్రచురణ విషయంలో చర్యలు తీసుకుంటున్నట్లు చెప్పారు.

ఉన్నత విద్యకు వెళ్లేసరికి డ్రాపవుట్సు సంఖ్య ఎక్కువగా ఉంటోందన్న ప్రశ్నకు విద్యావ్యవస్థకు సంబంధించిన విషయాలను వెల్లడిస్తూ- దానికి మన సైకాలజీ ప్రధాన కారణంగా కన్పిస్తుందన్నారు. విద్యాస్థాయి, క్వాలిటి కృతార్థులయిన వారి శాతంతో

**శ్రీ టి. వెంకారెడ్డి (ఐ.ఏ.ఎస్.)**

**1933** సెప్టెంబర్ 4న వ్యవసాయ ప్రధానమైన కుటుంబంలో, జన్మించిన శ్రీ తాటిపర్తి వెంకారెడ్డి విద్యాశాఖలో అనేక పదవులు నిర్వహించి ప్రతిస్థానంలోను తనదైన ప్రత్యేక బాణిలో ఆ పదవులకు మరింత అందాన్ని చేకూరుస్తూ ప్రస్తుతం పాఠశాలల విద్యాశాఖ డైరెక్టర్‌గా తన పదవీ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. విసుగు, చిరాకు వంటి పదాలు తెలియని వెంకారెడ్డి విశ్రాంతిని దూరంగా ఉంచి సీటులో కూర్చున్నది మొదలు తిరిగి ఆఫీసు నుండి బయటకు వెళ్ళేవరకూ కంప్యూటర్‌లా పనిచేస్తూ ఏ పనిని వాయిదా వేయకుండా, వచ్చిన వారిని గౌరవిస్తూ, వారి సమస్యలకు సున్నితంగా పరిష్కారాలు చెబుతూ తన వద్ద పని చేసే ఇతర ఆఫీసర్లకు అత్యంత ప్రాధాన్యం ఇస్తూ జటిల సమస్యల పరిష్కార విషయంలో వారికి చక్కని సలహాలిస్తూ తను సంతోషంగా విధి నిర్వహణ చేస్తూ ఇతరులను సంతోషంగా ఉండేటట్లుచేసే ఉన్నత వ్యక్తిత్వంగల మహామనిషి. 1986లో ప్రభుత్వం ఈయనకు ఐ.ఏ.యస్. ఇచ్చింది.

పడాలి. ఏడు, పది తరగతుల్లోనే కాదు ఇంటర్‌లో కూడా కృతార్థుల శాతం బాగా పెరగాలి.

ఒక విధంగా ఆలోచిస్తే ప్రభుత్వం సాలీనా పాఠశాల విద్యపై ఖర్చు చేస్తున్న ఆరు వందల కోట్ల రూపాయల్లో నలభయి శాతం విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారంటే అంతే శాతం డబ్బు ఉపయోగపడిందనిపిస్తుంది. మిగిలిన అరవై శాతం నిరుపయోగం అయిపోయింది గదా? ఇవన్నీ దృష్టిలో ఉంచుకుని ఉపాధ్యాయులు తమ బాధ్యతను గుర్తెరిగి విధి నిర్వహణ సాగించాలి. సగటు విద్యార్థి కన్నా తక్కువ స్థాయి గల విద్యార్థి పాస్ మార్కు తెచ్చుకునే విధంగా తరగతి గదిలో ఉపాధ్యాయుడు విద్యాబోధన చేయాలి.

డ్రాపవుట్సులో భిన్నరకాలు విశ్లేషిస్తే తెలుస్తాయి. కొంతమంది పరీక్షలో ఫెయిల్ కావడంతో చదువుకు స్వస్తి చెబుతారు. పది మరియు ఏడవ తరగతులలో రిపీటర్సు కన్పిస్తారు. వీరు పరీక్ష పోయినప్పటికిని చదువు (అదే తరగతి) కొనసాగిస్తారు.

సంక్షేమ రాష్ట్ర నినాదంలో అందరికీ ఆహారం, అందరికీ ఆరోగ్యం, అందరికీ విద్య అవసరం. అందుచేత ఏ బలహీనత కారణంగా విద్యార్థి చదువుకు స్వస్తి చెపుతున్నాడో గుర్తించి దానికి నివారణ పద్ధతులు అన్వేషిస్తే డ్రాపవుట్సు సంఖ్య బాగా తగ్గిపోతుంది.

విద్యారంగానికి గవర్నమెంటు విడుదలచేస్తున్న గ్రాంట్సు సరిపడతాయా? అని ప్రశ్నిస్తే చక్కగా సరిపడతాయని చెబుతూ గ్రాంట్ ఇన్ ఎయిడ్ అనే సాంప్రదాయం బ్రిటిష్ ప్రభుత్వం ప్రారంభించిందని దురదృష్టవశాత్తు కొన్ని మేనేజ్‌మెంట్స్ దీనిని దుర్వినియోగం చేస్తూ తమ స్వలాభాలకు ఈ నిధులను వాడుకుంటున్నాయని అన్నారు.

హైస్కూలు స్థాయిలో విద్యార్థులలో అశాంతి ఏదీ లేదని విద్యార్థి చురుకుగా ఉండేందుకు తన ఆలోచనాశక్తిని పదును పెట్టేందుకు అనువైనా సందర్భపరమైన పాఠ్య ప్రణాళిక ఎంతో అవసరమని అటువంటి పరిస్థితి కల్పించడం కోసం మార్పులు జరుగుతూ ఉంటాయని అన్నారు.

పాఠ్యప్రణాళికల్లో ఎటువంటి అంశాలకు ప్రాధాన్యత ఎక్కువ కల్పించాలని భావిస్తున్నారని అడిగిన ప్రశ్నకు జవాబుగా జాతీయ భావనలు విలువలు పెంపొందించుటకు భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, రాజ్యాంగములో ఇవ్వబడిన హక్కులు, బాధ్యతలు, జాతీయభావనావికాసమునకు తగినవిషయాలు, భారతీయ సంస్కృతీ సాంప్రదాయ వరంపర, సమానత్వము, ప్రజాస్వామ్యము, సామ్యవాదము, స్త్రీ పురుషుల సమానత్వము, వాతావరణ పరిరక్షణ సాంఘిక పరిధుల తొలగింపు, చిన్న కుటుంబ భావన, శాస్త్రీయ దృక్పథము యొక్క పెంపుదల పాఠ్యప్రణాళికలో ప్రధాన అంశాలుగా ఉండేవిధంగా సిలబస్ నిర్మాణం చేస్తున్నాము.

పాఠశాలల్లో సైన్సు సిలబస్‌లో రాబోయే సంవత్సరాల్లో మార్పులు ఏమైనా ప్రవేశపెడుతున్నారా? ప్రస్తుత బోధనా విధానానికి భిన్నంగా ఉంటుందా మీరు ప్రవేశపెట్టదలచుకుంటే? అని అడిగినప్పుడు- ప్రస్తుత విధానంలో సైన్సు ప్రాక్టికల్స్, ఉపాధ్యాయుడు చేసి చూపించే ప్రయోగాలు దాదాపు పూర్తిగా మరచిపోయారు. ప్రయోగాలను విస్మరించి సిలబస్‌ను పెంచారు. సైన్సును ఉపన్యాసంగా



చెపితే ఎలా? సైన్సును ప్రయోగాలు చేస్తూ నేర్చుకోవాలి. సైన్సు బోధన బోధనోపకరణలు (టీచింగ్ ఎయిడ్స్) సహాయంతో కొనసాగాలి. తరగతి గదిలో జరుగుతున్న సైన్సు బోధనా విధానంలో బాగా అభివృద్ధికరమైన మార్పులు రావాలి. దీనికి తగ్గట్టుగా సైన్స్ సిలబస్ నిర్మాణం చేస్తున్నారు కదా! అన్నారు.

సైన్సు ప్రాక్టికల్సు విద్యార్థులకు పాఠశాల స్థాయిలో కంపల్సరీ చేస్తారా?

'అవును. ప్రతితరగతిలోను కనీసం పది ప్రాక్టికల్సు నిర్ణయించదలచాం. అందులోయాభైశాతం ప్రయోగాలయినా ప్రతివిద్యార్థి తప్పనిసరిగా చేయాలనే నిబంధన పెట్టదలచాం' అన్నారు.

'దీనివల్ల ప్రతి విద్యార్థికి సైన్సువట్ల ఆసక్తి కలుగుతుందంటారా?'

'ఇందులో ఒక విషయం మనం గుర్తించాలి. పాఠశాలలో జేరిన విద్యార్థులందరకూ సైన్సు పట్ల ఇష్టత, నేర్చుకోవాలనే కోరిక ఉండకపోవచ్చు. కాని ఉపాధ్యాయులు సులువుగా సైన్స్‌పట్ల ఇష్టతగల విద్యార్థులను గుర్తించి ప్రోత్సహించే అవకాశం వుంటుంది. పైగా వారిలో అంతర్గతంగా ఉండే ప్రతిభ వెలుగుకు వచ్చేందుకు ఇదొక అవకాశం కావాలి' అన్నారు.

'నిర్ణయాలు చురుగ్గా తీసుకోవడం, స్వతంత్రంగా ఆలోచించి కొత్త ప్రాజెక్టులను రూపొందించి విద్యార్థుల భవిష్యత్‌కు పాటుపడటం, పేద విద్యార్థులకు తన పరిధిలలో అదనపు సౌకర్యాలు కలుగజేయడం, ప్రతిభగల విద్యార్థులకు నేషనల్ టాలెంట్ సెర్చ్ పరీక్షలకు ఉచితంగా కోచింగ్ సౌకర్యం కల్పించడం' వెంకారెడ్డి గారిలోని గొప్ప విశేషాలు.

'విద్యా వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చేందుకు అహర్నిశలు కృషిచేయాలనే ప్రేరణ ఎటువంటి విద్యాశాఖాధికారిలోనైన కల్గించగల గొప్ప సమర్థులు శ్రీ వెంకారెడ్డి' అన్నారు ప్రస్తుతం యస్.సి.ఇ.ఆర్.టిలో ప్రొఫెసర్‌గా యున్న శ్రీ డి. రవీంద్ర నాదమ్.

శ్రీ వెంకారెడ్డి వంటి విద్యావేత్త పాఠశాలల విద్యాశాఖ డైరెక్టర్ కావడం రాష్ట్రం చేసుకున్న అదృష్టం అనిపించింది.

ఇంటర్వ్యూ:-సి.వి. సర్వేశ్వరశర్మ



సైన్సు సిలబస్‌ను రూపొందిస్తున్న నిపుణుల బృందం - ఎడమ నుండి వరుసగా కె. బుచ్చిరామయ్య (ఖమ్మం), యన్. రామకిషన్‌రావు (హైదరాబాద్), ఎ.ఎ. ఖాద్రి (సైన్సు కన్సల్టెంట్, హైదరాబాద్), ప్రొఫెసర్ డి. రవీంద్రనాదమ్ (కన్వీనర్), సి.వి. సర్వేశ్వరశర్మ (అమలాపురం), శ్రీమతి జె. నాగలక్ష్మి (హైదరాబాద్), ప్రొఫెసర్ ఐ.వి. రాధాకృష్ణమూర్తి (విశాఖపట్నం)

# ఒంటరి

వేదవ్ర లక్ష్మి

"రాజీ! నవ్వుతున్నావా యీ పిచ్చివాడిని చూసి? నా యీ అవస్థను చూసి?

ఏం నాకేం తక్కువైందని? రాజభోగా లనుభవిస్తున్నాను రాజీ... మన కొడుకు... మన శేఖర్ పెద్ద డాక్టర్ కావాలని కలలుక న్నాము.... నువ్వు అలా కలలు కంటూనే కన్ను మూసావు. మన శేఖర్ యిప్పుడు పేరు మోసిన సర్జన్ రాజీ... చిన్నప్పుడె ప్పుడో క్రిందికి దిగితే మట్టి అంటుకు పోతుం దని వాడిని 'ఒడి' దిగనివ్వకుండా పెంచేము కదూ? ఇప్పుడు.... జనం వాడిని 'తివా సీల' మీద నడిపిస్తున్నారు... పెద్ద బంగ్లా, అంబాసిడర్ కారు, యింటినిండా నౌకర్లు... కనిపెంచిన నువ్వు యివన్నీ అనుభవించకుం డానే... నన్ను మాత్రం 'మీరైనా అనుభ వించండం'టూ ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపో యావు....'



రఘురామయ్య కన్నీటికొలకుల్లో కన్నీరు నిండి ముడుతలు పడ్డ చెక్కిళ్ళమధ్యగా జారిపో యింది. రఘురామయ్య సాధారణంగా కుడివై పుకి ఒత్తిగిల్లి పడుకుం టాడు... కారణం... అటువైపు గోడకి తగిలించి ఉన్న 'రాజీ' అదే అతని అర్ధాంగి రాజేశ్వరి ఫోటో! నిండు ముత్తైదువలా నవ్వుతూ 'మీరు ఒంటరివాళ్ళు కాదండీ... మీకు తోడు నేనున్నానం'టూ పలకరిస్తూ ఉంటుంది.

అసహనంగా అటునుంచి యిటు ఒత్తిగి ల్లాడు రఘురామయ్య...

'లేచి భోజనం చెయ్యండి..' కరుగ్గా ఉంది ఆ కంఠం! అది రామయ్యది!. వాడికీ తనంటే అలుసే మరి! లేచి కూర్చుని, వడ్డించిన పళ్ళెంవైపు చూసాడు.... ఒక వైపు పులావ్, ఒక వైపు కొద్దిగా అన్నం, గిన్నెతో చారు, ఆవకాయ... తినాలన్న బుద్ధి పుట్టలేదు.

'రామయ్యా.... ఒంట్లో యేమిటో బాగులేదు. తినాలని లేదు.' అన్నాడు... మారు మాట్లాడకుండా పళ్ళెం తీసుకుని వెళ్ళి పోయాడు....'నాకు పనిదండగ' అని సణు గుకొంటూ.

నిర్లిప్తంగా నవ్వుకున్నాడు రఘురా మయ్య. 'రాజీ, చూసావా? నువ్వుంటే నన్ను యిలా పస్తు పడుకో నిస్తావా చెప్పు? బ్రతిమాలి,కొసరి-కొసరి వడ్డించవూ?' అసలు నీ చేతి గుత్తొంకాయకూర లేక జిహ్వ చచ్చి పోయింది రాజీ. ఈ ఫ్యాషన్ తిండిలో, యీ ఖరీదైన జీవితంలో రాజీపడలేక పోతున్నాను... ఈ కృత్రిమమైన వాతావర ణంలో నాకు ఊపిరి సలపడంలేదు రాజీ.... అందుకే.... అందుకే నీ దగ్గరికి వచ్చేయాలని రోజులు లెక్కపెట్టుకుంటున్నాను.' అతని మనసు మూగగా రోదించింది.

రామయ్య వచ్చి చెంబుతో నీళ్ళు పెట్టి లైటార్పి, బెడ్‌ల్యాంపు వెలిగించి, తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయాడు. అతని డ్యూటీ అతను చేసుకుని వెళ్ళిపోయాడు.

నిద్రరాని రఘురామయ్య అటు-యిటు తిరుగుతూ ఆద్యంతంలేని ఆలోచనలతో సత మతమవుతున్నాడు.

హఠాత్తుగా అతని దృష్టి రాజేశ్వరి ఫోటో తాలూకు పగిలిన అద్దం మీద నిలిచిపో యింది! అదెలా జరిగింది? రెండు నెలల క్రిందట జరిగిన సంఘటనని నెమరువేసుకునే ప్రయత్నంలో ఆలాకుర్చీలో వెనక్కి జారగిల బడి కళ్ళు మూసుకున్నాడు.

* * * * * * *

ఆ రోజు శేఖర్, సునీత చలా హడా వుడిగా యిల్లంతా సర్దిస్తున్నారు. ఎవరో 'గెస్ట్స్' వస్తారని రామయ్య చెప్పాడు తనతో. ఏది ఎక్కడ యెలా సర్దాలో సునీత భర్తకి

చెబుతోంది." నలుగురు నౌకర్లు అదే పనిలో ఉన్నారు.

హాలు కెదురుగా గోడకి వ్రేళ్ళాడుతున్న అత్తగారి ఫోటో చూపించి....'అది తీసి పాత ట్రంకుపెట్టెలో పడెయ్ షరీఫ్... అక్కడ.... యిదిగో యీ 'వెల్‌కమ్' బొమ్మ తగిలించు' శేఖర్ ముందు యేదో అడ్డుచెప్పబోయాడు కాని.... సునీత మాటలోని సత్యాన్ని గ్రహించినవాడిలా... 'నిజమే సునీ, అది అక్కడ అలా చాలా అసహ్యంగా ఉంది.... యూ ఆర్ రైట్...' అన్నాడు భార్యవైపు చూసి మెచ్చుకోలుగా.

మరో పదినిమిషాల్లో ఆ ఫోటో దండతో సహా షరీఫ్ చేతిలో ఉంది.... అది ట్రంకు పెట్టెలోకి వెళ్ళే లోగా తను తీసుకోవాలి.... లేకపోతే తెల్లవారగానే నవ్వుతూ పలకరించే ఆ పలకరింపు కూడా ఉండదింక! పరుగు లాంటి నడకలో అక్కడికి చేరుకున్నాడు రఘురామయ్య. తన ఆతృతను గమనించిన షరీఫ్ ముందుకి అడుగువేయకుండానే నిర్లక్ష్యంగా విసిరాడు ఆ ఫోటోని. అప్పుడు పగిలింది ఆ అద్దం! ఆ రోజంతా రఘురామయ్యకి అన్నం సహించలేదు.

'రాజీ! చూసావా కొడుకు-కోడలుకి నీ ఫోటో కూడా బరువైపోయింది.... నేనేమీ చేసే స్థితిలో లేను.... ఆ అలుసు చూసుకుని నీకు 'తద్దినం' కూడా పెట్టడం మానేసారు వీళ్ళు.... నేను నీ తిథి గుర్తు చేస్తే కోడలు యేమందో తెలుసా?.... 'చాల్లెండి ఛాదస్తం... బ్రతికి ఉన్న వాళ్ళకే పూట గడవకుండా ఉంటే చచ్చిన వాళ్ళ పేరుతో యీ తద్దినాలు అవీ పెట్టి పదిమందికీ మేపడానికి యిది కలికాలం....' అంది. నాది ఛాదస్తంట! ఏం చెయ్యను రాజీ, నేను పైసా ఆర్జనలేని వాణ్ణి. ఒంట్లో సత్తువ ఉన్నన్నాళ్ళు రెక్కలు ముక్కలు చేసుకుని వీళ్ళని పెంచి పెద్దవాళ్ళని చేసాను. ఇప్పుడు జవసత్వాలుడిగి కన్నకొడుకుకి కూడా బరువైపోయాను. 'ఇలా చెయ్యమని' దండించడానికైనా అద్దాలలో బిడ్డలు కారే? అందుకే రాజీ... ఏడాది కొక్కరోజు కూడా నీకు పట్టెడన్నం పెట్టలేకపోతున్నాను. పస్తులు ఉంచుతున్నాను. అందుకే నాకు నేను విధించుకున్న శిక్ష యేమిటో తెలుసా? 'ఆ రోజంతా వచ్చి మంచినీళ్లు కూడా ముట్టను నేను.'

అలా తన అర్ధాంగితో మౌనంగానే సంభాషణ జరుపుకుంటూ, తన ఒంటరితనాన్ని పోగొట్టుకుంటున్న రఘురామయ్యకి భావోద్వేగంలో మనసు అట్టడుగు పొరల్లో అప్పుడప్పుడు అణగిపోయిన సంఘటనలు ఒక్కొక్కటే గుర్తుకి వచ్చి ఆమె ముందు తన గోడు వెళ్ళబోసుకున్నాడు. ఆ విధంగానైనా గుండెభారం కొంత తగ్గుతుందని!

'రాజీ... ఆ రోజు గెస్ట్స్ వచ్చిన రోజు ఏమైందో తెలుసా? నన్ను అబ్బాయి నలుగురికీ పరిచయం చేస్తాడని ఉన్న వాట్లో మంచి ధోవతి కట్టుకుని కూర్చున్నాను. ఒక డాక్టరు అదీ పేరుమోసిన సర్జన్ తండ్రిగా నా ఛాతీ ఉప్పొంగిపోయిందంటే నమ్ము. ఇంతలో రెండు కార్లలో దిగేరు అందరూ. రామయ్య నా దగ్గరికి పరిగెత్తుకు వచ్చాడు.

'గెస్ట్స్ వచ్చారా రామయ్యా?' అంటూ ఆతృతగా లేచి నిల్చున్నాను.

'ఆ కబురు చెప్పడానికే వచ్చానండీ... డాక్టర్ బాబుగారు కాస్సేపు మిమ్మల్ని గదిలో నుండి బయటికి రావద్దని చెప్పమన్నారు. మీకే మైనా కావలసి వస్తే నేను మళ్ళీ వస్తాను. అప్పుడు చెప్పండి' అని తలుపులు రెండూ దగ్గరగా వేసి బయట గడియపెట్టుకుని వెళ్లిపోయాడు. చూసావా రాజీశేఖర్‌ని 'నా కొడుకు' అని చెప్పుకోవడానికి నేనెంత గర్వపడుతున్నానో.... వాడికంత నామోషీగా ఉంది నా కడుపున పుట్టినందుకు. బహుశః అది వాడి తప్పుకాదేమోలే... మారుతున్న కాలం ప్రభావం.

ఇంకొక రోజు యేమైందో తెలుసా? నేను మనవడు 'రాజా'తో సరదాకి బంతి ఆట ఆడుతున్నాను. కావాలనే వాడి సంతోషం కోసం బంతిని పట్టుకోలేనట్లుగా జారవిడుస్తున్నాను. వాడు చప్పట్లు చరిచి... 'తాతయ్య ఓడిపోయాడం'టూ నవ్వుతున్నాడు. ఎవరో స్నేహితులనుకుంటాను అబ్బాయికోసం వచ్చారు. నన్నేమని అడిగారో తెలుసా? 'మీ అయ్యగారున్నారా?' అని. "నేనే వాడి 'అయ్య'ను అని నోరు విప్పి చెప్పాలనుకున్నాను. కానీ, చెప్పలేకపోయాను. నేను సమాధానం చెప్పేలోపుగానే అక్కడికి వచ్చిన మన అబ్బాయి యేమన్నాడో తెలుసా? నీకు తెలీదులే. నేను చెప్పనిదే నీకెలా తెలుస్తుంది?..." 'నీకెన్నిసార్లు చెప్పాను.... నలుగురు వచ్చేవేళ యిలా బయట అడ్డంగా తిరగొద్దని?' అన్నాడు. నా యింట్లోనే నాకు హద్దులు విధించాడు. కొడుకులని కన్ననాడే మనం కూడా కన్నప్రేమకి, కడుపు తీపికి హద్దులు యేర్పరచుకుని ఉంటే యిప్పుడు యీ మనక్షోభ తప్పేదేమో రాజీ.

'చూసావా నీతో యిలా మాట్లాడుతూ ఉంటే టైం తెలియలేదు..... రాత్రి పన్నెండు

## రీనాకు మళ్లీ ఆఫర్ ?

సంసార సాగరంలోపడిపోయియిన్నాళ్లూ చిత్రరంగానికి దూరమై పోయింది రినా రాయ్. ఇప్పుడామె పేరు రీనారాయ్ కాదు రీనా మొహసిన్ ఖాన్.

చిత్రాలలో నటించక యింటి పట్టునే వుండటంతో ఆమె 'సైజు' పెరిగిపోయిందట. అనేక చిత్రాలలో నటించి మంచి పేరు తెచ్చుకున్న రీనాను యిటీవల ఒక నిర్మాత కలుసుకొని తన చిత్రంలో నటించమని అడిగాడట 'సైజు'లతో నిమిత్తం లేకుండా. ఒకనాడు రీనాకున్న పేరును దృష్టిలో వుంచుకోనే తాను ఆమెతో ఒక చిత్రం తీయాలనుకుంటున్నానని అన్నాడట ఆ నిర్మాత. మరి ఆమెకు తగిన పాత్రే యివ్వవచ్చునంటున్నారు పరిశ్రమలో.



అయింది... యింక పడుకుంటాను రాజీ...'

అలా అలా నిద్రలోకి జారుకున్నాడు రఘురామయ్య.

'మన కిరణ్ పుట్టినరోజుకి అందరికీ యిన్విటేషన్స్ పోస్ట్ చెయ్యడం అయిందా?' శేఖర్ చదువుతున్న పేపరు ప్రక్కన పెట్టి భార్య సునీత నడిగాడు.

'ఆ అన్నీ అయాయి గానీ, మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలని రెండు రోజుల నుంచి అనుకుంటూ మర్చిపోతున్నాను.. మన యింటికి వచ్చే ఫ్రెండ్స్ గెస్ట్స్ అంతాక్రితం యేడాది కంటే ఎక్కువ మంది ఉన్నారు..... ఈ యిల్లంతా యిరుగ్గా ఉంటుందేమోనవిప్తోంది. పైగా వచ్చిన వాళ్లంతా 'ఆయనెవర్లు యెవర 'ని అడిగితే అందరికీ చెప్పలేక ప్రాణం విసిగి పోతుంది.... ఎల్లకాలం మనమే బాండు వ్రాయలేదు కదా? కొన్నాళ్లు రెండవ కొడుకు దగ్గిరికి కూడా వెళ్లి ఉండమనండి...ఆయనకీ కొంత మార్పు ఉంటుంది....'ఇంకా పోస్ట్ చెయ్యవలసిన ఇన్విటేషన్స్ అవీ చూసుకుంటూ తన మనస్సులో మాట బయటపెట్టింది సునీత.

శేఖర్ కొన్ని క్షణాలు ఆలోచిస్తూ ఉండి పోయాడు. ఆడుకుంటూ అప్పుడే లోపలికి వచ్చి ప్రక్కన కూర్చున్న కిరణ్ తలనిమురుతూ....'ఇట్సాల్ రైట్... యూ డు ఏజ్ యూ లైక్... ' అన్నాడు అదేమీ పెద్ద ఆలోచించవలసిన విషయం కానట్లుగా. భర్త తనకు అందిస్తున్న సహకారానికి మెచ్చుకోలుగా చూసింది సునీత.

వెంటనే షరీఫ్‌ని కేకవేసి చెప్పదలుచుకున్నది చెప్పింది.

రఘురామయ్య గదివైపు వెళ్తున్న షరీఫ్ అక్కడి దృశ్యం చూసి అలాగే నిలబడిపోయాడు. ఒక చేతిలో చిన్న బట్టలమూట, రాజేశ్వరి ఫోటో రెండవ చేతిలో చేతికర్రతో రఘురామయ్య యిటే వస్తున్నాడు.

'అయ్యగారున్నారా షరీఫ్?' అని అడుగుతున్న రఘురామయ్యని ప్రశ్నార్థకంగా చూసాడు షరీఫ్.

కొడుకు, కోడలు లోపల ఉండడం గమనించి ద్వారం దగ్గరే ఆగిపోయాడు...

మనవడు కిరణ్ పరిగెత్తుకు వచ్చాడు 'తాతయ్యా ఊరికి వెళ్తున్నావా?' అన్నాడు కాళ్లు రెండూ పట్టుకుని.

'నిన్ను వదిలి యెక్కడికి వెళ్లిపోతాను రాకన్నా? మళ్లీ వచ్చేస్తాను... అన్నట్లు రేపు నీ పుట్టిన రోజు కదూ? ఇదిగో యీ డబ్బులు పెట్టి చాక్లెట్లు కొనుక్కో...' అంటూ పంచెలో దోపుకున్న నలిగిపోయిన రెండు రూపాయిల నోటుతీసి మనవడికి అందించి ఆప్యాయంగా తలనిమిరాడు. అది అందుకున్న వాడి కళ్లల్లోని ఆనందం చూసి చలించిపోయాడు రఘురామయ్య.

'శేఖర్ వస్తానురా...కొన్నాళ్లపాటు కృష్ణుడి దగ్గిరికి వెళ్లి వస్తాను.. ..' అని వెనుదిరిగాడు భారమైన మనస్సుతో.

శేఖర్ లేచి ద్వారం వరకు వచ్చాడు. 'వెళ్లండి నేను కూడా అదే చెప్పాలనుకుంటున్నాను. ఒకే దగ్గర ఉంటే మీకు కొంత విసుగనిపించవచ్చు... ఈ మధ్య తమ్ముడు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందా?'

'వచ్చిందన్నట్లుగా తలూపాడు రఘురామయ్య. వచ్చి కొన్నాళ్ల పాటు తన దగ్గర ఉండమని ఉత్తరం రాసాడు. అందుకే వెళ్తున్నాను...'

'జాగ్రత్తగా వెళ్లిరండి...తొందరగా వచ్చేయండి... ' తెంచుకోలేని పేగు యే మూలనో కలుక్కుమని ఆ మాటలు పలకించింది.

'గమ్యంలేని నా ప్రయాణానికి తిరుగు రాక యెప్పుడో యెలా చెప్పగలనురా?' మనసులోనే అనుకుంటూ గేటు దాటాడు.... వెనుదిరిగిన రఘురామయ్యకి కిరణ్ రూపం మసకబారినట్లుగా కన్పించింది. అప్పటికే కళ్లు కన్నీటి కొలకులయ్యాయి!

ఎక్కడికి తన ప్రయాణం? ఎటు వెళ్లాలి? కృష్ణుడి దగ్గిరికా? శేఖర్‌తో తను యేమని చెప్పాడు? కృష్ణుడు రమ్మని ఉత్తరం రాసాడని కదూ? తనలో తనే నవ్వుకున్నాడు రఘురామయ్య. కృష్ణుడు తనకేమని ఉత్తరం రాసాడు?

'నాన్నా....యిలా వ్రాయలేక వ్రాయలేక వ్రాస్తున్నాను. నాకొచ్చే గుమాస్తా జీతం రాళ్లతో మా నలుగురికీ పూట గడవడమే కష్టంగా ఉంది. ఈ పరిస్థితులలో మీరు కొన్నాళ్ల పాటు అన్నయ్య దగ్గర ఉంటేనే మంచిదనిపిస్తోంది...' అని రాసాడు. పాపం! వాడు మాత్రం యేం చేస్తాడు? కన్న తండ్రికి కూడా కూడు పెట్టలేనిస్థితి. అభిమానం కడుపు నిండా ఉన్నా యేమీ చేయలేక అలా రాసాడు.

అలా ఆలోచిస్తూనే బస్‌స్టాండ్ చేరుకున్నాడు రఘురామయ్య.

* * *

'డాడీ, తాతయ్య యింకా రాలేదేం?' కిరణ్ తండ్రి ప్రక్కలో కూర్చుని ముద్దు ముద్దుగా అడిగాడు.

'వస్తారు నాన్నా...కొన్నాళ్లు బాబాయి దగ్గర ఉండి మళ్లీ యిక్కడికి వచ్చేస్తారు.....'

'తొందరగా వచ్చేస్తానని చెప్పి వెళ్లారు. ఇన్నాళ్లయిపోయినా రాలేదు నాకేం తోచడం లేదు డాడీ...తాతయ్య ఉంటే యేవో కబుర్లు, కథలు చెప్పేవారు...' కిరణ్ యేడుపు ముఖం పెట్టాడు.

నిజానికి ఆ వెలితి కిరణ్‌కే కాదు. తనకీ అనిపించింది. తండ్రి వెళ్లి దగ్గర యేడాది కావస్తున్నా తను తమ్ముడికి ఉత్తరం కూడా వ్రాయలేదు. యోగక్షేమాలు వ్రాయమని... తనంటే యేవో పనుల హడావుడిలో ఉండి పోయాడు. పోనీ కనీసం కృష్ణుడు అయినా తనకి ఒక ఉత్తరం వ్రాయొచ్చు కదా! ✤



మేడాదికి యింట్లో యెన్నో పార్టీలు,ఫంక్షన్స్ జరిగాయి. తన తండ్రి గది పూర్తిగా మారిపోయింది. దానినిండా సోఫాలు, కుర్చీలు, డెకరేటివ్ పీసెస్ చాలా అమరాయి. కానీ, ఆ తండ్రిలేని లోటు 'లోటు'గానే మిగిలిపోయింది. ఆ గది వైపు వెళ్లాలంటేనే యేదో వెలితి !

డాడీ, మీరైనా తాతయ్యకి రమ్మని ఉత్తరం వ్రాయకూడదూ?' కిరణ్ కోరిన తీరుకి చలించిపోయాడు శేఖర్. తను యే విధంగా మరిపిద్దామన్నా తిరిగి అదే ప్రశ్న వేస్తున్నాడు వాడు. వాడి దృష్టి కొంచెం మళ్లించాలి.... అందుకే చాలారోజులు తర్వాత కారుతీసుకుని బయలుదేరాడు బీచ్‌వైపు.

త్రోవలో కిరణ్ యేమేమో అడుగుతున్నాడు. అన్నింటికీ యాంత్రికంగా 'ఊ' కొడుతున్నాడే తప్ప మనసు మాత్రం తండ్రి ఆలోచనల చుట్టూ తిరుగుతోంది... ఒక్కసారి తమ్ముడి యింటికి వెళ్లి వస్తే? తను యీ స్థితికి వచ్చాక యిన్నేళ్లుగా వాడు ఎలా గున్నదీ కూడా యోగక్షేమం కనుక్కోలేదే? ఒకటి రెండుసార్లు తండ్రి చెప్పాడు...'వాడు కటిక దరిద్రం అనుభవిస్తున్నాడురా' అని. అప్పుడు కూడా తను చలించలేదే? మరి యిప్పుడు యిన్నేళ్ల తర్వాత తండ్రి కోసం వాడి గడప త్రొక్కడమా?

శేఖర్ ఆలోచనల కంతరాయం కలిగిస్తూ, కిరణ్ పెద్ద కేక పెట్టాడు... 'డాడీ... అదిగో తాతయ్య!' అంటూ అటువైపు పరిగెత్తాడు. శేఖర్ తనే నమ్మలేకపోతున్నాడు. నిజంగానే బీచ్‌లో ఆ చివరినుండి చేతికర్రతో తమవైపే నడిచివస్తున్నాడు రఘురామయ్య !

శేఖర్ చూస్తూ ఉండగానే ఆ తాతా మనవడు ఒకరినొకరు అల్లుకుపోయారు.... 'తాతయ్యా, మళ్లీ వచ్చేస్తానన్నావు...రాలేదేం?' కిరణ్ వాళ్ల తాతయ్య నడుగుతున్నాడు.

'శేఖర్ బాగున్నావా...?' రఘురామయ్య కొడుకుని స్పృశించడానికి సంశయిస్తూండగానే శేఖర్ తండ్రి ఛాతీమీద వాలిపోయాడు...మళ్లీ ముప్పైయేళ్లు వెనక్కి వెళ్లినట్లుగా బావురుమన్నాడు....

'నాన్నా...మీరు....తమ్ముడిదగ్గరికి...'అని సంశయంగా అర్ధోక్తిలోనే ఆగిపోయాడు....

'లేదురా...వెళ్లలేదు. ముందు వెళ్లాలనే అనుకున్నాను. వాడే పూటగడవక యిబ్బంది పడుతూ ఉంటే నేను కూడా వాడికి భారంగా యెందుకని.... యిక్కడే...ఉండిపోయాను...'

'ఇక్కడే ఈ ఊళ్లోనే ఉన్నారా?

పాఠకులకో సవాల్!




## సే సారీ అండ్ బిహ్యేవ్!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్లుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం.

## 10-11-'89 లోగా అందేలాగ రిపార్టీలు పంపించాలి!

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేక పోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహపడక మళ్ళీ ప్రయత్నించండి.

– ఎడిటర్

"వరదలొచ్చాయి... కొంపలు మునిగాయ్! కాస్త 'హెల్ప్' గురూ!"

*** రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:**

### "సారీ! నాకు 'ఈత' రాదు"

-మహర్షి (కొత్తగూడెం)

*** రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:**

### "మా పంపకాలు కాగానే చూద్దాంలే"

-వి. పార్వతీశప్రవీణ్ (వరంగల్)

**మరి కొన్ని వాగ్బాణాలు**

"నాది నీ బాపతేనయ్యా బాబూ!"

-ఎ.వి.ఆర్. ప్రసాద్ (నెల్లూరు) కె. రవికుమార్ (తెనాలి) అవినాష్ (ద్రాక్షారామ)

"నిండా మునిగాక చలేమిటి?"

-కె. రామారావ్ (హైదరాబాద్) ఎస్.వి.వి. మురలీకృష్ణ (విశాఖపట్నం)



# మీ జి. కె. ఎంత?

( 1) ఇప్పటి వరకు ఎంతమందికి "నేషనల్ రిసెర్చి ప్రొఫెసర్స్" గౌరవం లభించింది? వారెవరు?

( 2) "గ్రాండ్ ఓల్డ్ మ్యాన్ ఆఫ్ ఇంగ్లాండ్" అని ఎవరిని అంటారు?

( 3) "సాత్ సురోంకేసాత్" అనే పుస్తకం ఇద్దరు ప్రముఖ సినీ సంగీత దర్శకుల మీద వ్రాయబడింది. వారిద్దరు ఎవరు?

( 4) "థైడాస్కలైనో ఫోబియా" అంటే ఏమిటి?

( 5) జాతీయ సైన్సు దినం ఎప్పుడు?

( 6) క్యూరీ దంపతుల్లాగానే మరొక దంపతులు నోబెల్ బహుమతి గెల్చుకున్నారు. వారెవరు?

( 7) ప్రపంచంలో ఎక్కువమందిచేత సినిమా తెరపై పోషించబడిన పాత్ర ఎవరిది?

( 8) కాంగ్రెసు అధ్యక్షునిగా 'నేతాజీ' రాజీనామా చేసిన తర్వాత ఎవరు అధ్యక్షుడిగా వ్యవహరించారు?

( 9) ప్రధమ భారతీయ వ్యోమగామి రాకేష్‌శర్మ ఏ రోజున భూమి మీదకి తిరిగి వచ్చాడు?

(10) అత్యధిక అక్షరాస్యులు గల కేంద్రపాలిత ప్రాంతం?

(జవాబులు ఈ సంచికలో నే)

-జై

## 'ఒంటరి'

ఎక్కడ? ఎవరి యింట్లో నాన్నా? మన యింటికి వచ్చేయలేకపోయారా? కిరణ్ రోజూ మిమ్మల్ని తలుస్తున్నాడు....' శేఖర్ గొంతు గాద్గదికమైంది. కళ్లు చెమ్మగిల్లాయి. చెట్టంత కొడుకు తను ప్రయోజకుడై యుండి తండ్రి వీళ్లింటా వాళ్లింటా గడుపుకుంటున్నాడంటే తన జన్మకి అర్థం యేమిటి? సార్థకత యేమిటి? కొడుకుని కన్న ఏ తండ్రి అయినా కోరుకునేదేమిటి? ఆ కొడుకు చేతిలో తన జీవితం వెళ్లిపోవాలని... మరి చివరి రోజుల్లో తన తండ్రికి పట్టిన యీ దుస్థితికి కారకుడు తను కాదూ?

'నేనుండగా మీరు యెవరి యింట్లోనో ఉండవలసిన ఖర్మ యేమిటి నాన్నా... నాతో వచ్చేయండి...' శేఖర్ తండ్రి చేతులు రెండూ పట్టుకున్నాడు అభ్యర్థనగా...

'ఎవరో పరాయి వాళ్లింట్లో నేను లేనురా...నా సొంత యింట్లో నేనున్నాను... సుఖంగా...సంతోషంగా....' ర ఘురామయ్య ఆప్యాయంగా శేఖర్ భుజం తట్టాడు. అర్థం కానట్లు చూసాడు శేఖర్....

'రా, యింటికి వెళ్దాం...' ముగ్గురూ కదిలారు.

త్రోవంతా కిరణ్ తాతయ్యకి ఊపిరి సలపనివ్వలేదు. ఏవో యక్షప్రశ్నలు వేస్తూనే ఉన్నాడు. రఘురామయ్య గొంతులోని ఆప్యాయతకి, ఆదరణకి శేఖర్ తనలో తానే కుంచించుకుపోతున్నాడు.

కారు ఒక పెద్ద భవనం ముందు ఆగింది....

ముందుగా రఘురామయ్య దిగి లోపలికి నడిచాడు....కిరణ్, శేఖర్ అనుసరించారు.

అక్కడ అంతా శేఖర్‌ని వింతగా చూస్తున్నారు....అక్కడ ఉన్న ఆడ-మగ అంతా యించుమించుగా రఘురామయ్య వయసు వాళ్లే! రఘురామయ్య ఒక గదిలోనికి ప్రవేశించాడు. అక్కడ తెల్లని దుప్పటి పరచిన పక్క, మంచం....మంచానికి యెదురుగా రాజేశ్వరి ఫొటో! శేఖర్ కళ్లు చెమ్మగిల్లాయి...

'కూర్చోరా ... శేఖర్ .... కన్నా యిలా కూర్చో... ' యిద్దరికీ మంచం చూపించాడు...ఆ గదిలో అలాంటివి యింకా నాలుగైదు మంచాలున్నాయి.... శేఖర్ కేదో మాట్లాడాలని ఉంది. కాని గొంతు పెగలడం లేదు....బాధంతా ఉండ చుట్టుకుని గొంతు కడ్డం పడింది....గొంతు మూగబోయింది....

'నాన్నా...ఒంటరిగా యిక్కడెందుకు... యింటికి వచ్చేయండి...' చివరికెలాగో అతి ప్రయత్నంమీద మాట బయటకు వచ్చింది.

రఘురామయ్య చిన్నగా నవ్వాడు...'నేను ఒంటరివాడినెలా అవుతానురా? 'నా' అనే పదాన్ని నా కన్నబిడ్డలకి మాత్రమే పరిమితము చేసుకున్ననాళ్లు నేను నిజంగా 'ఒంటరి' వాడినే. కాని, ప్రేమను పంచిపెట్టే ప్రతి జీవి 'నా' వాడే...నా కష్టసుఖాల నర్థం చేసుకుని రవంత సానుభూతి చూపగలిగిన వీళ్లంతా 'నా' వాళ్లే అనుకున్నప్పుడు నేను ఒంటరివాడినెలాగవుతానురా? నీడలా వెంటాడే మీ అమ్మతోడు నాకెప్పుడూ ఉండనే ఉంది. నా గురించి బెంగపెట్టుకోకు. నేను ఇక్కడ చాలా హాయిగా ఉన్నాను.'

'తాతయ్యా, యిది నీ యిల్లా?' కిరణ్ అడిగిన అమాయక ప్రశ్నకు అతను చిన్నగా నవ్వి...'నా' ఒక్కడిదీ కాదురా...'నాలాంటి' యెందరిదో ...అన్నాడు. 'నా లాంటి' అన్న పదం శేఖర్ గుండెలో యే మూలో గ్రుచ్చుకుని కలుక్కుమంది.

'తాతయ్యా నేనూ యిక్కడ ఉండిపోవచ్చా?'

పిచ్చికన్నా...ఎందుకూ, ఎవరికీ ఏ విధంగానూ పనికిరాని నాలాంటి వాళ్లకోసమేరా యీ యిల్లు! నీకు చక్కగా పెద్ద బంగళా ఉంది, కారు ఉంది... నువ్విక్కడ యెందుకు?

'అయితే డాడీ, నేను కూడా నీ అంత ముసలివాళ్లం అయ్యేక యిక్కడికి వచ్చి ఉండాలా?' కిరణ్ అడిగిన ప్రశ్నకి శేఖర్‌కి సర్రున కోపం వచ్చింది...

'నోర్మూసుకుని ముందు యింటికి పద...వస్తాను' అని తండ్రితో చెప్పి గిరుక్కున వెనుదిరిగాడు కొడుకు చెయ్యి పట్టుకుని....

'ఎవరు ఆయన?' ఎవరో అడుగుతున్నారు తన తండ్రిని.

'మాకు తెలిసినవాళ్ల అబ్బాయి....' రఘురామయ్య చెప్తున్నాడు.

'కన్నబిడ్డలే కన్నెత్తి చూడని యీ రోజుల్లో ఎవరో తెలిసినవాళ్ల అబ్బాయి యిలా వచ్చి యోగక్షేమం కనుక్కుంటున్నాడంటే యెంత గొప్పమనసో?' అంటున్న వాళ్ల మాటలు ఒక్కొక్కటే యీటెల్లా గుండెను తూట్లు పొడుస్తూ ఉంటే అడుగులో అడుగు భారంగా వేసుకుంటూ కారు యెక్కి కూర్చున్నాడు.

'ఓల్డ్ ఏజ్ హోమ్' అన్న బోర్డు క్రమేపి దూరమవుతుండగా.... కారు చీకట్లోకి దూసుకుపోయింది.



Saraswata Niketanam,
Acc. No.
Vetapalem.

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**తిమ్మరాజు వీరభద్రయ్య, శ్రీకాకుళం**

శాంతి, అహింసలతో మన దేశానికి స్వతంత్రం సంపాదించిన గాంధి పుట్టిన దేశంలో అన్నగారు తుపాకు లిస్తామనడం? కామెంట్ ప్లీజ్.

★ నలభై రెండేళ్ల స్వతంత్రం దేశాన్నిక్కడికి తెచ్చిందని జ్ఞాపకం తెస్తున్నారంతే.

**కె. సత్యవతి, పెనుగొండ**

సరస్వతి వున్నచోట లక్ష్మి! లక్ష్మి వున్నచోట సరస్వతి ఉండదంటారు కదండీ?

★ నిజమే– అందుకే– నా దగ్గిర లక్ష్మిని, వారి దగ్గిర సరస్వతిని వుంచే ఏర్పాటు చేసుకున్నా!

మా ప్రశ్నలకు ఎంతో చమత్కారంగా మీరు జవాబులిస్తారే. మీరువాడే టానిక్ పేరేమిటండీ కె. రాగారూ!

★ వేరే టానిక్ ఎందుకు? కోపంగా పరిసరాలని చూస్తుంటాను! అంతే– బి. పి. పెరిగి పోతుంది. అప్పుడు కూర్చుని ప్రశ్నావళి రాసేస్తూంటా. రోజూ పేపర్లు, కొన్ని సీరియల్స్, కొందరి మాటలు చాలవా– మీ మెదడు కుతకుతలాడించడానికి. మీరూ ప్రయత్నించండి!

**జి. అశోక్ వెంకట్, మెట్‌పల్లి**

జీవితాన్ని ఎలా జీవించాలి?

★ క్షణం– నుంచి క్షణానికి.

మరణం తర్వాత?

★ ఎవరు చూడొచ్చారు?!

బ్రతుకు అంతిమ లక్ష్యం?

★ చచ్చేదాకా సుఖపడడమే కదా?

**జి. రామ్మూర్తి, హైదరాబాదు**

మీరు మరీ షార్ప్‌గా రాస్తారెందుకు?

★ షార్ప్‌నెస్ లేని మాటలూ, ఆలోచింప చేయని మాటలూ– మొనలేని సూదుల్లాంటివి రామ్మూర్తిగారూ– నిరుపయోగం.

**పి. శ్రీరామచంద్రమూర్తి, గుంటూరు**

స్త్రీ పురుషుల మధ్య స్నేహాన్ని ఈ లోకం హర్షించదెందుకని?

★ ఎందుకు హర్షించదు? మిమ్మల్ని మీరే అనుమానించుకుంటూ– స్నేహిస్తే– లోకం మటుకు అనుమానించదా?

**దేవి రమణబాబు, పెద్దపల్లి**

నేటి వ్యవస్థలో స్త్రీకి యిస్తున్న ప్రాధాన్యత చాలంటారా?

★ ప్రాధాన్యత అన్న మాట కేనాడు స్త్రీపరంగా అర్థంలేదని మీకూ తెలుసు... మనిషిగా కూడా గుర్తించని పరిస్థితులు ఎదుర్కొంటోందీనాటి స్త్రీ.

**పూల మురళి, వరంగల్**

ఆడవారికి స్వార్థం ఎక్కువ అంటాను. మీరేమంటారు.

★ అది ఎవరికోసం? మీకోసమే కద!

ఏమండీ యింకొన్నాళ్లకి ఆడా మగాకీ తేడా లేకుండా పోతుందనుకుంటా!

★ శుభం. ఆ రోజు ఎంత త్వరగా వస్తే– అంత మంచిది. ఆడ మగ తేడా ప్రకృతి ప్రసాదించినది చాలు– మిగిలిన ప్రపంచంలో ఎందుకు?

**కె. వి. మూర్తి, సికింద్రాబాదు.**

నిజం అభూత కల్పన కంటె వింతైనది అంటారే – నిజమా?

★ కొందరి కలా అనిపించ వచ్చు. కాని –– స్వచ్ఛంద సేవకులైన వాళ్ళకి– అనుభవైకంగా తెలుస్తుందీ సత్యం.

**ఆగ్నేష,(?)నందికొట్కూరు.**

అక్కా ఆడపిల్ల మనసు విశాలంగా వుంటే – నీ మనసులో నాక్కూడా కాస్త చోటివ్వు అనే మగాళ్లే కాని ఆ హృదయాన్ని అర్థం చేసుకునే వాళ్లు వుండరెందు కని?

★ మనసులోకి ప్రవేశించ కల్గితే – అల్లుకు పోవచ్చు నన్న ధీమా? (కామెల్ అండ్ ది అరబ్ కథ చిన్నప్పుడు వినలేదా?)

**ఎమ్. వసంతలక్ష్మి, విశాఖపట్నం**

● కలలు నిజం అవాలంటే?

★ మొద్దు నిద్ర పోకూడదనేవాడు వసంతగారూ మా పెద మామయ్య.

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ–17 :** వైమానిక దళ పైలెట్ రాహుల్ తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు. కుమార్తె సుషుమ్న దగ్గరవున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరంవల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన వివరాలను సేకరిస్తుంటాడు. ఈలోగా కారవెల్లి విమాన ప్రమాదానికి సంబంధించిన బ్లాక్‌బాక్స్‌లోని ఇండికేటర్ దొంగిలించిన దుండగుల కోసం ఒక వైపు పోలీసులు దర్యాప్తు జరుపుతుండగా మరో వైపు రాహుల్ కుమార్తె సుషుమ్నను అలయన్స్ సంస్థ అధినేత దేవిప్రసాద్ ముఠా కిడ్నాప్ చేస్తుంది. గోరీలదొడ్డిలో దాచిన సుషుమ్నను రాహుల్ దుండగుల బారినుంచి కాపాడుకుంటాడు. పోలీసులు ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టి దొరికిన వారిని అరెస్టు చేస్తారు.

ఉలికిపడి లేచాడు యిబ్రహీం! అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. గత రాత్రి దట్టించిన మందు తాలూకు హేంగోవర్‌లోనే ఉన్నాడు. ఉదయం తొమ్మిదిన్నరకు అదే నిద్ర లేవటం.

తెల్లవారురూము అయిందాకా త్రాగుతూనే ఉన్నాడు. దుర్గ అతనికి ప్రియాతి ప్రియమయిన సాని! ఆమె అందిస్తే చాలు కాదు అనలేడు త్రాగుడు.

''మెలకువ వచ్చిందా బిడ్డా?'' అని అడిగింది విజయదుర్గ. అతడు నవ్వాడు.

''రాత్రి భలే తమాషా అయిన తిట్లు తిట్టావు. ఏదీ మరోసారి అలాంటివి వినిపించవూ?'' అన్నాడు గుర్తుకు తెచ్చుకుని పడ పడ నవ్వుతూ.

''అవి అప్పుడే గుర్తుంటాయి. లేచి ఆ పాడు ముఖం కడుక్కో'' అంది.

''నాకింకా తెల్లారలేదు దుర్గా''

''అంటే మళ్ళీ మొదలెట్టి త్రాగుతావా?'' ఆ ప్రశ్నకి సమాధానంగా అతడు పాకెట్‌ని గ్లాసులోకి ఒంపుకున్నాడు.

''ఒకసారి సిప్ చేసి నా కివ్వు'' అన్నాడు బ్రతిమాలుతున్నట్టు.

''ఉదయమే ఇలాంటి పనులు నాకసహ్యం''

''ఊరికే పెదవులకి తాకించి యిద్దూ! ఎంగిలి అయితే చాలు''

''యూ పూర్ శాడిస్ట్'' అంటూ అతని కోరిక తీర్చింది దుర్గ! క్రింద పడి ఉన్న పేపర్ అందుకుంది. మూడు రోజులుగా పేపర్‌లో చాల ఘోరమయిన వార్తలూ ఫొటోగ్రాఫ్‌లూ వస్తున్నాయి.

''ఇదేమిటి? ఈ వార్త నువ్వు చూచావా?''

''ఏమిటా వార్త! రోజూ వింటూనే ఉన్నాం కదా?'' తాపీగా అన్నాడు.

''నీ కొంప మునిగి పోయిందిరోయ్ బాబూ!''

''ఏమిటది? ఎవరయినా నన్ను గుర్తించారా?'' కొంచెం చలించాడు.

''గుర్తించటం అంటా వేమిటి? అంతా పోయింది.

''ఖూత్ నీ యబ్బ! అదేంటో చదివి చెప్పరాదూ...''

తారనాకలో దుండగులమీద పోలీసుల దాడి''

''అందాకా పోయిందా వీళ్ళ ప్రతాపం? వివరంగా చదువు''

''పోలీసులు తారనాకలోని ఘోరీలదొడ్డి మదుల ప్రాంతాలపై దాడి చేశారు. వారికీ దుండగులకూ మధ్య ఆ ప్రాంతమంతా రణక్షేత్ర మయింది. ఇద్దరు పోలీసులతో సహా చాలమంది గాయపడ్డారు''

''ధూత్తెరికి! ఇంకా చదువు!''

''నగర పోలీస్ కమిషనర్ ఈ దాడిని స్వయంగా నిర్వహించారు. అనేక మందిని అరెస్ట్ చేశారు''

''యా అల్లా! పోగాలం వచ్చింది పోలీసోళ్ళకి'' గ్లాసులో మిగిలివున్న పానీయాన్ని గడగడ త్రాగేశాడు.

''అప్పుడే ఏమయింది? ఇంకా విను. నగరంలో కర్ఫ్యూ సమయాల్లో దోచుకున్న దొంగ సొత్తు చాల భాగం పోలీసుల స్వాధీన మయింది. శివాలయంలో పోయిన నగలు ఒక పాత యింటిలో దొరికాయి. పరిస్థితి ఉద్రిక్తంగా ఉంది. అక్కడకు ప్రత్యేక పోలీసు దళాలను పంపుతున్నారు'' చదువుకుపోతోంది విజయదుర్గ.

''బస్ బహూత్ హోగయా! రోకో!'' అంటూ మంచం దిగి వెలుపలకు పరుగు తీశాడు యిబ్రహీం! ప్రక్క వాకిలి దగ్గర సారాకొట్టులో పనిచేసే కుర్రాళ్ళు నిలబడి ఉన్నారు.

''రేయ్! రాత్రి నా కోసం ఎవరూ రాలేదా?''

''గంటకొకరు వస్తూనే ఉన్నారు సాబ్''

''మరినన్నెందుకు లేపలేదురా బద్మాష్ బచ్చా!?''

''మీరు మనలోకంలో లేరు''

''అందువల్లే ఇదంతా జరిగింది'' తనలో అనుకుంటూ ముందుకు పరుగు తీశాడు. అయిదు అంగల్లో శివాలయం చేరుకున్నాడు. ఆ ప్రాంతాలలో కర్ఫ్యూ సడలించారు. జన సంచారం, వాహనాల రాకపోకలు పూర్తిగా పునరుద్ధరింపబడినాయి. ఆలయం తలుపులు తెరిచి ఉన్నాయి. అల్లర్లలో ఆస్తులు, ఇళ్ళూ కోల్పోయిన దీనులకు ఎవరో పుణ్యాత్ములు అన్నదానం చేస్తున్నారు. ఒక పుణ్యాత్ముడు బట్టలు పంచి యిస్తున్నాడు.

ఒక మహిళా సమాజంవారు వంట గిన్నెలు గాజులు, కుంకుమ నింపిన బరిణెలు ఉచితంగా పంచుతున్నారు.

వారి మధ్య నించి తన మిత్రుని గదిలోకి పోయాడు యిబ్రహీం! అతని కోసం ఎదురు చూస్తూ సిద్ధంగా నిలబడి అన్నాడు. అతనికన్నా ముందుగా ఆలయ నిర్వహణాధికారి లోపలకు వచ్చాడు.

''యిబ్రహీం! ఆలయానికి నీ మిత్రుడు గార్నుగా

జీతం తీసుకుంటున్నాడు. కాని అవసరం ఉన్నప్పుడే కన్పించకుండా పోతాడు ఏమిటది?" అని అడిగాడు.

"స్వంత పని మీద పోయుంటాడు. ఏం? నీ పని ఉన్నప్పుడు నువ్వూ పోతున్నావు కదా?" దబాయించినట్టుగా ఎదురు ప్రశ్న వేశాడు.

"ఇలా చేయటం ఏమీ బాగాలేదు. పై అధికారులు నన్ను సతాయిస్తున్నారు. శివాలయంలో నగలు పోయిన రాత్రి నీ ఫ్రెండ్ డ్యూటీలో లేడు అయినా ఉన్నట్టుగా రకార్డు చూపించాను. ప్రతిసారి యిలా చేయాలంటే నా పీకల మీదికి వస్తుంది బాబూ!"

"చూపించక ఏం చేస్తావు. చాల తప్పుల నించి నన్ను కాపాడుకోవటానికి నా మిత్రుని ఉద్యోగం ఒక సాధనం. అనేక వేలమంది ఫోర్తు క్లాస్ ఎంప్లాయీస్ వాడికి అండగా నిలుస్తారు. అతని ఉద్యోగానికి ముప్పు వచ్చిందంటే ముందుగా నీ పీక తెగిపోద్ది జాగ్రత్త" అన్నాడు యిబ్రహీం.

కార్యనిర్వహణాధికారి ఒణికిపోయాడు. అతని పాపిష్ఠి చరిత్ర ఆ అధికారికి బాగా తెలుసు.

"మావాడిక అపాయింట్‌మెంట్ ఆర్డర్ రాకుండా ఉత్తి చేతులతో తిరిగి పోయాడు అనుకో! బెంగుళూరులో బ్యాంకు ఉద్యోగం చేసే కొడుకు కాని, హాస్టల్‌లో ఉండి చదువుకుంటున్న నీ కూతురు కాని తిరిగిరారు" అన్నాడు నేరుగా కార్యాలయంలోకి వచ్చి

చోటు కాని చోటున సుఖంగా బ్రతుకుతున్న కొడుకుని, కూతుర్ని తలుచుకుని అప్పటికప్పుడు అపాయింట్‌మెంట్ ఆర్డర్ టైప్ చేయించి యిచ్చాడు



## ఉన్నత స్నేహం

కనులు కలిసిన స్నేహం...
గాలిలోని దీపం !!
భావాలు కలిసిన స్నేహం...
కంటిలోని దీపం !!
మనసులు కలిసిన స్నేహం...
చీకటిలో చిరుదీపం !!
హృదయాలు కలిసిన స్నేహం...
కడలిలోని దీపం !!
ఆపదలో ఆదుకునే స్నేహం
వెన్నెల్లోని దీపం...!!
కష్టాల్లో కలుసుకునే స్నేహం...
కారడవిలో కాంతి దీపం...!!
కల్మశం లేని స్నేహం....
మరపురాని మధుర స్నేహం.

–వి. నిర్మలా ప్రియదర్శిని



"వీరవనిత"
(చిత్రం : వి. వాసవి)

కార్యనిర్వాహణాధికారి. కొరివితో తల గోక్కున్నట్లు అయింది.

అప్పటినించీ బెదిరిస్తూనే ఉన్నాడు. అతన్ని తప్పించటం తలకి మించిన పని అయిపోయింది. అతన్ని తీసేస్తే తన కుటుంబానికి భద్రతలేదు.

"మా పీకలు తెగిపోయేలాగే ఉన్నాయి బాబూ! పై అధికారులు సతాయిస్తున్నారు. నా మీద కత్తులు నూరుతున్నారు. ఎలా చెప్పుకోవాలి. నగరం అల్లకల్లోలంగా ఉన్నప్పుడు ఆలయం గార్డు ఆలయంలో ఉండొద్దా?"

"అక్కడ ఉండి వాడు చేసేది ఏముందిబే! ఈ ఆలయంలో యిబ్రహీం ఉంటున్నాడనే పేరు చాలు. ఎవరికయినా కన్నులు ఎత్తి చూచే దమ్ములుంటాయా? నగరంలో యిన్ని ఘోరాలు జరిగినా ఆలయంలో ఏమైనా జరిగిందా? మన పేరు చాలు! సంఝా!?"

"ఇప్పుడేమీ జరగలేదు. అప్పుడు నగలు పోయాయి కదా!"

"పోతే మళ్ళీ పోలీసులకి దొరికినై! వెళ్ళి తెచ్చుకో!" అన్నాడు. కార్యనిర్వాహణాధికారి ఆమితాశ్చర్యంలో మునిగిపోయాడు.

అతనింకా తేరుకోకుండానే ఒక ఎస్. ఐ వారి దగ్గరకు వచ్చాడు.

"శివాలయంలో దొంగిలించబడ్డాయని చెప్ప బడుతున్న నగలు దొరికాయి. గుర్తించేందుకు స్టాఫ్‌ని పిలుచుకు రమ్మంటున్నారు కమిషనర్‌గారు" అని వార్త అందించాడు.

వారిద్దరి ముఖాలు మార్చి మార్చి చూస్తున్నాడు కార్యనిర్వహణాధికారి.

"ఎందుకా కొజ్జా చూపులు!? ముందుగానే నాకు ఎలా తెలిసిందనా? బద్మాష్! శివుడాజ్ఞ లేకుండా చీమయినా కుట్టదు అంటుంటావు కదా నువ్వు? అలాగే! ఈ యిబ్రహీం ఆజ్ఞ లేకుండా ఈ నగరంలో జేబుదొంగ అయినా బ్లేడు పట్టడు. పోదాం" అన్నాడు ఎస్. ఐ. కి విన్పించకుండా.

"అవునవును. పోదాం పద" అన్నాడు కార్య నిర్వహణాధికారి. ఎస్. ఐ. వెంట ఇద్దరూ పోలీసు కంట్రోల్ రూంకి బయలుదేరారు.

యి. ఒ. రాక ముందునించే అతని కోసం ఎదురు చూస్తున్న ఎమర్జన్సీ వార్త ఉన్నట్లుగా యిబ్రహీంకి సిగ్నల్ అందించాడు. యి. ఒ. తో పాటుగా వస్తున్నాడు ఎస్. ఐ. యిబ్రహీం ఆగిపోయాడు.

ఆ గూండా యువకుడు వచ్చి కలిశాడు.

"నీకు చెప్పాల్సిన అర్జంటు వార్తలున్నాయ్. చాలసేపుగా ఎదురు చూస్తున్నా."

"అన్నీ నాకు తెలుసురా బేటా! ఆ పరిస్థితులు కళ్లారా చూసేందుకు పోలీసు కంట్రోల్ రూంకి పోతున్నా! ఇదో మాంచి అవకాశం. కంట్రోల్ రూంనించి తిరిగి రాగానే వచ్చి కలుస్తానని దేవిప్రసాద్‌గారితో చెప్పు.

కైలాష్ భద్దా బడా బద్మాష్! దొంగలకి దొంగ. నా మీద ఏదో నూరిపోస్తుంటాడు. కనిపెట్టి ఉంటుండు వెళ్ళి వస్తా!" అన్నాడు యిబ్రహీం.

"యిబ్రహీం!? నువ్వు స్వయంగా పోలీస్ కంట్రోల్ రూంకి వెడతావా?"

"ఏమవుతుందిబే! దిల్ ఉండాలి. దిమాక్ ఉండాలి. కాని ఏమవుతుందిబే! పో! పోయి దేవిప్రసాద్‌కి సమాచారం తీసుకు వస్తానని చెప్పు" అంటూ ముందుకి సాగిపోయాడు యిబ్రహీం.

"ఎవరా మనిషి?" ఎస్. ఐ. అనుమానంగా ప్రశ్నించాడు.

"నేను ఆలయానికి గార్డు చుట్టాన్ని. వాడు లేని సమయంలో ఎవరో ఒకరికి జాగ్రత్తలు చెప్పి రావద్దా?" అని ఎదురు ప్రశ్నించాడు యిబ్రహీం.

"సరే! వచ్చి జీపులో కూర్చో" అన్నాడు. యి. ఒ. గారు ఎస్. ఐ. ప్రక్కనే ముందు సీట్లో కూర్చున్నాడు. యిబ్రహీం వెనుక పోలీసుల మధ్య కూర్చున్నాడు.

"దమ్ము కొట్టి చాలాసేపయింది. ఒకటిచ్చుకో!" అన్నాడు.

అతను రెండు రోజులుగా తాగుతున్నాడు. ఉదయం ముఖ ప్రక్షాళన కూడ లేకుండా మళ్ళీ త్రాగాడు. అందువల్ల లిక్కర్ వాసనతో కలిసిన చాల భయంకరమైన దుర్గంధం అతని శ్వాసతో పాటు రిలీజ్ అవుతోంది. దాన్ని భరించలేక ఆల్కహాలు అలవాటు ఉన్న వాడే అయినా ప్రక్కనున్న పి. సి. ముక్కులు మూసుకుని సిగరెట్ అందించాడు.

సిగరెట్ వెలిగించుకున్నాడు ఇబ్రహీం!

జీపు పోలీసు కంట్రోల్ రూం ముందు ఆగింది . ఎ. ఎస్. పి. కారంత్ మృతికి చాలినంత ప్రతీకారం చేయగలిగినందుకు అక్కడ సంతృప్తికరమయిన వాతావరణం నెలకొని ఉంది.

కమిషనర్ ఉగ్ర నరసింహమూర్తి అవతారం చాలించాడు. ఇప్పుడాయన ఛీర్‌ఫుల్ మూడ్‌లో కన్పిస్తున్నాడు. నగలు, వెపన్స్, వేరు వేరు టేబిల్స్‌మీద అమర్చారు. వాటిని ఫొటోగ్రాఫ్ తీసుకోవటానికి పత్రికల రిపోర్టర్లకి అనుమతి యిచ్చారు.

దుండగులతో తారనాకలో పోలీసులు జరిపిన ముఖాముఖి యుద్ధం గురించి, పోలీసుల విజయం గురించి, దానికి నాయకత్వాన్ని స్వయంగా నిర్వహించిన కమిషనర్ అనుభవం గురించి అడుగుతున్నారు. ఆసక్తికరమయిన ప్రశ్నలకు ఉల్లాసకరమైన ధోరణిలో సమాధానాలు యిస్తున్నారు పోలీస్ కమిషనర్‌గారు. ఆ గదిలోకి యి. ఒ. ని, యిబ్రహీంని తీసుకు పోయాడు ఎస్.ఐ. వారిని పరిచయం చేశాడు.

"కమాన్ ఫ్రెండ్స్, మీ కొక శుభవార్త చెప్పాలని పిలిపించాను."

"థాంక్యూసర్! ఏమిటా శుభవార్త" అని అడిగాడు ఎండోమెంట్స్ కార్య నిర్వహణాధికారి. కమిషనర్‌కి దగ్గరగా వెళ్ళాడు.

"ఫస్ట్ ఇన్వెస్టిగేషన్ రిపోర్టులో దొంగ లెవరో ఊహించటానికి వీలు కాకుండా ఉందని వ్రాశారు. శివాలయంలో నగలు దొంగిలించిన వారి పేరు స్పష్టంగా చెప్పేందుకు యిప్పుడయినా వీలు కాదు. కాని నగలు దొరికాయి. అందుకే మీకు కబురు పెట్టాను. మీరు గుర్తించి ఖరారు చెయ్యాలికదా!"

"థాంక్యూసర్! థాంక్స్ ఎలాట్. ఈ విషయమై నేను సస్పెన్షన్‌కి గురి కావలసింది. నన్ను మీరు కాపాడారు. ఇప్పుడు నా కా' భయం లేదు." కృతజ్ఞతలు చెప్పాడు.

"థాంక్స్ చెప్పవలసింది నాకు కాదు. మా బాయిస్ చురుకయిన వాళ్ళు. నీ వెంట వచ్చిన ఈ వ్యక్తి ఎవరు?" అని అడిగాడు కమిషనర్.

"శివాలయంలో 'ఉంటాడు" పేరు చెప్పేందుకు భయపడ్డాడు.

"ఓ! పేరు యిబ్రహీంకదూ!" తన పేరు కమిషనర్ నోటి వెంట రావటం విని లోలోపల భయపడ్డాడు యిబ్రహీం! కాని బయటకు తెలియనివ్వలేదు.

"అవునుసర్! అతని పేరు అదే" వొణికిపోయాడు ఇ. ఒ. పరిస్థితులను అనుసరించి ఎవరూ నోరు విప్పలేదు. అందుకు సాహసించలేదు.

కాని శివాలయంలో చోరి ఎలా జరిగిందో, నగలు ఎవరు దొంగిలించారో అతనికీ తెలుసు. అందరికీ తెలుసు. ఓపెన్ సీక్రెట్!

"ఐ నో! హి ఈజ్ యిబ్రహీం. ఉండే చోటుకి అతనిదే పేరు. యిబ్రహీం సందు. దట్ ఐ నో! యిబ్రహీం ద గ్రేట్‌మాన్" అంటూ అతని ముఖంలోకి చూచారు కమిషనర్. చెట్టంత మనిషి వొణికి పోతున్నాడు.

అయనకు కావలసిన నైతిక అధారాలు దొరికాయి. ఇహ సాక్ష్యాలు దొరకాలి.

"యిబ్రహీం! కర్ఫ్యూ సమయంలో నువ్వు ఎలా గడిపావు? ఎక్కడున్నావు!"

"ఇంటి దగ్గరే వున్నాను సాబ్! బయటకు రాలేదు"

"ఏం భయమేసిందా నీకు?"

"అవును సార్. అసలే పిరికివాణ్ణి" అన్నాడు యిబ్రహీం!

"నీ మాటలు నేను నమ్ముతున్నాను. ఎంతో గొప్ప వాళ్ళకి కాని దొరకని అదృష్టం నీది. నీ పేరు మీదుగా ఒక వీధి చెలామణి అవుతోంది."

"వీధి కాదు సాబ్! అది చిన్న సందు. యిబ్రహీం సందు అని పేరు పడింది. అది నా పేరుమీద చెలామణీ అవటానికి కారణం ఏమి లేదు సార్! ఆ వీధిలో ఉంటోంది నేను ఒక్కడినే!"

"కారణం ఏదయినా నగరంలో పేరు పడ్డావు. యిబ్రహీం సందు ఒకసారి చూడాలనుంది నాకు" అన్నాడు కమిషనర్. ఆయన వ్యంగ్య ధోరణి అతని మెదడు నరాలు తెగిపోయేలా చేస్తోంది.

తారనాకలోని తన దళాలమీద అంత హఠాత్తుగా రైడ్ చేసి దొంగ సొమ్ముతో సహా పట్టుకున్నాడంటే సామాన్యుడు కాదు. సాహసి! దేవిప్రసాద్‌గారు హోం శాఖ ద్వారా కమిషనర్‌కి కొన్ని సూచనలు అందచేసి ఉంటారు. అయినా దాడి చేశాడంటే స్వతంత్రుడే అనుకోవాలి.

ఈ దాడిలో తన మనుషులంతా అతనికి బందీలు అయారు. మరేం చెప్పాలో తెలియదు. ఆయన దగ్గర ఎటువంటి సమాచారం సిద్ధంగా ఉందో ఊహించేందుకు వీలుకాదు. అందుకే వొణికిపోయాడు యిబ్రహీం.

తాను తొందరపడి రావటం సాహసం అని ఊహించాడు.

కమిషనర్ అంతటితో ఆ సంభాషణ ముగించి రెండవ టేబిల్‌మీద కప్పిన ముఖమల్ దుప్పటిని తొలగించాడు.

శివాలయంలోంచి మాయమయిన నగలు కన్పించాయి. వాటిప్రక్కనే తాను వాటిని ఏ సంచిలో దాచాడో అది కూడ ఉంది. నల్లని సంచి నగల ప్రక్కనే దర్శనమిచ్చింది. యిబ్రహీం పళ్ళునూరాడు.

ఎవరూ ఊహించని విధంగా దాడినిర్వహించి తన స్వర్గాన్ని కూల్చేశాడు ఈ కమిషనర్! మళ్ళీదాన్ని నిర్మించుకోవటానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. దానికి అతన్ని ఏం చేసినా పాపంలేదు.

కాని తాను యిప్పుడు ఏమీ చేయలేడు.

"ఇవి శివాలయంనించి అపహరించబడిన నగలే!" రూఢి చేశాడు ఇ. ఒ.

"మరి ఆ సంచి ఎవరిది?"

"అది మాకు తెలియదు సార్"

"నీకు తెలుసా?" యిబ్రహీంని చూస్తూ

అడిగాడు కమీషనర్.

"నాకు తెలియదు సాబ్"

"సో యూ కంటు కోర్ట్ అన్ గెట్టు హాండోవర్ ఐటమ్స్" అని చెప్పేసి చక చక ఆ గది వదలి వెళ్ళిపోయాడు కమీషనర్! ఇద్దరు జూనియర్ పోలీసాఫీసర్లు వచ్చి ఆ స్థానంలో నిలబడ్డారు.

గుండెల నిండా గాలిపీల్చాడు యిబ్రహీం. కార్యనిర్వహణాధికారి తిరిగిపోతూ అతన్ని వెంట రమ్మని పిలవలేదు. యమసదనంలోంచి బయటపడుతున్న వాడిలా చకచకా వెళ్ళిపోయాడు.

యిబ్రహీం తెలిసిన ముఖాల కోసం చూచాడు. ఒక ఆఫీసర్ కన్పించాడు.

"తారనాకలో అరెస్ట్ అయినవారి లిస్టు దొరుకుతుందా?" అని అడిగాడు.

"సాయంత్రం తెచ్చియిస్తాను" అన్నాడు రహస్యంగా.

"వారిని కంటితో చూచేందుకు వీలు అవుతుందా?"

"అది సాధ్యపడదు. కమిషనర్‌గారు స్వయంగా తన ఛాంబర్‌లోకి తీసుకు పోయి వారిని యింటరాగేట్ చేస్తున్నారు. వీలుపడదు."

"కాదు నేను వారిని చూడాలి. చూచి తీరాలి. నా మనుషులు అంతా కాకులయిపోయారు. ఎవరు లోపలున్నారో, ఎవరు బయటున్నారో అదయినా తెలియాలి. లేకపోతే దేవిప్రసాద్ నన్ను విడిచిపెట్టడు. నీకు చాల మంచి బహుమానం యిస్తాను. నాకు వారిని చూపించాలి." అతని మంకుపట్టు చూచి పోలీసాఫీసర్ నీరసించిపోయాడు.

"ఇదేమిటనుకున్నావు బాబూ! పోలీసు కమిషనర్ ఆఫీసు! తారనాక కాదు. కమిషనర్ గారే స్వయంగా రైడ్ చేసి పట్టుకున్న నేరస్తులు. వారిని తానే స్వయంగా ప్రశ్నిస్తున్నారు అంటే దాని ప్రాధాన్యత ఏమిటో తెలుసుకో!

ఈ కమిషనర్ అగ్గిరాముడు బాబూ! తోక మూడించామంటే నిర్దాక్షిణ్యంగా కత్తిరించి పారే స్తాడు. దట్సాల్."

"నీ ముఖం! ఇలాంటి వాళ్ళని చాలమందిని చూచాను. భయం లేదు. పద! వారి వివరాలు తెలుసుకోకుండా తిరిగి పోవటంకన్నా నేను కూడ అరెస్ట్ కావటమే మంచిది. పోదాం పద!"

"కమిషనర్‌గారి ఛాంబర్‌లోకా?"

"అవును ఛాంబర్‌లోకే"

"ప్రాణాలుమీద ఆశ లేదా?"

"నీకే లేదనుకుంటాను" అని బెదిరించాడు యిబ్రహీం. ఆఫీసర్ పని వెనుక నుయ్యి ముందు గొయ్యిలా అయింది. యాంత్రికంగా నడిచాడు.

ఛాంబర్ తలుపులన్నీ మూసేసి ఉన్నాయి. ప్రతి వాకిలి దగ్గిర పోలీసు బలగం అప్రమత్తంగా ఉంది. లోపల కిటకిటలాడి పోతోంది. నేరుగా వెళ్ళి ఒక దొరుమీద చేయి వేశాడు యిబ్రహీం.

తలుపులు తెరుచుకున్నాయి. కమిషనర్‌తో సహా ఆఫీసర్స్ అందరూ తలలు త్రిప్పి చూచారు. ఒకే ఒక్క చూపుతో లోపల ఉన్న వారందరూ తన మనుషులే అని గుర్తించాడు యిబ్రహీం!

తారనాకలో గోలీలదొడ్డి దగ్గిర రక్షణ వ్యవస్థగా ఏర్పరుచుకున్న మనుషులే వారందరూ! వారు కూడ అతన్ని గుర్తించారు. పోలీసులు పట్టుకు పోవటం, అతను వచ్చి విడిపించుకుపోవడం, ఇలా జరుగుతూ ఉండటం మామూలే!

వారు మళ్ళీ అతను అందుకే వచ్చాడని పొంగిపోయారు. అయితే ఈసారి ఆఫీసర్స్ మరింత పట్టుదలతో వున్నారు. కమీషనర్ అగ్నిహోత్రుడులా ఉన్నాడు. తన డిపార్టుమెంటు అధికారిని బలి తీసుకున్న సంఘటన అతని గుండెల్ని మండిస్తోంది. ప్రతీకారవాంఛ గుండెల్లో కొండలా పేరుకుపోయి వుంది. ఏ స్థితిలోనూ రాజీ పడాలన్న ఆలోచన లేదు.

"ఎవరు నువ్వు? ఎందు కొచ్చావు?" గద్దించాడు.

"ఇంతకుముందే మీరు నన్ను చూచారు"

"అవును. చూచాను. కాని అనుమతి లేకుండా ఈ గదిలోకి ఎందుకు వచ్చావని అడుగుతున్నాను" కమీషనర్.

"వీరందరిని ఎందుకు పట్టుకొచ్చారు?"

"యూ రాస్కెల్" అంటూ ప్రారంభించి పెద్ద పెద్ద మాటలు అన్నాడు కమీషనర్! "ఆ ప్రశ్న నన్ను అడగటానికి ఎన్ని గుండెలురా నీకు. బాయిస్ 'కాచ్ హిమ్'" ఆజ్ఞాపించాడు.

ఆఫీసర్స్ అతన్ని పట్టుకుని లోపలకు తీసుకు పోయారు. మళ్ళీగది తలుపులు మూసుకున్నాయి. ఇప్పుడు తను తన మనుషుల మధ్యకు వచ్చేశాడు. ఎంతో తృప్తిగా ఉంది. వారికీ ధైర్యంగా ఉంది.

"వీరంతా నీకేమవుతారు?"

"నా అనుచరులు" బెదురు లేకుండా బదులు చెప్పాడు.

"అంటే వీరు చేసే కిడ్నాప్‌లు, దోపిడీలు, హత్యలు, దహనకాండలు అన్నీ నువ్వే చేయిస్తున్నావా?"

"ఇంకా ఆ విషయంలో సందేహం కూడ ఎందుకు?" రవంత అయినా సందేహానికి తావులేకుండా అన్నాడు.

అతని అనుచరులందరూ లీడరు ధైర్యానికి హర్షాతిరేకం పట్టలేక నవ్వటం ప్రారంభించారు.

కమీషనర్‌తో సహా అందరి ముఖాలు నల్లబడ్డాయి. కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖాలు కోపంతో కందిపోతున్నాయి.

"ఎంత ధైర్యంరా నీకు? ఏం బయటి ప్రపంచం ముఖం చూడాలని లేదన్నమాట! చేసిన పనులకి ఫలంగా నువ్వు ఉరికంబం ఎక్కుతావు. ఈలోగా నీ తప్పుల వివరాలు సేకరించేందుకు యింటరాగేషన్ అని ఓ సత్కారం జరుగుతుంది.

అది పూర్తి అయ్యే సమయానికి ఒళ్ళు హూనం అవుతుంది. అసలు ఉరికంబం ఎక్కించే సమయానికి నీకు జీవితం మీద అంత ఆశకూడా మిగిలి ఉండదులే!" అన్నాడు కమీషనర్.

ఈసారి బందీలు భయంగా చూచారు.

పోలీసాఫీసర్లు తమవంతుగా నవ్వారు.

"డియర్ కమీషనర్! మీరు చెప్పేది వినేందుకు బాగానే ఉంది. అలా జరగాలనేది మీ కోరిక కావచ్చు. కాని అలా జరగదు అనేది నా నమ్మకం"

కమీషనర్ కళ్ళు పూర్తిగా ఎర్రబెట్టాయి. రివాల్వర్ తీసి అతని గుండెల మీదికి గురిపెట్టాడు.



"ఇప్పుడు నేను ట్రిగ్గర్‌నొక్కితే నువ్వు ఏమవుతావు?"

"నా శరీరంలోంచి ఎన్ని రక్తపుబొట్లు నేల మీదికి రాలిపడతాయో అంతమంది నీ మనుషుల ప్రాణాలు పోతాయి" చుట్టు ఉన్న ఆఫీసర్స్, బందీలు అందరూ భయం భయంగా చూస్తున్నారు. గట్టిగా ఊపిరి పీల్చేందుకయినా ఎవరికీ ధైర్యం చాలలేదు. కమీషనర్ గురిపెట్టిన రివాల్వర్ దించలేదు.

"అంటే నీకు అంత బలగం ఉందా?"

"మేము నేరస్తులమే ఒప్పుకుంటాను. కాని మా చేతులు చాల శక్తివంతమయినవి. మా మనసులు చాల క్రూరమయినవి. మా హృదయాలు కర్కశమయినవి.

చెడుని జయించేశక్తి ఈ ప్రపంచంలో మంచికిలేదు. నువ్వు ట్రిగ్గర్ నొక్కితే ఒక నేరస్తుడు చనిపోతాడు. కాని ఆ తరువాత జరిగే పరిణామాలకు నువ్వే చాల బాధపడతావు" అన్నాడు యిబ్రహిం! కమీషనర్ ఆఫీసర్స్ వంక చూచాడు.

అందరూ భయంతో బిగుసుకుపోయి వున్నారు. కాస్త ధైర్యం మిగిలి ఉన్న ఓ ఆఫీసర్ పెదవి కదిపాడు.

"సర్ అతని ప్రాణాలు తీయకండి"

"ఎందుకలా అంటున్నావు?" కమీషనర్.

"దానికి చాల కారణాలున్నాయి.

"అవేమిటో చెప్పు" కమీషనర్ గొంతు చించుకుని అరిచాడు. ఉక్రోషంతో జేవురించిన ముఖంలో కళ్ళు మందార రేకుల్లా మరింత ఎర్రబడి ఉన్నాయి. కోపం ఎక్కువ అయిన కారణంగా కళ్ళవెంట నీరుకూడ వస్తుంది.

"మీరు ఒకసారి గదిలోకివస్తే చెప్తాను" ఇంక అనివార్యమయిన పరిస్థితిగా కమీషనర్ రివాల్వర్‌ని దించేశాడు.

ముందుగా తాను ఛాంబర్‌కి అనుకుని ఉన్న ప్రయివేట్ రూంలోకి నడిచాడు. అతని వెనుక భయంగా వెళ్ళాడు చంపవద్దని సలహా ఇచ్చిన ఆఫీసర్.

"అటువంటి సలహా యిచ్చిన కారణం ఏమిటో చెప్పు. కారణం సరిగా ఉంటే నువ్వు బ్రతుకుతావు లేకపోతే నేనేం చేస్తానో నాకే తెలియదు" ఆవేశంతో ఊగిపోతున్నాడు కమీషనర్.

"సర్! అతని గురించి నాకు బాగా తెలుసు. అతని వెనుక అలయన్స్ కంపెనీ యజమాని దేవిప్రసాద్ ఉన్నారు. మంత్రిగారు, హోం డిపార్టుమెంట్ సెక్రటరీ ఆయన మనుషులు.

మరొక వాస్తవం చెప్తాను. మన డిపార్టుమెంట్‌లో దేవిప్రసాద్‌గారికి చాల మంది భక్తులున్నారు. వారిలో నేనుకూడ ఒకణ్ని"

"మీరంతా కలిసి ఏం చేస్తామంటారు?"

"అతను చనిపోతే హోం డిపార్టుమెంట్‌లో అంతః కలహం తప్పదు. మీరు రాజీనామా చెయ్యాల్సివస్తుంది" కమీషనర్ కొయ్యబారి పోయాడు.

(ఇంకా వుంది)

**1988** సెప్టెంబరు 5 సోమవారం మాజీ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణగారి జన్మదినం. ఉపాధ్యాయ దినోత్సవం. పాఠశాలకు పండుగ దినం.



రంగురంగుల కాగితాలతో సందడిగా పెళ్లి వారిల్లులాగ ఉంది స్కూలు. ప్రారంభసమయానికి ముందుగానే ఉపాధ్యాయులు విద్యార్థులు హాజరయ్యారు. జాతీయ గీతాలు, దేశభక్తి గీతాలు పాడుతుండగా మువ్వన్నె పతాకం వినువీధుల్లో విహరించింది. అధికారులు, అనధికారులతోకలసి అసెంబ్లీ హాలులో సమావేశమయింది పాఠశాల.

మా పాఠశాలలో సాధారణంగా ఏ కార్యక్రమం జరిగినా సోమయాజిగారే సభా నిర్వహణ చేసేవారు. ఈ దినం ఆ కార్యక్రమం అయన నాకప్పగించడంతో కంగారు పుట్టినా సంతృప్తిగానే సభాప్రారంభం చేయగలిగాను.

సభాధ్యక్షుని, ఉపన్యాసకులను, అతిథులను వేదిక మీదకు ఆహ్వానించి సభాకార్యక్రమ నిర్వహణను సభాధ్యక్షులకు అప్పగించి నాస్థానం చేరుకున్నాను.

సభాధ్యక్షులయిన మా పాఠశాల హెడ్మాష్టారు, మరికొంతమంది ప్రజాప్రతినిధులు సర్వేపల్లిరాధాకృష్ణగారి గురించి, ఉపాధ్యాయ దినోత్సవ ప్రాముఖ్యత గురించి చెప్పి ముగించారు. తరువాత ప్రారంభం అయింది లోకనాథం ఉపన్యాసం.

లోకనాథం గురించి ఇక్కడ కొంచెం చెప్పాలి. లోకనాథం మా స్కూలులో లెక్కల మాష్టారు. తన కులం వాళ్లయిన కొందరు ఉపాధ్యాయులకు, మరికొంతమంది విద్యార్థులకు నాయకత్వం వహిస్తాడు.

ప్రతి పాఠశాలలోను రెండు వర్గాలుంటాయి. ఒక వర్గానికి సాధారణంగా ప్రధానోపాధ్యాయుడు నాయకత్వం వహిస్తే వేరొక వర్గానికి లెక్కల మాష్టారో, సైన్స్ మాష్టారో నాయకత్వం వహిస్తారు. సర్వసాధారణంగా అయిద్దరివీ రెండు వేరువేరు కులాలయి ఉంటాయి. సజాతి ధృవాలు వికర్షించుకోవడం, విజాతి ధృవాలు ఆకర్షించుకోవడం అయస్కాంత ధర్మం అయితే, సజాతి ఆకర్షణ, విజాతి వికర్షణ అనేది విద్యాలయాల ధర్మం. అలాంటి అమాంబాపతు వర్గానికి చెందినవాడు లోకనాథం.

లోకనాథం ఉపన్యాసం గంగాప్రవాహంలా సాగుతుంది. అందులో సూక్తులున్నాయి. సుభాషితాలున్నాయి. చెణుకులున్నాయి, చమత్కారాలున్నాయి, వెక్కిరింతలున్నాయి, వేళాకోళాలున్నాయి.

"గురువు తల్లిదండ్రులతో సమానం. అటువంటివాడు కులం పేరుతో, మతం పేరుతో అకారణంగా విద్యార్థులను హింసించడం, పక్షపాతం చూపించడం...ఉపాధ్యాయ వృత్తిని అవమానం చేసినట్లవుతుంది."

లోకనాథం మాటలు చర్నకోలా దెబ్బల్లా తగిలాయి నాకు. ఉలిక్కిపడి సోమయాజిగారి వంక చూసాను. ఎర్రగా కందిన అతని ముఖం, ఉబ్బిరించిన ముక్కు అతని అంతరాన్ని చెప్పకనే చెబుతున్నాయి. లోకనాథం ఉపన్యాస ధోరణిని గమనించిన ఉపాధ్యాయులంతా ముళ్ళమీద కూర్చున్నట్లు అసహనంగా కదులుతున్నారు.

ఉపన్యాసం ముగించిన లోకనాథం కళ్లల్లో ఏదో సాధించానన్న తృప్తి కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. మాటలతో ఎదుట వారిని నొప్పించి వారు బాధతో విలవిల్లాడుతుంటే ఆనందంతో పలవరించే వారు ఎంతో మంది ఉన్నారు. గుండెల్లో శత్రుత్వం విశ్వరూపం చూపిస్తుంటే వచ్చే అవకాశాన్ని జారవిడిచేవారెందరు ?

లోకనాథం సోమయాజిగారిని ఉద్దేశించి అమాటలన్నాడని ప్రతీ ఒక్కరికి తెలుసు. సోమయాజిగారంటే లోకనాథానికి మంట. పూర్వం ఇద్దరూ మంచి స్నేహితులట. కుండ బద్దలు కొట్టే సోమయాజిగారి నిష్కర్షత లోకనాథాన్ని బాధించింది. తరువాత తరువాత పాఠశాల గ్రూపు రాజకీయాల్లో ఇద్దరూ రెండు భిన్న ధృవాలయ్యారు.

సోమయాజిగారు మంచి పండితులు. వక్త. పద్యాలను అమోఘంగా చదవగలరు. వారు క్లాసులో పాఠం చెబుతుంటే పిల్లలతో సమానంగా వినాలనిపించేది నాకు. అయనంటే నాకే గాదు చాలామందికి మంచి అభిప్రాయముంది. పిల్లలు కూడా అతనంటే ఎంతో గౌరవిస్తారు.

అలాంటి అయన క్లాసులో పిల్లవాడిని బెల్టుతో కొట్టారని రిపోర్టు రాగానే ఆశ్చర్యపోయాం. కేవలం కులదృష్టితో మాత్రమే ఆ విద్యార్థిని అంతలా కొట్టారని ఆ కుర్రవాడు చెప్పడం మరీ ఆశ్చర్యమనిపించింది. హెడ్మాష్టారి ప్రాథమిక విచారణ జరుగుతుండగానే ఆ విషయం అధికార్లకు తెలియజేయడం జరిగింది. మొత్తం అంతటితో లోకనాథం ప్రచ్ఛన్న హస్తం ఉందనడం సర్వజన విదితం.

అధికారుల తనిఖీ ఉందన్న రోజు హఠాత్తుగా పాఠశాల విద్యార్థులు సమ్మె చేశారు. ధనం, రౌడీయిజం విద్యాలయాలను పరిపాలిస్తున్నంత కాలం సరిఅయిన విద్యార్థికి, ఉపాధ్యాయునికి నిలవ నీడ ఉండదన్న విషయం మరోమారు ఋజువయింది. కేవలం డబ్బున్న ఓ పదిమంది విద్యార్థులు చేసిన అల్లరికి వందలాది విద్యార్థులు

వెనుదిరిగి పోయారు. సమ్మె ఫలించింది.

అధికారులు పదిమంది విద్యార్థులు చెప్పింది విన్నారు. పసివారు అబద్ధాలు చెప్పరన్నారు. పద్యం కంఠతాచేయలేదన్న సాకుతో తనకులం కాని విద్యార్థిని బెల్టుతో కొట్టడం అన్యాయమన్నారు. ఉపాధ్యాయుడు పిల్లల్ని కొట్టడమే నేరమన్నారు. ఈ నేరానికి, ఈ పాపానికి తగిన శిక్ష ఏమిటని వితర్కించుకున్నారు. సోమయాజిగారు వయస్సులో తమకంటే పెద్దవారని, సభ్యసమాజంలో తనకంటూ ఒక స్థానాన్ని కలిగిన వారనీ, పరువు-మర్యాద గలవారనీ ఎంచకుండా ఇష్టమొచ్చినట్లుగా తెలుగు, ఇంగ్లీషు భాషల్లో తిట్టారు.




సిగ్గుతో చితికిపోతు మూగగా రోదించారు సోమయాజిగారు. తాను చేయని నేరం తనపై వేసి కనీసం తాను చెప్పే దాన్ని కూడా వినిపించుకోకుండా శిక్షించడానికి సిద్ధపడే అధికారులు, విద్యార్థులకు అక్షరజ్ఞానం కలిగించి తన చదువుకు సార్థక్యం ఏర్పరుచుకోవాలన్న తన తలపును గుర్తించకుండ కులకండూతిమలాన్ని పూసి వెక్కిరించే విద్యార్థులు, సాటివాడు అసహాయ స్థితిలో కొట్టుకుంటుంటే ఆనందంగా వీక్షించే తోటివారు,

నిస్సహాయంగా మౌనంగా, అవనత శిరస్కులైన ఆయనను చూస్తుంటే "ఉపాధ్యాయుడా! మారని ఈ సమాజంలో నీస్థితికి మెరుగు లేదా?" అనిపించకమానదు ఎవ్వరికైనా!

సోమయాజిగారు సస్పెండ్ చేయబడ్డారని తెలిసి మేమెవ్వరం ఆశ్చర్యపోలేదు. అలా జరుగుతుందనీ మాకందర్కి తెలుసు. కానీ కొద్దిమంది పిల్లలు కొంతమంది ఉపాధ్యాయులు మిఠాయిలు పంచుకున్నారని తెలిసి సిగ్గుపడ్డాం. ఆకష్టాన్ని, ఆ నిష్ఠూరాన్ని కూడా ఆయన చిరునవ్వుతోనే స్వీకరించారు. అది అతని శీలానికి అంగీకారమేగాని అవమానం కాబోదు.

మానీమానని గాయాన్ని పుల్లతో కెలుకుతు రాక్షసానందాన్ని అనుభవించాడు లోకనాథం. ఎదురు దెబ్బ తగిలేవరకు ఇలాగే ప్రతిఒక్కరు మిడిసిపడతారు. దెబ్బ తగలగానే డీలా పడతారు.

నా ఆలోచనలు రకరకాలుగా సాగుతుండగానే సోమయాజిగారు మైకుదగ్గరకు వచ్చారు. వారి గొంతు గంభీర ధ్వనితో ఖంగుమంటోంది.

"నేటి సమాజంలో ఉపాధ్యాయుడు అల్పజీవి. ప్రతీ ఒక్కరు ఉపాధ్యాయుని పరీక్షించడానికి, అధికారం చెలాయించడానికి అతని మార్గం నిర్దేశించడానికి అర్హులే. అందువల్లే ఉపాధ్యాయునికి సమాజంలో గౌరవం లేకుండా పోయింది. ఏస

మాజం ఉపాధ్యాయుని గౌరవించదో అది అభ్యుదయం చెందలేదు."

"నిజమైన ఉపాధ్యాయుడు తనకు తెలిసిన ప్రతీ విషయాన్ని తన విద్యార్థులకు చెప్పాలనుకొంటాడు. తనకన్నా తన పిల్లలను ఉన్నతులను చేయాలను కొంటాడు. అంతేకాని తన కులం వాళ్లకి ఒకలాగ, వేరొక కులం వాళ్లకి ఇంకొకలాగ ఎప్పుడు చెప్పలేడు. అలా చెప్పేవాడు ఉపాధ్యాయుడేగాడు."

సోమయాజిగారి గుండెలోతుల్లో నుండి దూసుకు వచ్చే మాటలు వేల ఉపాధ్యాయుల అంతరంగాల్ని తరచినట్లనిపిస్తున్నాయి. అతను చెప్పే మాటలు అక్షర సత్యాలు అనిపిస్తుండగా అప్రయత్నంగా చప్పట్లు చరిచాను.

"**ఈ దేశపు** విద్యావిధానంలో ఉన్న **అతి** పెద్దలోపం గురుశిష్య సంబంధం. ఉపా**ధ్యాయుడు** విద్యార్థి అన్నదమ్ముల్లా, తండ్రి **కొడుకుల్లా**, ప్రాణస్నేహితుల్లా గుండాలి. **కానీ ఈనాడు** వారిద్దరు బద్ధ విరోధుల్లా **ఉన్నారు...అ**లోపం మనలో కూడా ఉంది.

ఉరిమినట్లున్న ఆయన గొంతు మా లోపాలను ఎత్తి చూపుతుంటే అంతరాళంలో నా తప్పులను గుర్తించుకొంటు తలదించుకున్నాను."

"నిరుడు 10 వ తరగతి పబ్లిక్కు పరీక్షలో తెలుగులో నూటికి ఎనభై ఐదు మార్కులు నా విద్యార్థి తెచ్చుకుంటే రాష్ట్రంలో అన్ని ఎక్కువ మార్కులు తెచ్చుకున్న అతి కొద్ది విద్యార్థులలో వాడు ఒక్కడైతే, నాకేమైనా అవార్డులిచ్చారా? ప్రమోషన్లు ఇచ్చారా? కనీసం ఏఒక్క అధికారి అయినా "మాష్టారూ బాగా చెప్పారండీ" అని అభినందించాడా? లేదే! నిర్లక్ష్యం ఉదాసీనత, ధం|నాన్వేషణ తత్త్వం అధికారుల్లో ఉన్నంతవరకు విద్యా వ్యవస్థ ఇలాగే ఉంటుంది."

"ఉపాధ్యాయులు ఒకరికొకరు సహకరించుకొంటూ విద్యాప్రమాణాలను పెంచాలేగాని, కులమత తత్త్వాలను రెచ్చగొడుతు, అమాయక హృదయాలలో విషపుబీజాలు నాటినంతకాలం విద్యాలయాలు విద్యకు అలయాలు కాలేవు. విద్యాలయాలే అవుతాయి."

"నాప్రియమైన విద్యార్థులారా! భావి భారత నేతలుమీరే! మీరు స్థాపించే సమసమాజంలో ఉపాధ్యాయుడు అల్పజీవి కారాదు. విద్యావ్యవస్థ దండుగమారి అవస్థాకారాదు."

సోమయాజిగారి ఉపన్యాసం ముగిసినా వారిమాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. వారి కలలు నిజమైతే ఆ మార్పు విద్యావ్యవస్థలో ఉపాధ్యాయుని ఉన్నత స్థానం తలుచుకొని ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాను నేను.

రాత్రి భోజనం చేస్తూ శ్రీమతితో ఉపాధ్యాయ దినోత్సవం సోమయాజిగారి ఉపన్యాసం గురించి వివరిస్తుంటే.

"నాన్నా తెలుగు మాష్టారు పంచె లాల్చీ వేసుకొంటారు కదా బెల్టెక్కడ పెట్టుకొంటారు?" అన్న బాబిగాడి ప్రశ్న నన్ను నిశ్చేష్టుడిని చేసింది.

# గోదావరి

## దీపావళి శుభాకాంక్షలు




# గోదావరి

## డి.ఎ.పి.



"మా ఇంటి కొచ్చింది గోదావరి
మహలక్ష్మిలా ఉంది గోదావరి
తెలుగు వాకిళ్ళలో వెలుగు దీపాలలో
స్నేహమై నిలిచింది గోదావరి"

గోదావరి ఎరువుల సంస్థ స్థాపనకు ప్రేరకులు, పురోగతికి మూలకారకులైన రైతులకు, సంస్థలో అంతర్భాగంగా వున్న రైతు వాటాదారులకు, సహకార సంఘాలకు, ఎరువుల వ్యాపారస్థులకు, అశేష ప్రజానీకానికి ఈ దీపావళి శుభ సందర్భంలో మహలక్ష్మి కటాక్షించాలని ప్రార్థిస్తూ అందరికి హార్థిక శుభాకాంక్షలు అందిస్తోంది గోదావరి ఎరువుల సంస్థ.

అన్ని పైర్లకు, అన్ని నేలలకు తొలిసారి వేసేందుకు అనువైన అధిక పోషక కాంప్లెక్సు ఎరువు గోదావరి డి.ఎ.పి. 'గంగిగోవు పాలు గరిటెడైనను చాలు' అన్న విధంగా 64 పాళ్ళ బలమైన పోషకాహారాలు కలిగివున్న నాణ్యమైనటువంటి గోదావరి డి.ఎ.పి. వాడితే చాలు రైతుకు వ్యయం తక్కువ – ఫలసాయం ఎక్కువ. అందుకే గంపెడు గోదావరి డి ఎ.పి. వాడితే గరిసెడు ధాన్యం పండుతుందంటారు మన రైతులు.

మీ గరిసెలలో ధాన్యలక్ష్మి, మీ ఇంటిలో మహలక్ష్మి సదా వుండుగాక అని కోరే –

మీ శుభకరి
గోదావరి










**గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్**

వాణీ నిలయం, 50 సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాదు - 500 003

## తేడా!

అందుతూ క్షణం క్షణం
పొందు రుచి చూపిస్తూ
అందాన్ని హారతి పట్టే
ఇందు వదన 'ఇల్లాలు'!
అందక, ఎక్కడో
అందలాల పైనుండి కవ్విస్తూ
డెందములో గుబులు రేపే
అందాల గని 'ప్రియురాలు'!
అందీ అందక అందుతూ
అందచందాలతో అలరిస్తూ
'వంద'ల నందుకునే
సుందరాంగి 'వెలయాలు'!

-వి. సత్యనారాయణ



## వద్దు వద్దు

వద్దు...
వద్దు...
ఈ లోకంలో
ఆడపిల్లగా నన్ను కనొద్దు!
నాకు మనసారా
ముద్దివ్వకుండా- నవ్వు
పెట్టుకోకు ఓ హద్దు!
నీ ప్రేమకూ
ఆప్యాయతకూ
అనురాగానికీ- నన్ను
కరువు అనొద్దు
బరువు అనొద్దు!
అసలు నన్ను నీవు
ఆడపిల్లగానే కనొద్దు!
అయ్యో ఖర్మ అని
కన్న తర్వాత
ఏడవొద్దు!
నన్ను కనొద్దు!
ఆడపిల్లగా కనొద్దు!
కట్నాలివ్వలేక
కడుపుకు పెట్టలేక
కన్నీరు పెట్టొద్దు

-నేతి శర్వాణి

## రేపటికోసం

అందమైన జీవితాన్ని ఆశించు
సుందర భవిష్యత్తు నాలోచించు
తప్పలేదు... కానీ...
కలలతోనే కాలాన్ని హరించకు
వర్తమానాన్ని విస్మరించకు
రేపటికోసం
కృషి చేయాల్సిన సమయంలో
ఊహలతోనే బ్రతికేస్తే
ఆశాసౌధాలు
వాస్తవాని కెప్పుడూ
ఆవలివైపునే నిలచిపోతాయి!

-సి.వి.నరసింహదాసు




## కా'లేజీ'

కాలేజీ కుర్రాళ్ళు
లేడీసెస్ ఎన్నాళ్ళు
కాలేజీ కొచ్చేదెందుకు...?
ఖాళీగా తిరిగేదెందుకు...?
క్లాసుకురాక వెళ్ళేదెందుకు...?
ఏక్లాసు రాక కన్నీళ్ళెందుకు...?

పాఠ్యాంశాలు వినరెందుకు...?
వినేవాళ్ళ విననివ్వరెందుకు...?
వెనుకనుండి వెకిలి చేష్టలెందుకు...?
క్లాసంతా కాకిగోల
కాలేజీ అనిపించేటందుకా...?
ఓ ఆశయంకోసం రావాలి
ఆ ఆశయ సాధన చేయాలి
అభ్యాసంలో సాధించి
అభ్యుదయాన్ని చేరాలి
మంచివారితో చెలిమిని చేసి
వంచకులను వదలాలి
మన జీవిత బాటను
పూలతోటగా
భావితరాలకు చూపాలి!

-పాకా వెంకటేశ్వర్రావు

## స్త్రీ

ఆమె-
ఓ ప్రవాహం!
అనాదిగా
అనవరతంగా
సాగిపోతోంది-
పల్లంలోకి జారుతూ...
లోయల్లోకి దూకుతూ...
ముళ్ళపొదల్ని ఒరుసుకొంటూ...
బండలకేసి తల బాదుకొంటూ...
కడలి గుండెలో
ఒదిగిపోయేంత వరకూ
అడుగడుగునా అగ్ని పరీక్షే!
ప్రతిక్షణమూ ప్రతీక్షే!!

-ఆప్తచైతన్య

## మార్పు

మూకీ సినిమాలు పోయి
టాకీ సినీమాలొచ్చాయి
గ్రామఫోన్ రికార్డులు పోయి
టేప్‌రికార్డులొచ్చాయి
రేడియోలు పాతబడి
కలర్ టి. వి. లు వెలిశాయి.
సైకిళ్ళ సంఖ్య తగ్గి
స్కూటర్లు పెరిగాయి
సాంకేతిక విజ్ఞానం
ఎంత ఎదిగిన
నేటి మానవుడు
అజ్ఞానంతో
అనాగరికుడిలా
ప్రవర్తిస్తున్నాడు
వ్యవస్థను
అవస్థలపాల్జేస్తున్నాడు!

- గన్నవరం రామమూర్తి

# సినిమా..... సినిమా.....

-జి.వి.జి.

## "రక్త జ్వాల"

"ఫాంటసీ ఇతివృత్తం. ఆద్యంతం ఎంతో కుతూహలం కల్గిస్తుంది," అన్నారు బేబీ. ఈయన దర్శకత్వం వహిస్తున్న యువశక్తి క్రియేషన్స్ "రక్త జ్వాల" చిత్రంలో వినోద్‌కుమార్, శరత్‌బాబు, అశ్విని, కిన్నెర, రాజ్యలక్ష్మి, డిస్కో శాంతి, మంజుల, శ్రీలత, అల్లురామలింగయ్య, ప్రదీప్‌శక్తి, ధమ్, మలయాళ నటుడు నరేంద్ర, మాస్టర్ గణేశ్ నటిస్తున్నారు. కొంపెల్లి విశ్వం మాటలు. శ్రీ హర్ష పాటలు, రాజ్-కోటి సంగీతం, ఎస్.ఎ. తార ఛాయ, బాబ్జీ శిల్పం, ఆంథోని నృత్యాలు, త్యాగరాజన్ సాహసాలు, శివాజీ-రవికిషన్ ప్రొడక్షన్‌తో ఎం. వెంకటేశ్వర్లు-ఎం. కృష్ణ సహనిర్మాతలు. "మద్రాసు మైసూర్‌లలో నిరవధికంగా జరిగే ఒకే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత బత్తిన సత్యనారాయణ. ఈయన ఇంకా డిసెంబర్ నుంచి ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో "సి.బి.ఐ ఆఫీసర్," ఆ తర్వాత రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో "సెక్షన్ 144" చిత్రాలను నిర్మిస్తున్నట్లు తెలిపారు.

## "శిలా శాసనం"

"రాజరికాలు ఉన్నప్పుడు సామ్రాజ్యాల హయాంలో ప్రభువులు ఎన్నో శాసనాలు చేశారు. అవి ఆయా రాజ్యాలతో పాటే అంతరించాయి. ఏ తరానికైనా మనిషికి ఉపయోగించే కొత్త శాసనం రాయించడం-అది ఎన్నటికీ చెక్కు చెదరని శాసనం కావాలి... మానవత్వపు పరిధిలో ఒక రౌడీ రాసిన సజీవ శాసనం ఈ శిలాశాసనం. మొరటోడుగా, మొండోడుగా, బండోడుగా రాజశేఖర్ నటిస్తున్నారు. అధికారి కుమార్తె అయి ఉండీ ఆదర్శం పట్ల ఆకర్షితురాలైన నాయిక శాంతి ప్రియ. టూకీగా- విభిన్న మనస్తత్వాలున్న ఇద్దరు మనుషులపై విచిత్రమైన తీర్పు ఇచ్చిన స్త్రీ కథ," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి.వి.ఎస్. రాజు సమర్పించే విజయ లక్ష్మి మూవీస్ "శిలా శాసనం" చిత్రంలో ఆహుతి ప్రసాద్, బ్రహ్మానందం, రాజాకృష్ణ మూర్తి, మురుగేశన్, దత్తుడు తక్కిన నటవర్గం. గణేష్ పాత్రో మాటలు, రాజ్-కోటి స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి, వెన్నెలకంటి... త్తుల గీతాలు రాశారు. కోడి లక్ష్మణరావు ఛాయ, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, సూరపనేని రాధాకృష్ణ-డి


"ఇంద్రజిత్"లో బోసుబాబు, రోహిణి


"ప్రతాపరుద్రుడు"లో కృష్ణ

ఆర్.కె. రాజు సంయుక్త దర్శకత్వంలో రాజేంద్రరాజు ప్రొడక్షన్ మేనేజర్. "టాకీ పార్ట్ ముగిసింది," అన్నారు నిర్మాత జి.వి.జి. రాజు.

## "రేపటి మహిళ"

"మన సంప్రదాయాలు, మూఢ నమ్మకాలు స్త్రీ ఔన్నత్యాన్ని ఏ విధంగా కుదించి వేస్తున్నాయో తెలియజేసే ప్రయోజనాత్మక చిత్రం. పురుషులు విధించిన ఆంక్షలు, అవరోధాల వల్లనే స్త్రీ తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, బలహీనురాలవుతోంది. ఇటీవల గర్భిణికి పుట్టబోయే బిడ్డ ఆడో మగో ముందే తెలిసే అవకాశం ఏర్పడింది. ఆడపిల్ల అని తెలిస్తే కొన్ని సందర్భాలలో గర్భవిచ్ఛిన్నం చేయడం జరుగుతోంది. భావితరంలో స్త్రీ జాతికే తీరని విఘాతం ఏర్పడే ప్రమాదముంది. స్త్రీకి జరిగే అన్యాయాలను, అక్రమాలను తెలియజెప్తూ, అందుకు 'రేపటి మహిళ' ఎలా ఉండాలన్న ఇతివృత్తంతో రూపొందించబడే చిత్రం," అన్నారు జి.టి. ప్రసాద్. ఈయన కథ సమకూర్చి, తొలిసారి దర్శకత్వం వహించే ప్రభవ ఆర్ట్స్ "రేపటి మహిళ" చిత్రంలో అర్చన, మురళీమోహన్, తాతాజీ, గౌరి, హేమసుందరి ప్రభృత నటవర్గం. జయశ్రీ మల్లిక్ సంభాషణలు, కిరణ్ గీతాలు, సెల్వం ఛాయ, కృష్ణప్రసాద్ సంగీతం, రాజగోపాల్ కూర్పుతో కోగంటి భాస్కరరావు సమర్పించే ఈ విశిష్టమైన చిత్రానికి కె. బాలసుబ్రహ్మణ్యం నిర్మాత.

## చిరంజీవితో రమా ఫిలిమ్స్ చిత్రం

"కౌబాయ్ చిత్రం. భారీగా సినిమా స్కోప్‌లో తీస్తున్నాం. జనవరిలో చివరి షెడ్యూల్," అన్నారు కె. నాగేశ్వరరావు. ఈయన నిర్మించే రమా ఫిలిమ్స్ చిత్రంలో చిరంజీవి, రాధ, సోనమ్, వాణీ విశ్వనాథ్, సుజాత, సత్యనారాయణ, మోహన్‌బాబు, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, అల్లు రామలింగయ్య, ప్రసాద్‌బాబు, కన్నడ ప్రభాకర్, సుధాకర్, అన్నపూర్ణ, ప్రాణ్ నటిస్తున్నారు. పరుచూరి సోదరులు స్క్రీన్‌ప్లే, సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, రాజ్-కోటి సంగీతం, కె.ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, రాజు సాహసాలు, సుందరం నృత్యాలు, శ్రీనివాసరాజు-జ్యోతీంద్రనాథ్ సంయుక్త దర్శకత్వం, డి.ఎస్.ఎన్. మూర్తి-శాయికృష్ణ సహకార దర్శకత్వం, నాగేశ్వరరావు-సత్యం కూర్పుతో కె. లక్ష్మీనారాయణ, కె.వి. రామారావు సహనిర్మాతలు. నిర్వహణ వి. రఘు. కైకాల సత్యనారాయణ సమర్పణ. "ఒకప్పుడు రత్నాల రాసులు పోసిన సౌభాగ్యదేశం మనది. ఆ తరగని సంపదను విదేశీయులు కొందరు దుర్మార్గులతో కలిసి దోచుకోకుండా కాపాడే సూపర్ హీరో కథ," అన్నారు డైరెక్టర్ కె. మురళీమోహనరావు.



"ప్రేమఘర్షణ"లో నవీన, అన్నపూర్ణ

## శ్రీ లక్ష్మీ పిక్చర్స్

"డిసెంబర్‌లో ప్రారంభోత్సవం," అన్నారు వందిగం సూర్యనారాయణ. ఈయన నిర్మించే శ్రీ లక్ష్మీ పిక్చర్స్ తొలి చిత్రంలో డాక్టర్ రాజశేఖర్ పక్కన శోభ నాయిక. ముత్యాల సుబ్బయ్య దర్శకుడు. వందిగం నాగవంశీనాథ్ సమర్పణ.



చీకట్లు తొలగాలి.
ఈ వెలుగుల పండుగ రోజున
నేలతల్లి పులకించాలి. అనుగ్రహించాలి.
రైతు సోదరుల ఇళ్ళు, వాకిళ్ళు
ధాన్య ధన సంపదలతో
విలసిల్లాలి.
మన గ్రామాలు, మనదేశం
సౌభాగ్యవంతమవ్వాలని

# శుభాకాంక్షలతో











**నాగార్జున ఫెర్టిలైజర్స్**
**అండ్ కెమికల్స్ లిమిటెడ్**

నాగార్జున హిల్స్ హైదరాబాదు – 500 482.

Imageads/NFCL/89

సీరియల్

# వజ్రసంకల్పం
# శాతవాహన

మానవతకు మానభంగం జరుగుతుంటే -
మానవ హృదయం దీనంగా ఆక్రందిస్తుంటే
తెరుచుకుంటుంది ఉగ్రనేత్రం!
చీల్చుకొస్తుంది వజ్రసంకల్పం!!

(గత సంచిక తరువాయి)

“శాంతాకార యిదంతా
హంతా చింతా విదూర యపవర్గ రమా నయకరా
కాంతా కాంత దిగంతా అపారతా గభీరతా మృతాది హేతు
భ్రాంతా భ్రాంతాంత తాండవాబ్ధి భూతతా
తపస్వి సంగృహీతతా విధాతృ ముఖ్య దేవతా
ధిప ప్రమధ్యమానతా నదీ మహాను జీవన
ప్రపాత జాత మగ్నతాభిరామ చిత్పయోనిధీ...”

నగ్నదేవత మైలమ్మ కంఠం నుంచి మేరు గంభీరంగా వెలువడుతున్నాయా మంత్రాలు.

“.... లుంటీ కృతాఘ ముక్తిచి
రంటీ గాఢో పగూఢరత చిద్విద్యా
ఘంటాపథచర తారక
ఘంటారవ హృత మనో మృగవ్యాధేశా
దివానిశోదయావసార దిగ్వితాన మండితా
జవం జవాంధకార సత్య సంవిద భ్రమండితా
దివాక రాదిక గ్రహోగ్రదీధితి ప్రసాదవా
గ్ధవాండ భాసకాది తత్వ తారకక్ష పాధవా.....”

★ ★ ★ ★ ★ ★

మల్లి మత్తుగా కళ్ళు తెరిచింది.
కానీ, చూపు ఒకచోట నిలవడం లేదు

# స్వాస్
# మింట్స్




అమృతాంజన్ లిమిటెడ్
వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**



కళ్ళు తేలిపోతున్నాయి.

మల్లి లేచి కూర్చోబోయింది.

లేవలేక పోయింది.

శరీరం గాలిలో తేలిపోతున్నట్టుగా వుంది. తన కింద ఏ ఆధారమూ వున్నట్టుగా అనిపించలేదు. ఏ ఆధారమూ లేకుండా గాల్లో ఎగురుతున్న వ్యక్తికి కదలడానిక్కూడా శక్తి వుండదు. ప్రస్తుతం మల్లి పరిస్థితి కూడా అలాగే వుంది.

"లేవొద్దు!" మహాగంభీరమైన కంఠస్వరం వినిపించింది.

అది సలహా కాదు.

ఆజ్ఞ!

మల్లి ఆవైపు చూసింది.

మసక మసగ్గా కనిపించిందా ఆకారం.

మల్లి అతన్ని గుర్తుపట్టలేదు.

మెదడంతా మొద్దుబారి పోయినట్టుగా వుంది.

"కొద్ది క్షణాలు....., ఆ తర్వాత నువ్వే లేచి కూర్చుంటావు!" వజ్రపాణి కంఠం ఖంగుమంది.

"ఆ తర్వాత.....," అతను చిన్నగా నవ్వేడు. "ఆ తర్వాత నువ్వు స్వర్గంలో వుంటావు!"

అతనేమంటున్నాడో ఆమె కర్థం కాలేదు.

అర్థం చేసుకోగల శక్తి లేదు.

మత్తుగా మరోసారి కళ్ళు మూసుకుంది.

* * * * * *

"అష్టాపద గిరిచాపా
యష్టాపద కేశవార్చిత చరణా
యష్టాపద ముఖరీ జని

# వజ్రసంకల్పం

తాప్వాపద కమలవాసనాధీనమనా....''

మైలమ్మ మంత్రాలు చదువుతూనే వుంది.

* * * * * *

మల్లి వున్నది ఇప్పుడా గదిలో కాదు.

ఈ గది వేరు.

గదికాదు– వదో దివ్యమందిరం!

ఆమె ఇప్పుడు పడుకున్నది ఆ పాన్పుమీద కాదు.

చంద్రశిలావేదిక మీద!

ఈ మందిరం నిండా శిల్పసంపద!

మహాద్భుతమైన శిల్పకళ!

గోడలకు మహాచిత్రకారులు సృష్టించిన తైలవర్ణ చిత్రాలు అలంకరించబడి వున్నాయి.

ఈ మందిరంలో వున్న ప్రతి వస్తువూ ఓ కళాఖండం.

చిత్రమేమిటంటే మందిరంలో ఏ వైపునా ఎక్కడా ఓ తలుపుగానీ కిటికీగానీ లేదు!

పైకప్పు నుంచి వేలాడుతున్న షాండ్లియర్లలో కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. ఆ వెలుతురు షాండ్లియర్లలో ప్రతిఫలించి మరింత ప్రకాశంతో బయటికి ప్రసరిస్తూ పండు వెన్నెలకు మల్లే ఆహ్లాదకరంగా మత్తుగా వుంది. ఆ వెలుతురులో మల్లి పడుకుని వున్న చంద్రశిలా వేదిక తళతళా మెరుస్తోంది.

మందిరం నడి మధ్యలో అందమైన కొలను ఏర్పాటు చేయబడి వుంది. చాలా పెద్ద కొలను. కొలను నిండా రకరకాల కలువపూలు విరగబూసి వున్నాయి. కొన్ని ఎర్రకలువలు, కొన్ని తెల్ల కలువలు, కొన్ని నల్లకలువలు.

కొలనులో మహాద్భుతమైన పాలరాతి శిల్పాలు కొన్ని మలచబడి వున్నాయి.

జీవకళ వుట్టిపడుతున్న శిల్పాలు.

ఒక్కో శిల్పం ఒక్కో మహాద్భుత సౌందర్యరాశి అయిన స్త్రీ!... నగ్నస్త్రీ!

ఆ కొలనులోంచి అప్పుడే ఆవిర్భవించినట్టుగా ఎత్తైన పీఠం మీద నిలబడి వుంది ఒక్కో శిల్పం.

ఒక్కో శిల్పం ఒక్కో భంగిమలో నిలబడి వుంది.

కొలనులోపల వివిధంగా శిల్పాలు మలచబడి వున్నాయో కొలను చుట్టూ కూడా అలాంటివే శిల్పాలు మలచబడి వున్నాయి.

ఒక్కటి కూడా సాధారణమైన శిల్పం కాదు.

ప్రతి శిల్పమూ కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆభరణాలతో అలంకరింపబడి వుంది.

రాతిలో మలచిన ఆభరణాలు కావవి.

వజ్రఖచితమైన సువర్ణాభరణాలు!

శిల్పాల రూపంలో నిలబడివున్న ఆ నగ్న సుందరీమణుల సౌందర్యాన్ని దేదీప్యమానంగా ప్రకాశింప జేస్తున్న ఆభరణాలు!

ఎత్తైన గుండ్రని వక్షోజాల మీద కోట్ల ఖరీదు చేసే చంద్రహారాలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. భుజకీర్తులు, వడ్డాణాలు, వుంగరాలు– ఒకటేమిటి– సకల ఆభరణాలూ ఆ నగ్నసుందరీమణుల పాలరాతి శరీరాలను అలంకరించాయి.

ప్రపంచం మొత్తాన్ని కొనెయ్యగల కోటాను కోట్ల ఖరీదు చేసే మహానిధి ఆ పాలరాతి శిల్పాల మీద ధగద్ధగాయ మానంగామెరిసి పోతోంది.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా రాచరికం ఇంకా అమల్లోవున్న, ఫ్యూడలిస్టు దేశాలలో ఏ దేశపు మహారాజుకైనా సరే వ్యక్తిగత మైన సంపదలో అక్కడున్న, ఏ ఒక్క శిల్పమూ తీసిపోదన్నట్టుగావుంది.

చంద్రశిలా వేదికమీద పడుకున్న, మల్లి కూడా ఆ శిల్పాలలో ఓ శిల్పంగా కలిసి పోయింది.

ఒక్కటే తేడా!

అవన్నీ నిర్జీవ శిల్పాలు.

మల్లి సజీవ శిల్పం.

మల్లికి కూడా ఆ శిల్పాలకుమల్లే తన అస్తిత్వం తనకు తెలియదు. మల్లి కూడా ఆ శిల్పాలకు మల్లె మహాద్భుత సౌందర్యరాశి. మల్లి కూడా ఆ శిల్పాలకు మల్లే ఆభరణాలతో అలంకరింపబడి దేదీప్యమానంగా మెరిసి పోతోంది.

మల్లికూడా.... ఆ శిల్పాలకు మల్లే నగ్నంగా వుంది!

* * * * * * * * *

"మునీంద్ర వహౌ నముద్రికా సముక్త
ముక్త వాసనా
సనాతనాత్మ సేవకార్తి సారసావలీఘనా
ఘనాఘనాఘ ప్రకాశ కాయజాగ్ని జీవనా
వనాధినాథ నందనేశ వాగధీశ పావనా
ఓం నమశ్శివాయ
ఓం నమశ్శివాయ
ఓం నమో నమో నమశ్శివాయ
నమోన్నమః"

నగ్నదేవత మైలమ్మ ధ్యానం చాలించి అగ్నిగోళాల్లా మండుతున్న నేత్రాలు తెరిచింది.

ఎదురుగా భగభగా మండుతున్న హోమగుండం వైపు ఆమె చూపులు ప్రసరించాయి.

ఆమె చూపులకు ప్రతిరూపమా అన్నట్టుగా వుందా హోమగుండం!

హఠాత్తుగా రెండు చేతులూ పైకి చాచి భూతగణాల్ని ఆవాహన చేస్తున్న దానిలా లేచి నిలబడింది.

ఆమె ముఖం రాతికంటే కఠినంగా వుంది.

ఆమె శరీరం అప్రయత్నంగా వణికిపోతోంది.

మైలమ్మ పక్కనే నిలబడ్డ ఇద్దరు దాసీలూ భయంతో మరోసారి వణికారు.

* * * * * *

## యుద్ధాన్ని నివారించిన వజ్రం - 'షా'

88.7 కేరెట్ల షాడైమండ్ బారుగా పసుపచ్చరంగులో వుంటుంది. ఇది అసలు సిసలైన భారతీయ వజ్రం. అందునా మన ఆంధ్రుల వజ్రం. గోల్కొండలో దొరికింది.



తమ కథ తామే చెప్పకొనే అరుదైన రత్నాల్లో షాడైమండ్ కూడా ఒకటి. ఈ వజ్రం మీద దాని యజమానుల పేర్లు తేదీలతో సహా చెక్కడం జరిగింది. కాబట్టి దీని చరిత్రంతా అద్దంలో చూసినట్టు స్పష్టంగా కనబడుతుంది. అహమ్మద్‌నగర్ సుల్తాను నిజాంషా (క్రీ.శ.1591) దీని మొదటి యజమాని. తర్వాత ఇది మొగల్ చక్రవర్తుల ఆధీనంలో కొచ్చింది. షాజహాన్

ఇంతవరకూ సాగిన కథ–16 : విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడుభూమిలో బావి త్రవ్వుతుండగా దొరికిన అపురూపమైన వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. ఈ సందర్భంగా విశ్వధరవర్మ పెద్ద కొడుకు రాజేంద్రవర్మ, అతని కుటుంబం వజ్రపాణి కత్తికి ఎర అవుతారు. విశ్వధరవర్మ చిన్న కొడుకు నరేంద్రవర్మకు ఉరి శిక్ష పడుతుంది. నరేంద్రవర్మ భార్య మగబిడ్డను ప్రసవిస్తుంది. తన అందంతో అందర్నీ బురిడీ కొట్టించే పింకీ ఒక వజ్రపు టుంగరాన్ని కొని ప్రభుతో కలిసి వెళ్తుండగా జూడా - డేవిడ్‌లు వెంబడిస్తారు.

# వజ్రసంకల్పం నేపథ్యంలో ...

చక్రవర్తి పేరు కూడా దీనిమీద చెక్కారు. 1665 లో దీన్ని తాను చూసినట్టుగా టావెర్నియర్ రాసుకున్నాడు. పర్షియన్ 'షా' అలీ షా పేరు కూడా దీని మీద వుంది. అంటే నాదిర్షా దండయాత్రచేసి పర్షియాకు దోచుకుపోయిన వజ్రాల్లో ఇదికూడా ఒకటని స్పష్టంగా తెలిసిపోయింది.

నిజాం-'షా', 'షా'-జహాన్, నాదిర్-'షా', అలీ-'షా'...ఇలా కనీసం నలుగురు 'షా'ల దగ్గరుండేది కాబట్టి దీనికి 'షా' అనే పేరు సరిపోయింది.

1829 లో టెహరాన్‌లోని రష్యన్ రాయబారి అలెగ్జాండర్ గ్రిబోయెడాఫ్ హత్యకు గురయ్యాడు. దాంతో ఇరాన్‌కు రష్యాతో యుద్ధం సంభవించే ప్రమాదం ఏర్పడింది. ఆ సందర్భంలో మొదటి నికొలాస్ చక్రవర్తికి ఇరానియన్లు షా వజ్రాన్ని నష్టపరిహారంగా సమర్పించుకున్నారు. ఆ విధంగా రష్యాతో యుద్ధం నివారించిన వజ్రంగా 'షా' చరిత్రకెక్కింది.

ప్రస్తుతం 'షా' సోవియట్ రష్యాలోని డైమండ్ ట్రెజరీలో భద్రంగా వుంది.

## దర్యాయినూరేమాయమైన మహావజ్రమా ?

దర్యాయినూర్ వాస్తవానికి భారతదేశానికి చెందిన గొప్పవజ్రాల్లో ఒకటి. 185 కారెట్ల ఈ వజ్రం పింక్ కలర్లో వుంటుంది. ఒకప్పుడిది మొగల్ చక్రవర్తుల కోశాగారంలో వుండేది. 1739 లో నాదిర్షా దండయాత్రచేసి పర్షియాకు కొల్లగొట్టుకుపోయిన అనేక అమూల్య వజ్రాల్లో ఇదికూడా వుంది. 1791 లో దీన్ని చూసిన హార్‌ఫోర్డ్ జోన్స్ ఒక విచిత్రమైన విషయాన్ని గమనించాడు.

అంతకుముందెప్పుడో టావెర్నియర్ 'గ్రేట్ టేబుల్' అనే మహావజ్రాన్ని గురించి రికార్డు చేశాడు. ఆనాటి ఆ 'గ్రేట్ టేబుల్' చెప్పాపెట్టకుండా అదృశ్యమైపోయింది. జోన్స్ గమనించిన చిత్రం దర్యాయినూర్ స్పష్టంగా టావెర్నియర్ వర్ణించిన గ్రేట్ టేబుల్ని పోలివుండడమే. అయితే బరువులో మాత్రం చాలా తేడావుంది. 1827 లో దాన్ని మళ్లీ సర్ మాల్కమ్ జోన్స్ చూశాడు. సదరు రెండో జోన్స్‌గారు కూడా దర్యాయినూర్ టావెర్నియర్ వర్ణించిన గ్రేట్ టేబుల్ని పోలివుండడం గమనించారు. 1902 లో పర్షియన్ 'షా' ముసఫరుద్దీన్ ఇంగ్లండ్ వెళ్లినప్పుడు దర్యాయినూర్ ధరించాడు.



1966 లో టోరంటోలోని రాయల్ అంటారియో మ్యూజియమ్‌కు చెందిన ప్రఖ్యాత నిపుణులు డాక్టర్ వి.టి. మీన్, డాక్టర్ ఏ.డి.తుషింగామ్, జి.జి. వెయిట్ అనేవాళ్లు దర్యాయినూర్ని శాస్త్రీయంగా పరిశీలించారు. తమ పరిశోధనలో వాళ్లొక అద్భుతమైన నిజాన్ని కనుక్కోగలిగారు. 1791 లో హార్‌ఫోర్డ్ జోన్స్ గారు చూసిన దర్యాయినూరే టావెర్నియర్ వర్ణించిన గ్రేట్ టేబుల్. అయితే, మరి బరువులో తేడా ఎందుకొచ్చినట్టు ? దాన్ని కాజేసిన దుండగులెవరో గ్రేట్ టేబుల్ మహావజ్రాన్ని అడ్డసుతెలియకుండా కోసిపారేసి ప్రస్తుతం వున్న సైజుకు తెచ్చివుండాలి ! టోరంటో నిపుణులు కనిపెట్టిన మరో విశేషం ఏమిటంటే, 60 కారెట్ల నూరుల్ అనే ప్రఖ్యాత వజ్రం కూడా గ్రేట్ టేబుల్‌లోంచి కోసిన మరో భాగం అయివుండాలని ! మొన్నటిదాకా ఈ రెండు వజ్రాలూ ఇరాన్ రాచరిక ఆభరణాల్లో భాగంగా వుండేవి. ఇరాన్ షా కూలిపోయి దేశం విడిచి పారిపోయింతర్వాత ఈ రెండు వజ్రాలూ ఇస్లామిక్ విప్లవ ప్రభుత్వం అధీనంలోకొచ్చాయి ఇప్పటికీ ఇవి ఇరాన్లోనే వున్నాయి. ●

---

"లే...., లేచి నిలబడు!" ఆజ్ఞాపించాడు వజ్రపాణి.

మల్లి చంద్రశిలా వేదికమీది నుంచి లేచి నిలబడింది.

ఆమె శరీరం ఇప్పుడామె స్వాధీనంలో వుంది. కానీ, ఆమె మనసూ ఆమె మెదడూ ఆమె స్వాధీనంలో లేవు. ఆమె మెదడు అతని స్వాధీనంలో వుంది. ఆమె మనస్సు ఎవరి స్వాధీనంలోనూ లేదు. అసలామెలో ఇప్పుడు మనసన్నదే లేదు.

ఆమె ఇప్పుడొక శిల్పం.

ప్రాణమున్న శిల్పం.

నగ్న శిల్పం.

ఆమె లేచి నిలబడినప్పటికీ సన్నగా తూలుతోంది.

దేవదూతలా అలంకరించుకున్న వజ్రపాణి ఆమెను ఓసారి పరిశీలనగా చూశాడు.

మల్లి కళ్లు ఇంకా తేలిపోతున్నట్టుగానే వున్నాయి.

అతని పెదవుల పైన సన్నని చిరునవ్వు విచ్చుకుంది.

"మనమెవరం?" ప్రశ్నించాడతను.

"మనమెవరం?" రిపీట్ చేసింది మల్లి.

"నేను మహేంద్రుడ్ని! నువ్వు మేనకవు!" అన్నాడతను.

"నేను మహేంద్రుడ్ని! నువ్వు మేనకవు!" మల్లి మళ్ళీ రిపీట్ చేసింది.

వజ్రపాణి పగలబడి నవ్వాడు.

ఆ నవ్వు మహేంద్రుడు నవ్వినట్టుగా లేదు.

మేనకను చెరపట్టిన ఎవడో రాక్షసరాజు వికృతంగా నవ్వినట్టుగా వుంది.

వజ్రపాణి అలా నవ్వుతూనే మల్లిని కొలనులోకి తోశాడు.

ఎలాంటి ప్రతిఘటనా చూపకుండా నీళ్ళలో పడిపోయిందామె.

కొలనులో పెద్ద చప్పుడైంది.

వెంటనే వజ్రపాణి కూడా ఆమె వెనకే కొలనులో దూకాడు.

(ఇంకా ఉంది)



చిన్న పిల్లలకు మాటలు పలకడంలో శిక్షణ ఇస్తున్న
స్పీచ్ థెరపిస్టు పి.డి.మనోహర్

# స్పీచ్ థెరపీ

## మాటల దోషాలు ఉచ్ఛారణ దోషాలు తొలగించే వైద్యం!

ప్ర: పుట్టుకతోనే మాటలు వస్తాయా?

జ: పుట్టుకతోనే మాటలు రావు. ఇతరులు (తల్లి, తండ్రి, ఇంటిలో ఉన్నవారు) మాట్లాడే మాటలు విని పిల్లలు మాట్లాడడం నేర్చుకొంటారు.

ప్ర: మాటలు నేర్చుకోడానికి ఏవేవి అవసరము?

జ: మాటలు నేర్చుకోవడానికి, స్వరపేటిక, నోరు, నోట్లోని అవయవాలు (నాలుక, పలువరుస, అంగిలి) తెలివితేటలు, వినికిడి శక్తి అవసరము.

ప్ర: నోట్లో చిరునాలుక (కొండనాలుక) లేకపోతే మాటలు వస్తాయా?

జ: మాట్లాడడానికి చిరునాలుక అవసరము లేదు. చిరునాలిక లేకపోయినా, చిన్నదిగా ఉన్నా మాట వస్తుంది.

ప్ర: మాట ఎలా ఉత్పత్తి అవుతుంది?

జ: శ్వాస ప్రక్రియలో గాలి బయటకు వచ్చేటప్పుడు స్వరపేటికలో శబ్దము జనిస్తుంది. ఆ శబ్దము బయటకు వచ్చేటప్పుడు నాలుక, పెదవుల కదలిక వలన స్పష్టమైన శబ్దము బయటకు వస్తుంది. ఆ శబ్దము ఒక క్రమమైన పద్ధతిలో కలసినప్పుడు మాట అవుతుంది.

ఉదా: అమ్మ.

అ: స్వరపేటికలో శబ్దము ఉత్పత్తి అయి బయటకు వచ్చేటప్పుడు నోరు తెరచి ఉంచితే- 'అ' అవుతుంది.

మ్మ: స్వరపేటికలో శబ్దము ఉత్పత్తి అయి బయటకు వచ్చేటప్పుడు నోరు మూసి వేస్తే పెదవుల కలయిక వల్ల శబ్దము ముక్కు నుండి బయటకు వచ్చి 'మ్మ' శబ్దము అవుతుంది.

రెండు, ఒకదాని వెంట ఇంకొకటి పలికితే 'అమ్మ' అని ఒక మాట అవుతుంది.

ప్ర: మాటల్లో వచ్చే దోషాలేవిటి?

జ: మాటల్లోని దోషాలను ముఖ్యముగా నాలుగు రకాలుగా విభజించవచ్చు.

స్పీచ్ థెరపిస్టు
డా. పి.డి.మనోహర్‌తో
శ్రీ టి.యస్.రావు ఇంటర్వ్యూ

1. ధ్వని దోషములు: (వాయిస్ ప్రాబ్లమ్) మాటలకు మూలము ధ్వని. ధ్వని స్వరపేటికలో ఉత్పత్తి అవుతుంది. స్వరపేటిక నిర్మాణములో లోపములున్నను, మానసిక కారణాల వల్లను ధ్వనిలో దోషములు రావచ్చు.

ఉదా: మగవారు అమ్మాయిలు లాగా కీచుగొంతులో మాట్లాడుట.

అమ్మాయిలు మగవారి లాగా బొంగురు గొంతులో మాట్లాడుట.

కొందరికి ధ్వని రెండు శబ్దాలుగా వచ్చుట.

<u>2.శబ్ద ఉచ్ఛారణ దోషములు:</u> (అర్టిక్యులేషన్ ప్రాబ్లమ్) మాటల్లో ఒక శబ్దము బదులు ఇంకో శబ్దము వాడుట.

ఉదా: బస్సు బదులు బత్తు
కాకి బదులు తాతి
ఆట బదులు ఆత

<u>3. మాటల ప్రవాహములో దోషములు:</u> (ఫ్లూయెన్సీ ప్రాబ్లమ్) మాటలు ధారాళముగా రాక మధ్య మధ్యలో ఆగిపోవుట.

ఉదా: నత్తి.

<u>4.భాషలో లోపాలు:</u> (లాంగ్వేజ్ ప్రాబ్లమ్) మాటలలో తప్పు తప్పుగా మాటలు ప్రయోగము చేయుట.

ఉదా: ఆవును చూసి కుక్క అనుట.
ఆపిలు చూసి వంకాయ అనుట.

ప్ర: మాటల్లో వచ్చే దోషాలకు కారణాలు ఏవిటి?

జ: అనేక కారణాల వలన మాటల్లో దోషాలు రావచ్చు.

1. పుట్టుకలోనే గొంతు, నోరు, నాలుక, పెదాలలో లోపాలు.

2. స్వరపేటిక, అంగిలి, నాలుక, పెదవుల పక్షవాతము.

3. చెవుడు.

4. తల్లితండ్రులు, ఇతరుల మాటల్లో లోపాలుంటే పిల్లలు కూడా వారిని అనుకరించి లోపాలు తెచ్చుకొంటారు.

5. మానసిక కారణాలు (భయము, ఉద్రేకము మొదలగునవి)

6. బుద్ధి మాంద్యత్వము (వయసుకు తగినంతగా తెలివి తేటలు లేకపోవుట) (మెంటల్ రిటార్డేషన్)

7. మెదడుకి గాయాలు (బ్రెయిన్ ఇంజురి)

8. మెదడులో కొన్ని భాగములు పాడైపోవుట (బ్రెయిన్ డేమేజ్).

9. రక్తసంబంధములో పెళ్ళిళ్ళు చేసుకొనుటవలన పిల్లలు అంగవైకల్యముతో పుట్టుట. మొదలగునవి.

ప్ర: మాటల్లోని లోపాలను బాగు చేసుకోడానికి వీలవుతుందా?

జ: మాటల్లోని లోపాలను చాల మటుకు బాగు చేసుకోడానికి వీలవుతుంది. లోపములను తల్లితండ్రులు కనుగొన్న వెంటనే స్పీచ్ థెరపిస్టును సంప్రదించితే ఆ నిపుణుడు అన్ని విషయములు వివరముగా పరీక్షించి లోపాలను శిక్షణ ద్వారా బాగు చేయగలడు.

ప్ర: నత్తిని పోగొట్టడానికి మార్గమున్నదా?

జ: స్పీచ్ థెరపిస్టు నత్తిని శిక్షణ ద్వారా బాగు చేయగలడు. 12-13 సం. లోపున పూర్తిగా పోగొట్టడానికి వీలవుతుంది. బాగా వయసు ముదిరిన వాళ్ళకి నత్తిని పూర్తిగా పోగొట్టడానికి వీలు లేక పోయినా చాల వరకు తగ్గించడానికి వీలవుతుంది.

ప్ర: కొందరు పిల్లలకు మాట అసలు రానే రాదు? ఎందువల్ల వాళ్ళకు మాట రాదు?

జ: పిల్లలకు పుట్టుకతోనే రెండు చెవులు వినపడక పోయినను (చెవుడు) మెదడు ఎదుగక తెలివితేటలు లేకపోయినను, మెదడులోని భాగములు దెబ్బతినినను మాటలు నేర్చుకోలేరు. వీళ్ళను మూగవాళ్ళని అంటారు.

ప్ర: మూగ పిల్లలకు మాటలు నేర్పించడానికి వీలవుతుందా?

జ: చెవులు వినపడక మాటలు రాని పిల్లలకు, చెవులకు మిషను వేసిన తరువాత "పెదవి చదువు" (లిప్ రీడింగ్) ద్వారా మాటలు నేర్పుటకు వీలవుతుంది. చెవుడు, మూగ పిల్లలు చాల చురుకుగా ఉంటారు. ప్రతిది కళ్ళతో చూసి నేర్చుకొంటారు. శిక్షణ ద్వారా వాళ్ళ నిత్యావసరాలకు కావలసినంత మాటలు నేర్చుకొంటారు. ఇతరులు మాట్లాడినప్పుడు కూడా చూసి అర్థము చేసుకొంటారు. ఇతర కారణాల వల్ల మాటలు రాని పిల్లలకు కూడ మాటలు నేర్పించవచ్చు. తెలివితేటలు మధ్యస్థంగా ఉన్న పిల్లలకు మాటలు నేర్పిస్తే మాటలు నేర్చుకొంటారు.

ప్ర: పుట్టుకతో నోట్లో మొట్టి (క్లెఫ్టె లిప్ అండ్ పాలేట్) ఉన్న పిల్లలకు మాట వస్తుందా?

జ: అలాంటి పిల్లలకు కూడా మాటలు నేర్పించవచ్చు. మొదటి మొట్టని ప్లాస్టిక్ సర్జరీ ద్వారా మూసివేసి స్పీచ్-థెరపిస్టు ద్వారా శిక్షణ ఇప్పిస్తే మాటలు చక్కగా నేర్చుకొంటారు. మాటలలోని లోపాలను పూర్తిగా బాగు చేయవచ్చు.

ప్ర: కొందరికి గొంతు కేన్సర్ వలన స్వర పేటిక తీసివేస్తారు. వీరు మాట్లాడడానికి వీలవుతుందా?

జ: స్వరపేటిక తీసి వేయుట వలన మాట్లాడుటకు ముఖ్యముగా కావలసిన స్వరము ఉండదు. మిగతా అవయవములన్నియూ బాగున్ననూ స్వరము లేకపోవుట వలన ఎవరికీ మాటలు వినపడవు. ఇటువంటి వారికి రెండు విధములుగా కృత్రిమ స్వరము సమకూర్చవచ్చు. మొదటిది – కడుపులో పుట్టే త్రేపును ఉపయోగించి మాటలు నేర్పించవచ్చు. రెండవది – కృత్రిమ స్వర పేటిక అను ఎలక్ట్రానిక్ పరికరము ద్వారా శబ్దమును గొంతులో పంపి మాట్లాడుటకు వీలు చేయవచ్చు.

ప్ర: మాటలలో లోపాలను శిక్షణ ద్వారా బాగు చేసే 'స్పీచ్ థెరపిస్టులు' మన రాష్ట్రములో ఎక్కడ ఉన్నారు?

జ: విజయవాడ, తిరుపతి, విశాఖపట్టణము, హైదరాబాదు నగరములలో ఉన్నారు.

# వారఫలం

**20-10-1989 శుక్రవారం మొదలు**
**26-10-1989 గురువారం వరకు**

**మేషం :** ఆదాయ మున్నది. మిత్రానుకూలత గల సమయం. బంధుమిత్ర సమాగమం. శుభ సమయం. పత్రికా రంగాన శ్రమించువారికి, అధిపతులకు అనుకూల సమయం. బహుదూర ప్రాంతాలకు వెళ్ళవలసిన అగత్యమున్నది స్త్రీలకు : ధనలబ్ధి.

**వృషభం :** వ్యవహారరీత్యా అనుకూలం. శుభ వార్తా శ్రవణం. సమయానికి కావలసినంత డబ్బు అందిరావటం వారగ్రహానుకూలత. సాధు సజ్జన సాంగత్యం, చేసిన పని మూలాన ధనలబ్ధి. విద్యావేత్తల పరిచయం. రచనా రంగాన ప్రసిద్ధి. స్త్రీలకు: శుభ వార్తలు వింటారు. కొందరకు ఉద్యోగరీత్యా అభివృద్ధికరమైన వార్తా శ్రవణం.

**మిధునం :** చాలా కాలంగా అందీ అందక ఉన్న డబ్బు క్రమంగా అందుట గమనిస్తారు. అత్యాశకు వెళ్ళి, ఏదో సాధించాలని, అప్పులు చేయ దలపెట్టుట శ్రేయోదాయకం గాదు. "అప్పు చేయ రోత హరిహరాదులకైన" వినే ఉంటారు స్త్రీలకు: అభివృద్ధికరమైన మార్పులు రానున్నాయి. వ్యాపారం యిప్పట్లో అనుకూలింపదు, గ్రహించాలి.

**కర్కాటకం :** ఏ రంగంలో తిరుగుతున్నా మేలే. కళాసాహితీరంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది. విద్యా వ్యాసంగం అభివృద్ధి దాయకం. వృత్తియందు అనుకూలం. పంపిణీదారులకు, సాహితీపరులకు, నాట్య నాటక కోవిదులకు, చిత్ర రంగాన క్రమాభివృద్ధి ఆశించువారికి మేలు. స్త్రీలకు : క్రొత్త మిత్ర పరిచయం, రాజకీయాన వృద్ధి.

**సింహం :** ముఖ్యబంధువులు యింటికి రానున్నారు. సుఖ సంపదలకు లోటులేదు. అప్రయత్నంగా అదాయమున్నది. కేతుగ్రహ గోచర క్రమాను గతంగా తగ్గిపోయింది. వాహనం సేకరించుకొనుటకు, ఆనందం అనుభవించుటకు సమయంగాదు. స్త్రీలకు : స్వల్పాదాయం, వృత్తిరీత్యా మేలు.

**కన్య :** 'శని గ్రహం' మీ రాశికి నాల్గింట ఉన్నాడు. పెద్దగా యోగదాయకుడు గాడు. గురుని 'దశమ' స్థితి కూడ అంతే. వృత్తి వ్యాపారాలు అనుకూలించవు వ్యవహార దక్షతకు ఆస్కారం లేదు. కళారంగాన ప్రఖ్యాతికి ఆస్కారం లేదు. వ్యాపారరంగాన గౌరవదాయక దినాలు గావు. స్త్రీలకు: ఉద్యోగమందు జాగరూకత అవసరం, గ్రహించాలి.

**తుల :** చాలా కాలంగా దూరమైన మిత్రులు హటాత్తుగా మిత్ర భావంతో మళ్ళీ దాపునకు వస్తారు. రాజకీయరంగాన శ్రమించటం మేలే. 'శని' ఆశీస్సు లున్నాయి. పత్రికారంగాన శ్రమించువారికి మేలైన వారం. కథకులకు, గాయకులకు అనుకూల సమయం. స్త్రీలకు: శుభ ప్రస్తావనలు, వృత్తియందు వికాసం.

**వృశ్చికం :** ఇచ్చిన డబ్బు క్రమానుగతంగా వసూలు కాగలదు. ఒక సమయంలో ఆ డబ్బు రాదని భయపడుతారు కూడ. కానివర్గ మున్నది, చాడీకోరు లున్నారు, మీ ప్రగతిని ఓర్వలేని వారున్నారు. జాగ్రత్త. మీరు గమనించే ఉంటారు. స్త్రీలకు వృత్తియందు పెంపు, ఉద్యోగమందు అధికారుల ఆదరణ, బిడ్డల పెంపుకై చేయు యత్నాలు సానుకూలం కాగలవు, గ్రహించాలి.

**ధనుస్సు :** రాశియందున్న శనిగ్రహం, పెద్దగా అపకారి గాడు. సప్తమ స్థాన స్థితుడైన 'గురుడు' అనుకూలుడు. వృత్తి ఉద్యోగం సర్వానుకూలప్రదం. ఇరుగు పొరుగు తగాదాలు రావచ్చు. 'రాహుకేతు' గ్రహాలు అనుకూలురుగారు, గ్రహించండి. స్త్రీలకు: వృత్తి పెంపు, ఆరోగ్య వృద్ధి, శుభవార్తా శ్రవణం.

**మకరం :** వారమంతా మేలుగా జరుగుతుంది. ఇంట కళ్యాణ చర్చలు జరుగవచ్చు. పరులకు యిచ్చిన డబ్బు అందవచ్చు. కళాసాహిత్య రంగాలలో మేలు పొందవచ్చు. వృత్తియందు అనుకూల మార్పు రావచ్చు. రచయితలకు, పాత్రికేయులకు అనుకూల వారం. స్త్రీలకు విలువగల వస్తువులు సేకరిస్తారు. లాభదాయక దినాలే.

**కుంభం :** విధీ విరామం ఎరుగక తిరిగి తిరిగి ఒకానొక వ్యవహారాన మేలు పొందుతారు. ఎంతో లాభం గడించారని సంతోష పడుతారు. వృత్తియందు పెంపు కనిపించుట గమనింపదగిన అంశం. చలన చిత్రరంగాన సదవకాశాలు లభిస్తాయి కొందరకు. కొందరకు వృత్తిరీత్యా పెంపు. స్త్రీలకు: అధికార వృద్ధి ధనలబ్ధి.

**మీనం :** స్థిరాస్థి వ్యవహారాలు రావచ్చు. ప్రయాసతో గాని మీకు అనుకూలింపవు. బంధు మిత్రులు యింటికి రాగలరు, వివాహ విషయంగా చర్చ లుంటాయి. వృత్తిరీత్యా అభివృద్ధికరమైన మార్పు రానున్నది. స్త్రీలకు సుఖశాంతులు, వృత్తి వికాసం. రాజకీయరంగాన శ్రమించాలనే ఆకాంక్ష.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## మలేషియా మీనార్‌లు



మసీదుకు నాలుగు వైపులా నిర్మించే బురుజుల స్తంభాలతో ఎత్తయిన "మీనార్లు" మలేషియాలో వున్నాయట.

ఈ చిత్రంలో కనబడే మీనార్లు ప్రపంచంలో నే ఎత్తయినవి. వీటి ఎత్తు 1374 మీటర్లట.

ఇంత ఎత్తు వున్న మీనార్లతో నిర్మిస్తున్న ఈ క్రొత్త మసీదు మలేషియాలోని సెలంగూర్‌లో వున్న షా ఆలంలో వున్నది.

**స్కూ**లుకు తయారై బయలుదేరబోతున్న సమయంలో నా స్నేహితులు జాన్, రహంతుల్లా మా ఇంటికి పరుగెత్తుకొచ్చారు. వారందించిన వార్త విని నేను ఖిన్నుడనయ్యాను! మా క్లాస్‌మేట్ భార్గవి తండ్రి రాత్రి గుండెపోటు వచ్చి చనిపోయాడు.

శర్మగారిది చాలా పేద కుటుంబం. ఆయనకు భార్గవి ఒక్కతే సంతానం. ఆయన నాయుడిగారి రైస్ మిల్లులో గుమాస్తాగా పని చేస్తూ ఆ వచ్చే జీతంతో కుటుంబాన్ని పోషిస్తున్నారు.

నేను పుస్తకాలు అక్కడ పడేసి శర్మగారింటికి పరుగుతీశాను. జాన్, రహంతుల్లా నన్ననుసరించారు.

వీధి వాకిట అరుగుమీద శర్మగారి భౌతికకాయాన్ని పరుండబెట్టి వుంచారు. తల వైపు దీపం వెలుగుతోంది. శర్మగారి భార్య, భార్గవి గుండెలవిసేలా రోదిస్తున్నారు. కొంత మంది ఆడవాళ్ళు వాళ్ళిద్దర్నీ ఓదార్చడానికి ప్రయత్నం చేస్తున్నారు. వూరిలోని మగవారు గుంపులు గుంపులుగా చేరి చూస్తూ నిల్చున్నారు.

నేను అక్కడి పరిస్థితులు చూచి చలించి పోయాను. ఇక ఆ కుటుంబానికి దిక్కెవ్వరు? భగవంతుడి లాంటి దురదృష్టకర పరిస్థితుల నెందుకు ఏర్పరుస్తాడో? మనుష్యులను దీనులను చేసి ఏడిపించడం ఆయనకు సరదా కావచ్చు.

మా స్నేహితత్రయం స్కూలు మానేసి భార్గవిని ఓదారుస్తూ కూర్చున్నాము. మధ్యాహ్నం మూడు గంటల వేళ భార్గవి వాళ్ళ ఇంటి ఓనర్ వీరభద్రరావు వచ్చాడు.

"శవాన్ని తరలించే ఏర్పాట్లు చూడండి. మళ్ళీ ప్రొద్దుపోతే అంత్యక్రియలకు కష్టమౌతుంది" అన్నాడు.

అంత్యక్రియలు మాట వింటూనే అక్కడ గుమిగూడిన వారంతా ఒక్కొక్కరే జారుకొన సాగారు. ఈ మనుష్యుల ప్రవర్తన నాకు వింతగా తోచింది. ఎవరు పట్టించుకొనకపోతే జరగవలసిన తతంగం జరిగేదెలా? ఎవ్వరూ పట్టించుకొనక పోయినా, నా స్నేహితుల సాయంతో అంత్యక్రియలు నేనే జరిపించాలనుకున్నాను.

"అమ్మా! మీ తరపున రావలసిన వాళ్ళెవరైనా వున్నారా?" అడిగాను శర్మగారి భార్యను.

"ఎవ్వరూ వచ్చేవాళ్ళులేరు." నిర్వికారంగా అందావిడ.

"కార్యక్రమం ఎలా ప్రారంభించాలి?" నాకేమీ తెలియదు గనుక ఆమెనే అడిగాను.

"ఆయన ఒకప్పుడు బాగా బ్రతికిన వాడు. 'అంత్యక్రియలు శాస్త్రోక్తంగా జరిపించండి బాబు" కళ్ళు తుడుచుకుంటూ అందామె.

"అందుకే, కార్యక్రమం ఎలా మొదలెట్టాలో చెప్పండి" అన్నాను నేను.

"ముందువెళ్ళి శాస్త్రిగారిని కలవండి. ఆయన కావలసిన వస్తువుల జాబితా ఇస్తాడు. ఆయన చెప్పిన ప్రకారం చెయ్యండి." శర్మగారి భార్య సూచించింది.

మేము ముగ్గురం శాస్త్రిగారింటికి వెళ్ళాము. వాకిట అరుగుమీద కృష్ణాజినం మీద కూర్చుని ఏదో పురాణ గ్రంథం చదువుకుంటున్నాడాయన.

"నమస్కారం స్వామీ" ముగ్గురం ఏక కంఠంతో పలికాము.

"ఏమిటోయ్ పిల్లకుంకలు పరుగెత్తుకొచ్చారు." కళ్ళద్దాల నుండి మమ్ములను చూస్తూ అడిగాడాయన

"శర్మగారు వెళ్ళిపోయారు. అంత్యక్రియలు జరిపించడానికి మిమ్మల్ని పిలవ మన్నారు. కావలసిన వస్తువుల జాబితా వ్రాసిస్తే, వెళ్ళి తీసుకొస్తాము." అన్నాను నేను.



"పిల్లకాకులులా మీరేంటి పెత్తనం వహించేది? అతనికి మగపిల్లలు లేరుగా ముందు తలకొరివి పెట్టే మనిషిని వెతుక్కొరండి. అలాగే శవాన్ని శ్మశానానికి మోసుకెళ్ళేందుకు మోతగాళ్ళను చూడండి."

"అవన్నీ మాకేం తెలుసు స్వామీ. మీరే ఆ ఏర్పాట్లు చూడకూడదూ?"

"పట్నం వెళ్ళి సత్రం దగ్గర విచారిస్తే వస్తారు."

"అందుకుగాను కూలి మనుష్యు లుంటారా స్వామి?"

"వున్నారయ్యా! అయినా ఎవరన్నా పెద్దవాళ్ళు రాక, మీరు పూనుకున్నారేంటి. ఇదంతా చాలా ఖర్చుతో కూడిన వ్యవహారం. మోతగాళ్ళకు కూలి రెండువందల యాభై రూపాయలు. తల కొరివి పెట్టే కూలి మనిషికి వంద రూపాయలు. అలాగే ఏడుగుండ్ల కట్టెలు కావాలి. ఇందుకు ఓ నూటపాతిక రూపాయ లౌతాయి. ఇకపోతే ఈ రోజు దహనం చేయించి, రేపు సంచయనం చేయించడానికి నా బృహస్పతి దానం అయిదు వందలు. పాడి కట్టెలు– కుండలు, నువ్వులు వగైరా కొక యాభై రూపాయలు. సుమారు వెయ్యి రూపాయలుంటేనే కార్యక్రమం మొదలుపెట్టను వీలౌతుంది."

"శర్మగారి దీన పరిస్థితిని దృష్టిలో వుంచుకుని కాస్త ఉదారంగా వ్యవహరించండి." ప్రాధేయపడ్డాను నేను.

"ఇందులో ఉదారం ఏదీ లేదు. సుస్తీ చేసిందని డాక్టర్ వద్ద కెడితే "అయ్యో పాపం!" అని మందిచ్చి పంపిస్తున్నాడా? రోగాన్ని గురించి భయంకరంగా చెప్పి వీలైన వరకు డబ్బు గుంజడం లేదూ? ఏదైనా అంతేరా కుర్రకుంకా! కావలసిన వస్తువులు వ్రాసిస్తాను. వెళ్ళి పట్టుకురండి" అని తెల్ల కాగితం మీద కావలసిన వస్తువుల జాబితా వ్రాసిచ్చాడు.

"శాస్త్రిగారు! వాళ్ళు ఏమీ లేనీ పేద వారు. మీసాటి కులస్తులు. మీరు సాయం చెయ్యలేరా?" అడిగాను నేను.

తల అడ్డం తిప్పాడాయన.

"మీ మంత్రం లేకుండా దహనం చేస్తే ఏమౌతుంది?" నాలో అంతకంతకు ఉక్రోషం పెరుగుతూంది.

"చనిపోయిన ఆ వ్యక్తికి సద్గతులు దక్కవు."

"అంటే మీ మంత్రాలలో అంతటి ప్రభావముందా?"

"వేదమంత్రాలతో కూడినది వైదీకం. మీకేది చెప్పినా అర్థంకావు. వెళ్ళండి" అని లేచి ఇంట్లోకి వెళ్ళి పోయాడాయన.

ఇతను కాకపోతే మరొకడు అనుకొని, జాన్, రహంతుల్లాలను జాబితాలోని వస్తువులు తీసుకురమ్మని పురమాయించి, నేను సైకిలెక్కి ప్రక్క గ్రామం వెళ్ళి అక్కడి పురోహితుణ్ణి కలిసాను.

"మీ గ్రామం శాస్త్రిగారు లేరా?" అడిగాడాయన.

"వున్నారుకానీ... ఆయన రేటు ఎక్కువ చెప్తున్నారు."

"అలాగా! అయినా ఆయన పరిధిలోని గ్రామానికి, ఆయన అనుమతి లేకుండా మేము వచ్చి చేయకూడదు. ఇది మా వృత్తి నిబంధన. వెళ్ళి ఎలాగోలా ఆయనకు నచ్చచెప్పు." అని ముక్కుసూటిగా నిరాకరించాడాయన.

"పురజనుల హితవుకోరే వారిని పురోహితులనాలిగానీ, ఇలాంటి పరాన్నభుక్కులను కాదు" అనుకుంటూ సైకిలెక్కి మా వూరి దారిపట్టాను.

గ్రామం చేరేసరికి రహంతుల్లా, జాన్ నాకోసం ఎదురు చూస్తున్నారు. గ్రామంలోని ఇళ్ళన్నీ తిరిగి చందాలు వసూలు చేసాము. సుమారు అయిదువందలు వసూలైంది. శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపించడానికి ఈ మొత్తం

చాలదు.

"అమ్మా! మీరు కోరిన రీతి అంత్యక్రియలు జరిపించడం స్వార్థం పెరిగిన ప్రస్తుత సమాజంలో జరిగే పనిలాలేదు. పేదరికం ఒక మహా శాపమనుకుంటే, దానికి ప్రత్యామ్నాయం మన శాస్త్రాలను మార్చివేయడం, లేదా ఏమార్చివేయడమే. మనం జరిపే శాస్త్రోక్తమైన అంత్యక్రియలు ద్వారా ఆయన ఆత్మకు సద్గతులు కలుగుతాయనుకోవడంకన్నా, అతనీ ప్రపంచంలో బ్రతికి వున్నప్పుడు చేసిన పుణ్యకార్యాలు అతని ఆత్మకు మేలు చేస్తాయని నమ్మడం మేలు. మేము పేదవారం. అందుకే మాకు చేతనైన రీతి ఈ దివంగతునికి అంత్యక్రియలు జరిపిస్తాము." అని ఆమె అనుమతి తీసుకున్నాను.

రహంతుల్లా వెళ్ళి వాళ్ళ రెండెడ్లబండిని తెచ్చాడు. పాడెకట్టి, ఆ శవాన్ని బండిమీద వుంచాము. కొరివిపట్టడానికి అవసరమైన నిప్పును నేనే చేతపట్టుకున్నాను.

"బాబు! నీవు తల్లీ– దండ్రీ వున్న వాడివి. నీవు కొరివి పెట్టకూడదు." అంతటి శోకంలోను నన్ను వారించింది శర్మగారి భార్య.

"పర్వాలేదు. ఇదొక పుణ్యకార్యంగా భావిస్తున్నాను. నాకే కీడు జరగదు." అని నేనంటూండగానే, నా చేతిలోని "నిప్పు ఉట్టిని" మరొక చేయి అందుకుంది.

"మాస్టారు మీరా?" ఆశ్చర్యంగా అడిగాను.

మా తెలుగుమాస్టారు నరసింహంగారు నాకేసి ప్రసన్నంగాచూస్తున్నారు.

"అమ్మా! మీ భర్త అంత్యక్రియల కొచ్చిన దిగులులేదు. ఆ మంత్రాలు, వాటి అర్థాలు నాకూ తెలుసు. నాకు తల్లీ దండ్రిలేరు. ఆయన తలకొరివి నేను పెడతాను" అని బండి వైపు సాగాడాయన.

మా క్లాసు పిల్లలంతా బండి వెనుక బారులు తీరి నిల్చున్నారు.

వారందర్నీ చూడగానే నాలో కొత్త ఉత్సాహం వచ్చింది.

బండి బయలుదేరింది. వెళ్ళిపోతున్న ఆ కట్టెకు చివరిసారి వీడ్కోలు చెప్పింది ఆమె. భార్గవి గుండెలవిసేలా రోదిస్తూంది.

గ్రామవీధులగుండా బండిమీద శర్మగారి భౌతికకాయాన్ని ఊరేగింపుగా తీసుకెడుతూంటే ఇళ్ళలో నుండి బయటికొచ్చి చూస్తున్నారు గ్రామస్తులు.

ఊరికి ఉత్తరంగా వున్న స్మశానవాటికకు చేరింది



ఊరేగింపు. అక్కడ చితిపేర్చి, ఆ చితిపై శవాన్ని వుంచి, నరసింహం మాస్టారు నదిలో స్నానం చేసివచ్చి, చితిచుట్టు మూడుసార్లు ప్రదక్షిణం చేసి, ఏవేవో మంత్రాలు వల్లిస్తూ చితికి నిప్పంటించారు.

మేమందరం చూస్తూండగానే మంటలు వ్యాపించి, శర్మగారి భౌతికకాయాన్ని ఆవహించసాగాయి. కొన్ని గంటలు వ్యవధిలో అక్కడ బూడిద మిగిలింది.

మేమందరం వెళ్ళి నదిలో స్నానాలు చేసి, మళ్ళీ శర్మగారింటికి చేరుకున్నాము.

"అమ్మా! చనిపోయినవారు తిరిగిరారు. వున్నవాళ్ళం వారితో టిదే లోకమనుకొని వెళ్ళలేము. ఇక్కడ మీకొక శాస్త్ర ధర్మం చెబుతాను. చనిపోయిన వ్యక్తి తాలూకూ ఆత్మను యమధర్మరాజు వద్దకు తీసుకెడతారట. అక్కడ అతను చేసిన పాపపుణ్యాలను బేరీజు వేసి అతను నరకానికి వెళ్ళవలసి వుంటే, "నీ తరఫున ఎవరైనా పుణ్యం చేయగల వారున్నారా?" అని అడుగుతారట. అప్పుడు ఆ జీవి తనకు సంబంధించిన వారు పుణ్యకార్యం నిర్వహించి, ధర్మదేవతను తృప్తిపరుస్తాడు అని అవకాశం అడుగుతాడట. అందుకే చనిపోయిన వారి పేర కర్మక్రతువులు జరిపించి, వారికి సద్గతులు కలిగిస్తారు. పుణ్యకార్యం అంటే ఒకరిని తృప్తి పర్చడం. ఈ మనుష్యుల ఆశకు అంతులేదు. ఏ రూపంలో దానం చేసినా "ఇంకా కావాలి" అంటారేగానీ, 'తృప్తి చెందాము' అనలేరట. అలా అనిపించాలి అంటే, వున్న అవకాశం కొందరికైనా మృష్టాన్న భోజనం పెట్టడం. అలా అన్నం పెట్టి, "తృప్తి చెందారా?" అని అడిగితే, 'తృప్తి చెందాము' అని అంటారట భోక్తలు. అందుకే కర్మంత్రం అంటే పదిమందికి భోజనం పెట్టే ఆచారం వుంది. మా విద్యార్థి సురేష్ ఈ సందర్భంగా వసూలు చేసిన అయిదువందలలో నూటపాతిక కట్టెలకు పోను, మిగిలిన డబ్బు మీకిస్తున్నాను. నేను, మా విద్యార్థులు దగ్గర వుండి ఆ తంతు కూడా జరిపిస్తాము. సవ్యమైన మంత్రంతో నేనే పౌరోహిత్యం వహిస్తాను. మా విద్యార్థులీ విషయంలో గ్రామస్తులకు ఆదర్శప్రాయులయ్యారు. మానవత్వం ఇంకా ఈ భూమి మీద వుందని నిరూపించారు. శర్మగారి ఆత్మకు తప్పక శాంతి చేకూరుతుంది" మా నరసింహం మాస్టారు ఆమెను వూరడించారు.

ఆమె మా అందరికేసి కృతజ్ఞతగా చూచింది.

పదవరోజు కర్మక్రతువులు మా నరసింహం మాష్టారుగారి సహకారంతో పూర్తి చేసాము.

గ్రామస్తులంతా ఈ విషయంలో సంతోషించినా, ఆనవాయితీని మార్చినందుకు, తన ఆదాయం పోగొట్టినందుకు శాస్త్రిగారు కుతకుతలాడి పోయారు. తనంతటి ఉద్దండ పండితుణ్ణి, ఎదిరించి వీళ్ళు నిర్వహించిన ఈ కార్యక్రమమంతా అపభ్రంశమైనదని, మంత్ర రహితమైన కర్మక్రతువులు నిష్ప్రయోజనమైనదని, తనంతటి నిష్ఠా గరిష్ఠుడి చేతిమీదుగా ఆ కార్యం జరిపించుకొనే అదృష్టం వాళ్ళకు లేకపోయిందని సరిపెట్టుకున్నాడు.

* * *

శాస్త్రిగారు పౌరోహిత్యంమీద బాగా సంపాయించారు. పది ఎకరాల మాగాణీ భూమి వుంది. అతనికి ఒక్కడే కుమారుడు. అతన్ని డాక్టరీ చదివించాడు. ఇక్కడ సంపాయించేది చాలదని అతన్ని విదేశాలకు పంపించాడు. భార్య ఇటీవలే కాలం చేసింది. ఏ చీకూ చింతాలేని జీవితమాయనది. శుభ కార్యాలకు ముహూర్తాలు నిర్ణయించడం, తన చేతిమీదుగానే జరిపించడం శ్రార్ధ కర్మలు జరిపించడం ఆయన వృత్తి. పౌరోహిత్యం పాడికుండతో సమానమన్నారు మరి.




* * * * * *

ఆ రోజు, నేను నా స్నేహితుడు జాన్ పట్నం వెళ్ళి ఉదయం సినిమా చూచి తిరిగి వస్తున్నాము. రోడ్డు పక్కగా నడుస్తున్న మా మీదకు వెనుకనుండి ఒక స్కూటర్ దూసుకొచ్చింది. దానిముందు చక్రం జాన్‌కేసి గుద్ది కీచ్‌మని శబ్దం చేస్తూ ఆగిపోయింది. జాన్ బోర్లా పడిపోయాడు. నే నదిరిపోయాను. క్షణంలో అక్కడ జనం గుమిగూడారు. స్కూటర్‌వాలాను నాలుగు తిట్టారు. జాన్‌ను లేవదీసి రిక్షాలో కెక్కించాము. కాలుకు బలమైన గాయమై రక్తం కారుతూంది. స్కూటర్‌వాలా మావెంట హాస్పిటల్ కొచ్చాడు. ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో మా వాడికి ట్రీట్‌మెంట్ ఇవ్వను నిరాకరించారు. చేసేదిలేక జాన్‌ను తీసుకొని గవర్నమెంటు ఆసుపత్రికి వెళ్ళాము. నిబంధనల మేరకు పోలీసులకు ఫోన్ చేసి, జాన్‌కు ట్రీట్‌మెంటు మొదలు పెట్టారుడాక్టర్లు.

"బాబు! నేనేం కావాలని మిమీదకు నడపలేదు. ఎదురుగా విసురుగా వస్తున్న సైకిల్‌ను తప్పించబోవడంలో ఇలా జరిగింది. మీ వైద్యానికి అవసరమైన డబ్బు నేనిస్తాను. ఇది నీ పొరపాటేనని చెప్పు. లేకుంటే పోలీసులు మనల నిద్దరిని పీడించుకు తింటారు" అని ప్రాధేయపడ్డాడు స్కూటర్‌వాలా.

నాకు ఇది సబబే అనిపించింది.

ఆ సాయంత్రానికి జాన్‌ను డిస్చార్జి చేసారు. మేమిద్దరం హాస్పిటల్ హాల్ దాటి వస్తుండగా, వార్డ్‌బాయ్‌లు స్ట్రెచర్ మీద ఓ మృతదేహాన్ని తీసుకొస్తూ కనిపించారు. సరిగ్గా మా వద్ద కొచ్చేసరికి ఆ మృతదేహంమీది గుడ్డ గాలికి తొలగిపోయింది. ఆ వ్యక్తి ముఖం కేసి చూచిన మేమిద్దరం అదిరిపడ్డాము. ఆయన మా వూరి శాస్త్రిగారు.

"వీరికేమైంది?" వార్డ్‌బాయ్‌ని అడిగాను.

"రెండు రోజుల క్రితం రోడ్డు ప్రమాదంలో తీవ్రంగా గాయపడితే ఇక్కడ చేర్పించారు. ఆయన వూరు, పేరు తెలియలేదు." జవాబిచ్చాడు వార్డ్‌బాయ్.

"వీరు మా వూరు శాస్త్రిగారు. వీరి నెక్కడికి తీసుకు వెడుతున్నారు?"

"మార్చురీకి పోస్ట్‌మార్టమ్ జరపడానికి వీరి అడ్రస్ కోసం డాక్టర్‌గారు ప్రయత్నిస్తున్నారు. మీరొకసారి డాక్టర్‌గార్ని కలవండి" అని వార్డ్‌బాయ్‌లు శవాన్ని ముందుకు తరలించుకు పోయారు.

నేను జాన్‌ను బెంచీమీద కూర్చుండబెట్టి

డాక్టర్‌గారి వద్దకు పరుగు తీసాము.

"సార్! చనిపోయిన శాస్త్రిగారిదీ మా వూరు."

"అలాగా! అయన అడ్రస్ కోసం చాలా ప్రయత్నించాము మేము. వారి సమీప బంధువులకు చెప్పి పంపండి. శవాన్ని అప్పగిస్తాము.

"అయన ఒక్కగా నొక్క కొడుకు విదేశాలలో వున్నాడు సార్! నేను వెంటనే వెళ్ళి అతనొచ్చే ఏర్పాటు చేస్తాను" అని బయట కొచ్చాను.

జాన్, నేను గ్రామం వస్తూనే గ్రామ పెద్దల కీ విషయం తెలియచేసాము. మావూరి పోస్టుమాష్టర్‌గారి ద్వారా శాస్త్రిగారి కుమారుని అడ్రస్ సంపాయించి, కేబుల్ ఇచ్చాము. గ్రామ పెద్దలంతా, 'ఇంతకంటే మనం చేయగలిగింది లేదు. వారి కుమారుడు వచ్చేవరకు ఎదురుచూద్దాం' అని సరిపెట్టుకున్నారు.

తర్వాత రెండు రోజుల వరకు మాకే వివరము తెలియలేదు. బహుశా అయన నేరుగా హాస్పిటల్‌కు వచ్చి, శవాన్ని స్వాధీనపర్చుకుని పట్నంలోనే అంత్యక్రియలు జరిపి వుంటారని అనుకొని సరిపెట్టుకున్నాం. కానీ నాలుగు రోజుల తర్వాత హడావుడిగా టాక్సీలో వచ్చారు శాస్త్రిగారి కొడుకు.

"మా నాన్న కేమైంది?" అడిగాడు నన్ను.

"రోడ్డు ప్రమాదంలో మరణించారు. మీరింకా హాస్పిటల్‌కు వెళ్ళలేదా?" ఆశ్చర్యంగా అడిగాను నేను.

"ఏం చెయ్యను. అక్కడ పనులు చక్కబెట్టుకొని రావడం కాస్త ఆలస్యమైంది. బాబూ! నీవు కూడా నాతో రా హాస్పిటల్‌కు వెళ్ళి విచారిద్దాం" అడిగాడాయన.

నేను ఆయన వెంట కారెక్కి పట్నం బయలు దేరాను.

మేము హాస్పిటల్‌కు వెళ్ళి డాక్టర్‌గార్ని కలిసాము.

"సారీ బ్రదర్! మా రూల్స్ ప్రకారం శవాన్ని డెబ్భై రెండు గంటలకంటే ఎక్కువ కాలం నిల్వ వుంచలేము. మీ రెవరూ రాలేదు గనుక, "అనాధ శవం"గా మున్సిపాలిటీకి అప్పగించాము. వారే తీసుకెళ్ళి ఖననం చేశారు" డాక్టర్‌గారు చెప్పారు.

ఒక్క దీర్ఘ నిట్టూర్పు విడిచి బయటి కొచ్చాడు శాస్త్రిగారి కొడుకు.

'మిస్టర్ సురేష్- ఇంత బ్రతుకు బ్రతికి అనాధప్రేతంగా మట్టిలో కలిసి పోయాడు మా నాన్న. ఓ. కే. ఏదీ మన చేతులలో లేదు. నా కొక్క సాయం చేసిపెట్టు." అడిగాడాయన.

"చెప్పండి సార్!" అన్నాను.

"నేను అమెరికాలో అర్థాంతరంగా చాలా పనులొదిలిపెట్టి వచ్చాను. నీ వద్ద ఓ అయిదు వేలిస్తాను. కూలి మనుష్యులను పెట్టి మా నాన్నగారి కర్మక్రతువులను జరిపించు. పోయిన వాళ్ళెలాగు పోయారు. అనవసరంగా రోజుకు ఇరవై వేలు ఆదాయం పోగొట్టుకొని, ఇక్కడ అర్థం లేని ఈ కార్యక్రమం నిర్వహించడ మెందుకు?" అన్నాడాయన.

"అదికాదు సార్! ఆయన కొడుకుగా ఆయనకు కర్మక్రతువులు నెరిపి, ఆయనకు సద్గతులు కలిగించడం మీ ధర్మం" నాకు తోచిన సలహా ఇచ్చాను.

"ఫర్వాలేదు. పౌరోహితుడుగా ఆయన ఎన్నో పుణ్యకార్యాలు చేసాడు. ఆయన కసలు వేరే కర్మక్రతువు లక్కరలేదు. ఆయన తప్పకుండా పుణ్యలోకాల కెళ్ళ గలడు." అని బ్రీఫ్‌కేస్ తెరిచి, నోట్ల కట్టలు నా కందించాడు.

నేను టాక్సీ దిగాను. నేను పరిస్థితి అర్థం చేసుకొనేంతలోనే ఆయన విలాసంగా నాకేసి చేయి వూపుతున్నాడు, ముందుకు వెడుతున్న టాక్సీ కిటికీ నుండి.

"శాస్త్రిగారి ఆత్మకు శాంతిని చేకూర్చు భగవాన్!" అని మనసులోనే దేవుడిని ప్రార్థించి, మా వూరి బస్టాండు వైపు నడక సాగించాను.



# రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము.

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి. కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది. వ్యాసాలు 3 అరఠావు పేజీలు మించరాదు. వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం.

రచనలు స్వంత రచనలై ఉండాలి. అనువాదాలు, అనుసరణలు, కాపీ రచనలు పంపరాదు. ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి.

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి. వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి.

కథల పరిశీలనకి 1-2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును. పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది. ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన కవరు జత పరచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు. రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం.

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి. రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి. లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి. కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది.

– సంపాదకుడు

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము

(గత సంచిక తరువాయి)















అని వాడు ప్రాణభీ
తిని పలాయితుడాయె
నని చెప్పి చక్రధా
రిని జూచి భూసురుడు
'తడవాయె నిక నేను
వెడలి పోయెద' నంచు
ఇంటి దారిని బట్టి
ఒంటిగా జనినాడు



... గేయరచన ...
నండూరి రామమోహనరావు ✿ బొమ్మలు... బాపు




శాఖ శాఖకు కథా
నేక సుమములు గలిగి,
సుమ సుమంబున నీతి
సుధల నాకలు గలిగి.
లోక తత్త్వ నిరూప
ణైక ఫలములు గలిగి,
పంచ తంత్రంబిలకు
పారిజాతము కాదె!

సమాప్తం

హాస్యనవలిక!

# ఆషాఘపట్టు

'క్రొవ్విలే' నరసింహా



ఆదివారం ఉదయం 10 గంటలు....

రాజేంద్ర నిమిషానికొకసారి యింట్లోంచి బయటకు వచ్చి రోడ్‌వైపు చూసి తిరిగి లోనికి వెళుతున్నాడు.

ఆ విధంగా గంటసేపు ఎదురుచూశాడు.

భార్య రజనీ వంట యింట్లో రకరకాల పిండివంటలు తయారుచేయటంలో మునిగి పోయి ఉండటంవలన ముందు గదిని మంచిగా డెకరేట్‌చేసి వుంచాడు రాజేంద్ర!

బాస్ దంపతులు వచ్చే టైం అయ్యింది. అయినా రజనీ వంట యింట్లోనే వున్న దని గ్రహించిన రాజేంద్ర "ఏమోయి శ్రీమతి! అక్కడ ప్రయోగాలు చేస్తావు త్వరగా తెములు" అంటూ భర్త అనేస రికి రయ్యిన వంట యింట్లోంచి దూసుకొని వచ్చింది రజనీ.

ఒక్కదాన్ని అక్కడ తిప్పలు పడుతుంటే వచ్చి సాయం చేసేదిపోయి కంగారు పెడ్తారే అని గయ్యిన లేచింది భర్తమీదకు రజనీ !

అంతే సగటు భర్తలా మెత్తబడిపోయాడు రాజేంద్ర.

ఇంతలో యింటిముందు స్కూటర్ ఆగిన శబ్దం అయ్యింది.

రాజేంద్ర గబగబా బయటకు వచ్చాడు.

స్కూటర్ ద్గిగుతున్న బాస్ దంపతుల ద్దరికి నమస్కారం పెట్టి లోపలకు ఆహ్వా నించాడు.

పది నిమిషాల్లో ముస్తాబై వచ్చిన రజనీని అతిథులిద్దరికి పరిచయం చేసాడు రాజేంద్ర.

పది నిమిషాలు కుశల ప్రశ్నలు అయ్యాక ఘుమఘుమ లాడుతున్న ఫలహారాలుతెచ్చి టేబుల్‌పై పెట్టింది రజనీ!

నలుగురు కల్సి వాటిని తిన్నారు.

రజనీ వంటల్ని తెగ మెచ్చుకున్నారు బాస్ దంపతులు.

వచ్చిన అతిథులను కిటికీ నుండి రెండు కళ్లు గమనిస్తున్న సంగతి ఎవరు పట్టించు కోలేదు.

(గత సంచిక తరువాయి)

నిముష నిముషానికి గమనిస్తున్న కళ్లు కోపంతో ఎర్రపడసాగాయి!

ఫలహారాలు చేయటం పూర్తి అయ్యాక చేతులు శుభ్రం చేసుకోటానికి దొడ్లోకి వెళ్లింది బాస్ భార్య.

అంతే.

కోపంతో బుసలు కొడ్తున్న రాజేంద్ర వాళ్ల ఆవు ఒక్కసారిగా బాస్ భార్యను తన కొమ్ములతో కుమ్మింది.

ఆ ప్రమాదం గమనించని బాస్ భార్య "కెవ్వు"మని కేక పెట్టింది.

ఆ అరుపుకి లోపలవున్న బాస్, రాజేంద్ర, రజనీ ఒక్కసారిగా పరిగెత్తుకొని బయటకు వచ్చారు.

అంతలోనే ఆవు ఆమెను కుమ్మటం ఆమె ఎగిరి చెట్లపాదుల్లో పడిపోవటం రెప్ప పాటు కాలంలో జరిగిపోయింది.

అప్పుడు గమనించింది రజనీ బాస్ భార్య కట్టుకున్న చీర వంక

ఆమె ఎరుపురంగు చీరె, దాని మ్యాచింగ్ రంగు జాకెట్ ధరించి వున్నది.

ఆవుకి దాని చిన్నతనం నుండి ఎరుపు రంగు అంటే అసలు పడదు. తన ఊరిలో కూడాఎవరన్నా ఎరుపురంగు దుస్తులు ధరించి యింటివైపు వస్తే వాళ్లని ఊరంతా వెంబ డించేదని, ఈ ఒక్క విషయంలో ఆవు ఎవరిమాట వినేదికాదని జరిగినదానికి సమా ధానంగా చెప్పింది రజనీ!

అంతే. ఆ మాటలు విన్న బాస్ ఉగ్రు డైపోయాడు.

"రాజేంద్ర! నాకు ఈ విషయం ముందుగా ఎందుకు చెప్పలేదు." అంటు చిందులు వేయసాగాడు.

అసలు నిన్ను క్వార్టర్‌లో ఆవుని పెంచ మని చెప్పింది ఎవరు?

ఎవరి పర్మిషన్ తీసుకున్నావు దీన్ని పెంచటానికి అని ప్రశ్నలు మీద ప్రశ్నలు కురిపించసాగాడు.

బాస్ అరుపులకు ఉక్కిరి బిక్కిరి అయ్యారు రాజేంద్ర దంపతులు. నడుం పట్టుకుపోయిన భార్యను స్కూటర్ పైన ఎక్కించుకొని వేగంగా వెళ్లిపోయాడు బాస్!

తెల్లారి ఆఫీస్‌లో తనమీద ఏం చర్య తీసుకుంటాడోనని రాజేంద్ర తెగ బాధపడి పోసాగాడు.

ఆయనతో పాటు రజనీ కూడా బాధ పడసాగింది, ఇదంతా తను ఆవుని వెంట తేవటం వల్లనే జరిగిందని.

ఈ సంఘటన దృశ్యాన్ని కిటికీలోంచి చూసిన ఎదురింటి బ్రహ్మానందం అతని భార్య శ్రీలక్ష్మి ఎంతో సంతోషించారు.

ఈ పూటకి యిది ఒక స్పెషల్ వార్తగా దొరికినందుకు శ్రీలక్ష్మి, గతవారంలో ఆఫీస్ టైంలో పని సరిగా చేయటంలేదని సంజా యిషీ కోరిన బాస్‌పై కోపంగావున్న బ్రహ్మా నందానికి జరిగిన సంఘటన కన్నుల పండుగ్గా వుంది,

ఈ విషయం అర్ధగంటలో ఆటం బాంబులా కాలనీ మొత్తం మారు మ్రోగింది

********

రాజేంద్ర రజనీ దంపతులకు ఆ ఆది వారం అపాయాల వారంగా మారింది.

రాకరాక వాళ్ల బాస్ భార్యతో తన యింటికి రావటమేమిటి....వచ్చినావిడ ఎర్ర రంగు చీరె కట్టుకుని రావటమేమిటి...ఆ రంగు చూసి గంగిగోవు లాంటి ఆవు రంకె వేస్తూ కుమ్మటమేమిటి?

జరిగిన సంఘటన గురించి ఆలోచిస్తూ ఆ పూట భోజనం చేయకుండా మంచం మీద పడుకున్నాడు.

అదిచూసిన రజనీ తనవల్లనే భర్తకు అవ మానాలు జరుగుతున్నాయని భావించి వెక్కి

వెక్కి ఏడ్వసాగింది.

ఆ ఏడుపు చూసిన రాజేంద్రకు భయం వేసింది.

అసలే రోజులు బాగా లేవు. ఈమధ్య మొగుడుబ్రతుకు మరీ అధ్వాన్నం అయిపో యింది.

ఆ విధంగా ఆ జంట ఆదివారం కాల క్షేపం జేసింది.

* * * * * *

సోమవారం ఉదయం తొమ్మిది గంటలు..

ఆఫీసుకు తయారవుతున్న రాజేంద్ర ఎంతో కంగారుగా వున్నాడు. నిన్న తన యింట్లో బాస్ భార్యకు జరిగిన పరాభవంతో కదంత్రొక్కిన బాస్ ఈరోజు ఏరకంగా తన మీద కక్ష తీర్చుకుంటాడోనని భయపడసా గాడు. గడియారంలోని ముల్లు టక్....టక్... మని శబ్దం చేస్తూ కదులుతుంటే తన గుండెల మీద టైంబాంబు వున్నట్లు భావించసాగాడు రాజేంద్ర.

బాస్ తనని ఈరోజు ఏ శంకరగిరి మాన్యాలకో, ఆదిలాబాద్ అడవులకో ట్రాన్స్ ఫర్ చేస్తాడోనని అనుకుంటూ, ఆఫీస్‌వైపు అడుగులు వేయసాగాడు!

ఆఫీస్‌లో వున్న గోడ గడియారం 11 గంటలు కొట్టింది. తన బాస్ గదివైపు మెల్లగా తలెత్తి చూశాడు. యింకా దాని తలుపులు తెరుచుకోలేదు. అది చూసి హమ్మయ్యా



భార్య ఏమాత్రం అలిగి ఏడ్చినా యిరు గుపొరుగు వాళ్లు "అదిగో! కట్నంకోసం వేధిస్తున్నాడు దుర్మార్గుడు" అని పోలీస్‌లకు అప్పగిస్తున్న పాపపు రోజులివి.

ఆ ఆలోచన వచ్చిందే తడువు వెంటనే భార్య భజని దగ్గరకు వెళ్లాడు.

"రాజీ! యిందులో నీ తప్పేంలేదు. అదంతా నా గ్రహపాటు. దాని గురించి నీవెం దుకు బాధపడ్తావు" అని వేడికోలు మాటలు చెప్పి ఆ ఏడుపును తాత్కాలికంగా విరమింప జేశాడు.

యిద్దరు కల్సి భోజనాలు చేసారు.

సాయంత్రం వేళ యిద్దరు కల్సి సిని మాకు వెళ్లారు.

తిరిగి వచ్చేముందు మంచి టూస్టార్ హోటల్‌కి వెళ్లి భోజనం చేశారు.

హోటల్ నుండి నేరుగా కాలనీకి కాలి నడకన ముచ్చట్లు చెప్పుకుంటు నడిచివెళ్లారు.

అని అనుకొన్నాడు రాజేంద్ర!

ఇంతలో సెక్షన్ క్లర్క్ దగ్గర వున్న ఫోన్ ట్రింగ్..... ట్రింగ్.... మని మ్రోగింది.

ఆ ఫోన్ ఎక్కడినుండి వచ్చిందోనని స్టాఫంతా తలా ఓ చెవి అటువైపు పెట్టారు.

ఫోన్‌లో పదినిమిషాలసేపు మాట్లాడిన క్లర్క్ చిన్నగా నవ్వుతూ "ఈ రోజు మన బాస్ ఆఫీస్‌కు రావటంలేదు" అని స్టాఫ్ అందరికి వినబడేలా బిగ్గరగా చెప్పాడు.

ఆ మాటలు విన్న రాజేంద్ర సంతోషపడుతూ కాలనీలో వున్న బాలాజీ టెంపుల్‌లో టెంకాయ కొడతానని మొక్కుకున్నాడు.

"అసలు బాస్ ఎందుకు రావటంలేదో చెప్పారా"

"ఏం చెప్పారు?"

"నిన్న రాజేంద్ర ఇంట్లో జరిగిన సంఘటనతో భార్యకు ఏదో దెబ్బ తగిలి వుంటుంది. ఆవిడగార్ని హాస్పటల్‌కు తీసుకొని వెళ్ళివుంటారు" అని బ్రహ్మానందం అన్నాడు.

ఆ విషయం అంతక్రితమే తెల్సుకొన్న స్టాఫంతా నిజమేనని నమ్మారు.

వాళ్ళ మాటలు వినిపించుకొని క్లర్కు-

"ఆగండి....ఆగండి...బాస్ రాని విషయం అదికాదు" అని గట్టిగా అరిచాడు.

"మరి ఎందుకు రావటంలేదో చెప్పవయ్యా మగడా"

"బాస్ బావమ్మర్ది ఒకడు యింట్లోంచి పారిపోయి మద్రాస్‌లో సినిమా డైరెక్టర్ర్ అయ్యాడని గతంలో మనకి ఓ కథ చెప్పేవాడు గుర్తుందా"

"ఆ...గుర్తుంది." అని కోరస్‌గా చెప్పారు.

"ఆ డైరెక్టర్‌గారు తన యూనిట్‌తో షూటింగ్‌కోసం మన కాలనీకి వచ్చారట. వాళ్ళకు ఏర్పాట్లు అన్ని మన బాస్ దగ్గరుండి మరీ చేస్తున్నారు..." అని క్లర్క్ చెప్పేసరికి,

సీట్లలో వున్న స్టాఫంతా కాలనీవైపు పరుగులు తీశారు. రాజేంద్ర మాత్రం సాయంత్రం షూటింగ్ పూర్తిఅయ్యేవరకు కాలనీవైపు వెళ్ళకూడదని నిర్ణయించుకున్నాడు.

కాలనీలో జరిగే షూటింగ్ తన యింటి ప్రక్కనే జరుగుతుందని, దాని వలన ఎంతటి దారుణం జరుగుతుందోనని ఏమాత్రం గ్రహించలేదు పాపం! పిచ్చి రాజేంద్ర!

* * * * * * * *

షూటింగ్‌కోసం వచ్చిన యూనిట్ అంతా రెండు వ్యాన్‌లలో వచ్చారు. నిర్మాత యిక్కడివాడే కాబట్టి ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లోనే సినిమా షూటింగ్ చేస్తున్నారు గత నెలరోజులుగా.

దర్శకుడు తన బావమ్మర్ది కావటంతో "మా కాలనీలో కూడా మీ సినిమా తీయకూడదూ" అని అడగటంతో సరేనన్నాడు బావమ్మర్ది!

సరేనన్న మాట ప్రకారం ఆ రోజు చిత్రీకరించాల్సిన సన్నివేశాలను అసిస్టెంట్స్‌కి వివరించసాగాడు.

"హీరోయిన్ ఎరుపురంగు దుస్తులు ధరించి రోడ్‌మీద వెడుతుంటే అక్కడవున్న ఆంబోతు ఆమెవెంట పడుతుంది.

అంతలో హీరోగారు వచ్చి ఆంబోతు పొగరు అణచి హీరోయిన్ని రక్షిస్తాడు.

"యివి మనం ఈరోజు చిత్రీకరించవలసిన సన్నివేశాలు"

షాట్ తీయటం కోసం అంతా రెడీ అవసాగారు.

ట్రయినింగ్ పొందిన ఆంబోతు. దాని మాస్టర్ స్పెషల్‌గా మద్రాస్‌నుండి లారీలో వచ్చి రెడీగా వున్నారు. షూటింగ్ చూడటానికి వందల సంఖ్యలో జనం వచ్చారు. కెమెరామ్యాన్ తన కెమెరాను సిద్ధం చేసుకుని వున్నాడు.

"సైలెన్స్!"

"షాట్ రెడీ"

అన్న మాటలు గట్టిగా వినిపించాయి.

ఎరుపురంగు దుస్తులు ధరించిన హీరోయిన్ రోడ్డువెంట నడువ నారంభించింది.

ఆ ప్రక్కనే చెట్టుదగ్గరవున్న ఆంబోతు గుర్రున హీరోయిన్ వంక చూస్తున్నది.

మరికొన్ని నిముషాల్లో షాట్ ఓకే అవుతుంది. కాని ఇంతలో-

"అంబా" అని అరుపు వినిపించింది.

# ఆషాఢపట్టి

అంతే...!

ఎరుపురంగు దుస్తులు ధరించి వున్న హీరోయిన్ వెంటపడవలసిన ఆంబోతు రక్కున ఆగిపోయింది.

అది ఆవిధంగా ఎందుకు ఆగిపోయిందో ఎవరికీ అర్థం కాలేదు. పదినిముషాల తరువాత తిరిగి షాట్ రెడీ అయింది.

మళ్లా "అంబా" అని అరుపు వినిపించింది.

పరిగెత్తాల్సిన ఆంబోతు రక్కున ఆగిపోయింది.

ఆవిధంగా నాలుగుసార్లు జరిగింది.

ఆంబోతు "అంబా" అనే అరుపు వినగానే ఎందుకు ఆగిపోతున్నాదో యూనిట్‌లో వున్న ఎవరికీ అర్థం కాలేదు.

దర్శకుడి కి కోపం తీవ్రస్థాయిలో వచ్చింది.

"ఎవరయ్యా! దాని ట్రయినింగ్ మాస్టార్"

"అర్ముగం సార్!"

"నా దగ్గరకు రమ్మని పిలువోసారి" అని గద్దించాడు.

వెంటనే అర్ముగం గడగడలాడుతూ దర్శకుడి ఎదుట నిల్చున్నాడు.

"ఎందుకయ్యా అది ప్రతిసారీ షాట్ మధ్యలో ఆగిపోతోంది? ట్రయినింగ్ సరిగ్గా యివ్వలేదా? అ...!"

"అదేంటి స్వామీ. నా ఆంబోతు యిప్పటికి పది సినిమాల్లో యాక్షన్ చేసింది. కాకపోతే వాతావరణం కొత్తగా వుంది అంతే!" అని దర్శకుడికి వివరించి చెప్పాడు అర్ముగం!

"సరే! మరోసారి షాట్ తీసి చూద్దాం. ఈసారికూడా షాట్ ఫెయిల్ అయితే అసలు షూటింగ్ క్యాన్సిల్" అని ఆర్డర్ పాస్ చేశాడు దర్శకుడు.

అప్పటికే మధ్యాహ్నం ఒంటిగంట దాటింది.

ఆకాశంలో ఎండ తెలుగు పెళ్లికొడుకు రేటులా మండిపోసాగింది.

"ఒకే! షాట్ రెడీ... యాక్షన్" అన్న అరుపుతో విజిల్ వినపడింది.

"మురుగా! ఈసారి షాట్ ఓకే అయ్యేలా చూడుస్వామీ" అని మనసులో అనుకుంటూ, ఆంబోతు తాడు విడిచిపెట్టాడు అర్ముగం.

అంతే! రయ్యిన దూసుకుపోయింది ఆంబోతు.

యిందాక "అంబా" అని అరుపు వినిపించిన వైపు వెళ్ళసాగింది. తాడు పట్టుకొని వున్న అర్ముగం దానివెంట పరుగులు తీయసాగాడు. పరిగెత్తుతున్న ఆంబోతు నేరుగా రాజేంద్ర యింటివైపు వెళ్ళింది. ఆంబోతు వేగం చూసిన జనం భయంతో పరిగెత్తసాగారు.

"అంబా" అని మరోసారి అరుపు వినిపించింది.

ఆంబోతు నేరుగా రాజేంద్ర యింట్లోకి దూసుకొనివెళ్ళింది.

అక్కడ రాజేంద్ర వాళ్ళ ఆవు ఎదకు వచ్చి ఉదయం నుండి విరహ బాధతో విలవిలలాడిపోసాగింది.

పాపం ఈ విషయం ఎవరికీ తెలియదు.

దాని అరుపు విన్న ఆంబోతు ఆవుని వెతుక్కుంటూ బయలుదేరివచ్చింది.

ఆంబోతుని చూసిన ఆవు తన మెడకు వున్న తాడుని తెంపుకుని దానిదగ్గరకు వెళ్ళింది.

కొన్ని క్షణాలవరకు ఒకదానివైపు మరొకటి ప్రేమగా చూసుకున్నాయి.

అంతే! ఆ ప్రేమ జంట కాలనీ పార్కు వైపు పరుగెత్తాయి. ఆ దృశ్యం చూసిన అర్ముగం -

# ఆషాఢపట్టి

ఓరి దేవుడో! నా హీరోని బుట్టలో వేసుకొనిపోతోంది. పట్టుకోండి... పట్టుకోండి... అని అరుస్తూ వాటివెంట పరిగెత్తబోయి కట్టుకున్న లుంగీ కాళ్ళకు అడ్డు పడటంతో ముందుకు తూలి పడిపోయాడు ఆర్ముగం!

ఎంతసేపటికి ఆంబోతు, దాని మాస్టర్ జాడ తెలియకపోవటంతో విషయం తెలుసుకుందామని కోడైరెక్టరు పరిగెత్తుకొనివచ్చి పరిస్థితి అంతా చూసి అక్కడ డైరెక్టర్ దగ్గర రిపోర్ట్ చేశాడు!

ఆ మాటలు విన్న డైరెక్టర్ పిచ్చిపట్టిన వాడిలా జుట్టు పీక్కున్నాడు. నిర్మాత పరిస్థితి కూడా దాదాపు అంతే అయ్యింది. ఈ చికాకు చూసిన హీరో-హీరోయిన్స్-

"మాకు మరో సినిమా షూటింగ్ వున్నది మద్రాస్‌లో."

అని అంటూ మేకప్ మీదనే కారు ఎక్కి వెళ్లిపోయారు. కోపంగా వున్న డైరెక్టర్ ప్రక్కనే వున్న తన బావపై విరుచుకుపడ్డాడు.

"బావ నీ మాట మీద నేను యిక్కడ షూటింగ్ మొదలు పెడితే చూడు ఏం జరిగిందో? ఎంత నష్టమో తెల్సా. లక్ష రూపాయలు లక్ష!" అని అన్నాడు.

ఆ మాటలు విన్న బాస్ మొఖం హోటల్లో ప్రభుత్వం రేటుకి యిచ్చే అట్టులా మాడిపోయింది!

అవమాన భారంతో కృంగిపోయాడు.

"యింత గోలకి కారణం రాజేంద్ర ఆవు."

"చెబుతా వాడి పని. తేలుస్తా ఆవు తంతు."

అని అనుకుంటు యింటి దారిపట్టాడు బాస్.

పార్కులో జేరిన ఆబోతు జంట విరహతాపం తాళలేక వెంటనే రొమాన్స్‌లో దిగాయి.

పావుగంట తరువాత తాడు చేత పట్టుకొని ఆ బోతు దగ్గరకు వెళ్ళిన ఆర్ముగాన్ని గుర్రుమని చూస్తు వెనుక కాళ్ళతో ఒక్క తన్ను తన్నింది ఆ బోతు. దానితో "మురుగా" అని గావుకేక పెడ్తు విరుచుకుపడ్డాడు. షూటింగ్ కాన్సిల్ అయ్యింది.

యూనిట్ వాళ్లంతా లుంగీలు పైకి మడిచి కట్టి తమ సామాను వ్యాన్లలో సర్దుకోసాగారు!

దర్శకుడు, నిర్మాత ఏం చేయాలో తోచక కారులో రయ్యిన బార్ వైపు వెళ్ళిపోయారు!

అప్పటికి సమయం సాయంత్రం ఆరు గంటల య్యింది.

*** ** *** ** ***

బాస్ తనయింటికి చిన్నగా చేరుకున్నాడు... యింట్లోకి అడుగు పెడుతుండగానే లోపల నుండి రయ్యిన వచ్చి పడసాగాయి కొన్ని వస్తువులు. ప్రతిపక్షాల ప్రశ్నలను తప్పుకొన్న ముఖ్యమంత్రిలా బాస్ ఆ వస్తువుల బారి నుండి ఎంతో చాకచక్యంగా తప్పుకున్నాడు.

"రాక రాక మా తమ్ముడు ఈ వూరు వస్తే అవమానం చేసి పంపిస్తారా వాడికి. నిన్న నానడుం విరిగేలా కుమ్మింది ఈ రోజు లక్ష రూపాయలు నష్టం తెచ్చింది ఆ రాజేంద్రగాడి ఆవు. అందుకే అన్నారు గొడ్డు వచ్చిన వేళ బిడ్డ వచ్చిన వేళ అని. యిదిగో చెబుతున్నా ఇంత జరిగిన తరువాత ఆ రాజేంద్ర ఈ కాలనీలో ఆ ఆవుతో వుండ టానికి వీల్లేదు. ఏంజేస్తారో మీ యిష్టం!!" అని హుకుంజారి చేసింది బాస్ భార్య భద్రకాళి అవతారంతో. ఏం సమాధానం చెప్పాలో అర్థంకాక రాజేంద్ర యింటి వైపు స్కూటర్‌ని పోనిచ్చాడు బాస్!

*** ** *** ** ***

రాజేంద్ర చేసిన తప్పేమి కనిపించటం లేదు. కేవలం అత్తగారు యిచ్చిన ఆవుని పెంచటమే అతని తప్పుగా కనిపిస్తుంది. ఈ విషయంలో అతన్ని ద్రోహిగా నిర్ణయించి శిక్ష వేసే హక్కు నీకు లేదు... నాకు లేదు!

అని బాస్ అంతరాత్మ హెచ్చరించసాగింది.

యింతలో బాస్ బుర్రలో "ఛక్" మని ఒక ఆలోచన వచ్చింది.

దాన్ని అమలు చేసి చూద్దాం అని రాజేంద్ర యింటి ముందు స్కూటర్ స్టాండ్ వేశాడు బాస్!

రాజేంద్ర గుమ్మం ముందుకు నిలబడి తలుపు కొట్టబోయిన బాస్‌కు బిగ్గరగా రజనీ ఏడుపు వినిపించసాగింది.

యింతలో "వద్దంటే ఆషాఢపట్టి బహుమానం అంటు మీ వాళ్ళు ఆ ఆవుని అంటగట్టారు. ముందరే చెప్పాను. పట్నంలో దాన్ని పోషించలేమని. యిప్పుడు చూడు. నిన్న యివాళ జరిగిన సంఘటనల వలన నా ఉద్యోగానికి ఎసరు వచ్చిపడింది. యిక దాన్ని పోషించటం నా వల్ల కాదు.

సంతకు పంపమంటావో.

మీ నాన్నకు కబురు చేసి మీ వూరు పంపుతావో నీయిష్టం" అని తన నిర్ణయం తెలియజేశాడు రాజేంద్ర.

"వద్దండి యిన్ని రోజులు దాన్ని తోబుట్టువులా పెంచాను. ఈ రోజున నా చేతులు మీదుగా దాన్ని సంతకు పంపలేను. ఒక్కక్షణం దాన్ని విడిచి నేను వుండలేను!" అనిరజనీ ఏడుస్తు-రాజేంద్రని ప్రాధేయ పడసాగింది!

తలుపు తట్టి వెళ్ళి వాళ్లిద్దరిని ఎలా సముదాయించాలో అర్థంకాలేదు బాస్‌కి.

"తనకొచ్చిన ఆలోచన అమలు చేసే పద్ధతి యిదికాదు" అని అనుకుంటూ బయటకు అడుగులు వేసాడు బాస్.

*** ** *** ** ***

అర్ధరాత్రి 12 గంటలు....

పార్కులో వున్న జంట విడిపోయింది. ఆవు తన యింటిదారి పట్టి చిన్నగా





నడువసాగింది.

ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్న ఆర్ముగం వెంటనే తన చేతిలో వున్న తాడుతో ఆబోతుని పట్టుకొన్నాడు. ప్రక్కనే రెడీగా వుంచుకొన్న లారీ మీదకు దాన్ని ఎక్కించే ప్రయత్నాలు ప్రారంభించాడు.

యజమాని చెప్పిన మాటను పాటించ సాగింది గంగిరెద్దులా. ఔరా! ఆడగాలి తగిలే సరికి జంతువేమిటి మనుషులేమిటి అంతా తిరుగుబాటు చేస్తారు!

*** ** *** ** ***

తెల్లవారు జాము 6 గంటలు....

పంపునీళ్లు పడదామని నిద్రలేచిన రజనీకి యింటి ముందు ఆవు కనిపించింది.

దాన్ని చూసి సంతోషం పట్టలేక ఈ విషయం భర్తతో వెంటనే చెప్పాలని రయ్యిన యింట్లోకి వెళ్ళింది!

ఆమె చెప్పిన విషయాన్ని నిద్రమత్తులో వున్న రాజేంద్ర పట్టించుకోలేదు.

అతని ఆలోచనంతా ఈ రోజు ఆఫీస్‌లో బాస్‌ని ఏవిధంగా ఎదుర్కోవాలి అన్నదాని మీదనే వున్నది. యధాప్రకారం పదిగంట లకు ఆఫీస్‌కు చేరుకున్నాడు రాజేంద్ర.

సెక్షన్‌లో స్టాఫంతా అతని వంక హంత కుడ్ని చూసినట్లు చూడసాగారు!

పదకొండు గంటలకు బాస్ నుండి పిలుపు వచ్చింది రాజేంద్రకు. బాస్ రూంలోకి తెగించి వెళ్లాడు రాజేంద్ర.

"సార్! రమ్మన్నార్ట."

"అవును."

"ఎందుకో చెప్పండి ఏ వూరికి ట్రాన్స్ ఫర్ చేస్తారో చెయ్యండి. నాకేం ఫర్వాలేదు. నా వల్ల తప్పులేనప్పుడు నేను బెదిరిపోను సార్!" అని గబగబా అనసాగాడు కళ్ళు మూసుకొని రాజేంద్ర.

అతని వాలకం కనిపెట్టిన బాస్ చిర్నవ్వు నవ్వుతూ,

"నిన్న మొన్న జరిగిన సంఘటనల్లో నీ తప్పేం లేదు రాజేంద్ర. నీవు ఎందుకు భయ పడ్డావు అనవసరంగా" అని అంటూ రాత్రి తన కొచ్చిన ఐడియా రాజేంద్రకి చెప్పాడు బాస్!

దాన్ని అమలు చేస్తే ఎన్ని చిక్కులు వస్తాయోమరి!

ఒక వారం రోజులపాటు పట్టింది రాజేంద్ర యింట్లో పరిస్థితి యధాప్రకారం కావటానికి!

ఆఫీస్‌లో కూడా రాజేంద్ర ఆవు విషయం చర్చనీయాంశంగా మారి తాటాకు మంటలా ఉవ్వెత్తున లేచి చల్లారిపోయింది వారం రోజుల్లో. రాజేంద్ర ఆవుని కాలనీ మొత్తం ఒక రౌడీగా చెప్పుకుంటున్నారు.

షూటింగ్‌లో జరిగిన రభస మొత్తం దిన పత్రికల్లో ఒక విశేష వార్తగా ప్రచురించారు.

ఆకాలనీలో వున్న ఆడవాళ్లు తమకు వున్న ఎర్ర చీరెల్ని పెట్టెల అడుగున దాచి వుంచారు.

బయట పరిస్థితి ఈ విధంగా మారేస రికి రాజేంద్రకి ఎందుకో బాధగా వుంది.

తను భార్యతో ఆవు విషయం ఎత్తి ముగించేసరికి క్షణాల్లో కాలనీ మొత్తం తెల్సి పోతుంది.

ఏ నిమిషాన ఏం జరుగుతుందో తెల్సు కుందామని ఆఫీస్‌లో బ్రహ్మానందం, యింటి దగ్గర శ్రీలక్ష్మి గుంట నక్కల్లా కాచుకొని కూర్చుంటున్నారన్న సంగతి రాజేంద్ర దంప తులు గ్రహించారు!

ఆవుని యింట్లో ఎంతో జాగ్రత్తగా చూసుకుంటుంది రజనీ. రాజేంద్ర యింటి ముందు "కుక్క వున్నది జాగ్రత్త" అనే విధంగా "ఆవు వున్నది జాగ్రత్త" అని కొందరు పిల్లలు గేటుకి బోర్డు తగిలించారు.

అది చూసిన రాజేంద్ర దంపతులు కాసేపు నవ్వుకొని ఆ తరువాత బాధప డ్డారు ఆవుని తల్చుకొని.

ఈ విధంగా పదిరోజులు గడిచిపో యాయి.

బాస్ చెప్పిన ప్లాన్ అమలు చేయటా నికి ఎప్పుడు అవకాశం దొరుకుతుందా అని రాజేంద్ర లాటరీ టిక్కెట్ కొన్నవాడిలా ఎదు రుచూడసాగాడు!!

(ఇంకా ఉంది)

---

సరి "కొత్త" శీర్షిక

# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

సుప్రసిద్ధ రచయిత, వైద్యనిపుణులు డా. కొత్త రవీంద్రబాబు ఎం.ఎస్., పాఠకుల భౌతిక, మానసిక, సెక్సు సమస్యలకు, సందేహాలకు సమాధానాలు ఆంధ్రసచిత్రవార పత్రిక ద్వారా యిస్తారని తెలియజేయుటానికి సంతోషిస్తున్నాం. మీ ప్రశ్నలు సూటిగా, సంక్షిప్తంగా, నిస్సంకోచంగా యిన్‌లాండ్ కవర్ లేదా కార్డుమీద రాసి పూర్తి పేరు, చిరునామాతో-

"హలో! డాక్టర్! నేనేం చెయ్యాలి" శీర్షిక

ఆంధ్రసచిత్రవార పత్రిక

గాంధీనగర్, విజయవాడ-3

చిరునామాకి పంపాలి.

అవసరమైనచోట మీ పేరుకి బదులు డాక్టర్‌గారే పొడి అక్షరాలు వాడ తారు (కొంచెం "యిదైన" డెలికేట్ సమస్యలయితే) అంతేకాని మీరు మాత్రం పూర్తి పేరు, చిరునామా రాసి తీరాలి.

ఎడిటర్‌దే తుది నిర్ణయం

- ఎడిటర్

# పరువప్రతిష్ఠలు

వల్లూరి విజయరాఘవరావు

'గార్దభస్వర భూషణా'లనీ, 'ఖరకంఠీరవు'లనీ తరతరాలుగా తమ తాత ముత్తాతలసంగీత విద్వత్తును తూర్పారబోస్తున్నా, అవి తిట్లో, పొగడ్తలో తెలియని బాల్యం నుంచీ సంగీతమంటే చెవి గోసుకునే చంచయ్యకు నోరు తెరిస్తే పాడాలనిపిస్తుంది పాపం! సామగానం కూసువిద్యా మరి? కడుపు నిండా నేర్చుకోవాలి. నేర్చుకున్నా కోయిల కూతల్లా శృతిలో పలుకుతూ పక్కవాళ్ళనిట్టే రంజింపచేస్తుందన్న గ్యారంటీ అందరూ ఇవ్వగలరా? ఔ ందేచ్ఛ!

కానీ చంచయ్య పట్టు జలగపట్టు. వదల్లేదతను. పొద్దున్లేస్తే నిద్రపొయ్యేదాకా, వంశపారంపర్యంగా వాళ్ళ నాయనమ్మకొచ్చిన సరళీల దగ్గర్నుంచి, సబ్బులమ్మే పాటల్దాకా సాధన చేస్తూనే పోయేవాడు!

బాల్య చాపల్యం పోకపోయినా ఏళ్లొస్తూనే వున్నాయి. చదువు ముగిసింది కాద్దో గొప్పో. చనువిస్తే 'పాడ్తా'ననే వాడు స్కూల్లో కూడా! కొందరికది బెదిరింపులా భయపెట్టేది! కిటుకుతెలిసిన మరి కొందరు చంచయ్య సంగీతాన్ని తెగ పొగుడుతూవాడి 'సరిగమ' ల్లోని గరళాన్ని మందులా వాడుకునేవాళ్ళు!- అంటే మచ్చుకు- ఇంటద్దెకున్న అఘోరంగారు 'కావాలో- మొర్రో' అన్నా ఖాళీ చెయ్యకపోతే, పక్కింట్లో కూచుని చంచయ్యను పాడమనేవారు! ఓ వారంరోజుల్లో మరి మజా చూశారా! ఒక్క అఘోరమే కాదు- వారి ఇరుగూ పొరుగూ కూడా ఇళ్లు మారినట్టు పి.టి.ఐ. వార్త! మహామారిలాంటి మహత్తుందన్న మాట చంచయ్య పాటల్లో!

ఏటేటా వస్తాయి పర్వదినాలు.

పావనం చేస్తాయి భక్తిగల ప్రజానీకాన్ని. ఈ యేడూ పక్క వూళ్లో వినాయకచవితి సంబరాలు 'ధూమ్' 'ధామ్'గా జరుపుతారు. గల్లీ గల్లీలో గాత్రకచ్చేరీలేర్పాటు చేస్తున్నారు. వోట్లకోసం కోట్లకట్టలు ఖర్చుబెడుతూ, ఎం.ఎల్.ఎ. కావాలని వువ్విళ్లూరుతున్నారు వుమామహేశంగారు. అయనకూ సంగీతానికి 'మార్జాల మూషిక' సంబంధమైనా, తన పనికోసం గాడిద కాళ్ళు పట్టుకున్న వసుదేవుడిలా, 'పాడ్తా'నన్న ప్రతి మొగాడికీ, (ముఖ్యంగా 'ముఫత్'గా దొరికిన వాళ్ళకు) వద్దనకుండా




"జ్యోతిర్మయి"
చిత్రం : పి. పి.నాయుడు

కాద్దో గొప్పో ఛాన్సిచ్చాడాయన. జనం చేరుకున్న కచ్చేరీల్లో మాత్రం గాలంతో చేపలు పట్టినట్టు, స్వయంగా వుమామహేశంగారో, లేదా తమ ఏజంట్లో, వినాయకుడి మహిమతోపాటు, ఎలక్షన్ల మహిమ రంగరిస్తూ సొంత డబ్బా కొట్టుకోవాలి. జనం రానిచోటంటారా? పాడేవాళ్ళ ఖర్మ అది.

ఇంకేం!

చంచయ్య భాగవతార్‌గారి పాట కచ్చేరీ నిశ్చయమైంది! చంచయ్య ప్రతిభ ఇదివరకే తెలిసిన కొందరు "పిట్టవాలకుండా- విరోధి పక్షం వాళ్ళాయన్ను పాడిస్తున్నారేమో!" అనుకున్నారు. కానీ అసలు సంగతి- వుమామహేశంగారి సంగీత (అ)జ్ఞానమే దీనికి కారణమని వాళ్ళకూ తర్వాత తెలిసింది!

యావత్ప్రపంచంలోనే మొట్టమొదటి సారి అయన స్టేజెక్కబోతున్నాడంటే మాటలా మరి! మునుపో పేషంటు డాక్టర్ దగ్గరకెళ్ళి 'అయ్యా! ఇది నా మొదటి ఆపరేషన్. జాగ్రత్త స్వామి!' అనగానే డాక్టరూ అన్నాట్ట 'భయపడకోయ్! నేనూ మొదటి ఆపరేషనే చేస్తున్నాగా!'

కాగా-

పది రోజులకు ముందట్నుంచే వినా

యకుడి గుడి చుట్టూ నూటొక్క ప్రదక్షణాలు రోజూ చేసి, పాడబోయే పాటొక్కంటికీ నూటొక్కసార్లు వల్లించుకున్నాడు చంచయ్య.

ఇహ పాటెల్లా పాడినా విఘ్నానికి తావు లేదు!! సాయంత్రం కచ్చేరనగా, శాంతంగా, సావధానంగా సాధన చేసుకోవచ్చని, ఎడ్లబండిలో పయనిస్తూ, పాటలు మళ్ళీ వల్లిస్తూ, పరవశుడై, మెల్లమెల్లగా, సమయానికి కచ్చేరీ కార్యరంగం చేరుకున్నాడు చంచయ్య భాగవతార్! ఆ నాలుగు మైళ్ళూ నాలుగు తరాలుగా గడిచాయి బండివాడికి!.. .

అదొక పాత దేవాలయ శిథిలం. తనకు 'పాట్టం' ముఖ్యం. అంతే.

కచ్చేరి మొదలెట్టేదాకా, ఎప్పుడో కామాయమ్మగారమ్మాయి 'అరంగేట్రం' చూసిన చంచయ్యకు, తన ప్రీమియర్ పెర్‌ఫార్‌మెన్స్‌లోనూ అంతే ఎక్సైట్‌మెంట్ గనక- మూసిన కళ్ళు తెరిచినట్టే లేదు! మద్దెల దెబ్బతో మళ్ళీ స్మృతి వచ్చింది. ఒక్కసారి కుడి, ఎడమలకు మెడ తిప్పి పరికించాడు.

ముగ్గురే ముగ్గురు కూర్చున్నారు ఆడియన్స్‌లో!!!

(పక్క వాద్యాల వాళ్ళు కాకలేండి!)

చంచయ్యకు ఆర్గనైజర్ మీద పట్టరాని కోపం వచ్చింది. కానీ, సంగీత సృష్టికి మొదటాయనన్నారు సీరియస్‌గా 'స్వామీ మీ సంగీతం మాట నాకు తెలీదు. మీ తర్వాత నన్ను పాడమని, ముందే డబ్బిచ్చి, పంపారిక్కడికి. అందుకే నే కూర్చున్నా'.

చంచయ్య కాదుర్దా పెరిగింది! 'థక్కు'స రెండో పెద్ద మనిషిని కూడా అడిగేశాడు మరి మీరెందుక్కూర్చున్నారని!

'మీరు కూర్చున్న తివాసీనాది. మీరు లేస్తే అది తీసుకుపోవాలి. పండగ ఫాడావిడిలో ముందు జాగ్రత్త నయం గదండీ' అన్నాడాయన!!

మరి మూడో ఆయనో!?

'అంత మతి మరపైతే ఎల్లా బాబూ!



ఆర్క్యాలజీ డిపార్టుమెంట్ వాళ్ళు అదుకున్నట్టు లేదు. చిమ్మినా పోని చెత్తా చెదారం తాలూకు సుగంధం సంవత్సరానికోసారైనా జనం అఘ్రాణించాల్సిందే ఇక్కడ! గుడిలోపల, మరొక విద్వాంసుడదివరకే పాడుతున్నాడు. పాట పాట మధ్య 'ఎలక్షన్' కబుర్లూ వినిపిస్తున్నాయ్! అప్పుడప్పుడూ 'విఘ్నేశ్వరుడికీ'- 'జై'- 'వృషూమహేశ్వరుడికీ- జై-' అన్న నినాదాలు కూడా.

మద్దెల దరువుల్లో మత్తెక్కినట్టు చూస్తున్న చంచయ్యను, గుడి పక్క సందులో పాడమన్నారు. ఎక్కడైతేనేం- కోపం వినాశకారణం గదా!- తన్ను తాను వోదార్చుకుని, శాంతంగా అనుకున్నాడు-

'ఇలాంటి సమయంలోనే ధైర్యం కావాలి. మహో మహోత్మ్యంగల విఘ్నేశ్వర భగవానుడి పుణ్యచవితిన ఎలాగైనా పాడి తీరాలి (కనీసం ముగ్గురైనా సంగీత ప్రియులున్నారు కదా, ఈ వూళ్ళో!)'

సంబాళించుకుని- పాట మొదలెడ్దామనుకుంటూ- ప్రేక్షకుల్లో కూచున్న మొదటి పెద్ద మనిషిని ప్రశ్నించాడు చంచయ్య 'అయ్యా! మీకు నా సంగీతమంటే, ఇవ్వాళ ఎందుకు వినాలనిపించిందో- మీరేమీ అనుకోకపోతే- కాస్త చెప్తారా?'

దోవ పొడుగునా మా ఎడ్లు బెదురుతున్నా, మీరు పాడుకుంటూనే వచ్చారు. మిమ్మల్ని దేనికి కదల్చడం- కచ్చేరీ అయ్యాక మీరు 'ఫీజు' వసూల్చేసుకుంటే- నాకూ మరో నాల్గు కాసులెక్కువిస్తారేమో- వాపసుక్కూడా నా ఎడ్ల బండిలోనే తీసుకుపోదామని బండీ కూలీ అడక్కుండానే కూచుండిపోయానిక్కడ' అన్నాడతను!

ఇక చంచయ్య భాగవతార్‌గారి కచ్చేరిని గురించి పేపర్లల్లో విమర్శకులేం రాశారో మరి!

●

# టర్మ్ డిపాజిట్లను ఆహ్వానిస్తున్నది

## ఈ క్రింది పథకాల క్రింద మేము యిప్పుడు ఆనందంతో అంగీకరిస్తున్నాము

### పథకం 1 : క్యుమిలేటివ్ డిపాజిట్లు

| కాలం (నెలలు) | కనీస మొత్తం రూ. | గడువు ముగిసిన తర్వాత విలువ రూ | గడువు ముగిసిన తర్వాత విలువ (ప్రతి అదనపు రూ. 1000) | సాంవత్సరిక రాబడి |
|---|---|---|---|---|
| 25 | 3000 | 4002 | 1334 | 16.03% |
| 36 | 3000 | 4545 | 1515 | 17.17% |
| 48 | 3000 | 5220 | 1740 | 18.50% |
| 60* | 3000 | 6015 | 2005 | 20.11% |

* నెలసరి పద్ధతి మీద చక్రవడ్డీ కట్టబడుతుంది డిపాజిట్ 5 సంవత్సరాలలో రెట్టింపు అవుతుంది

### పథకం II : ఫిక్సెడ్ డిపాజిట్లు

| కాలం (నెలలు) | కనీస మొత్తం రూ. | వడ్డీ రేటు సంవత్సరానికి | వడ్డీ చెల్లించే కాలవ్యవధి |
|---|---|---|---|
| 25 | 3000 | 13.5% | రెండు నెలలకి |
| 36 | 3000 | 14.0% | రెండు నెలలకి |
| 48 | 3000 | 14.0% | రెండు నెలలకి |
| 60 | 10000 | 14.0% | ప్రతినెలా |

1 60 నెలల ఫిక్సెడ్ డిపాజిట్ అకౌంట్లు కాని యితర ఫిక్సెడ్ డిపాజిట్ అకౌంట్‌కి కనీస మొత్తం రూ 3000/- వుండాలి అదనపు మొత్తాలు రూ 1000/- గుణకములలో వుండాలి

2 డిపాజిట్లు మద్రాసులోని మా రిజిష్టర్డ్ ఆఫీసులోనూ (పటల్లోస్ రోడ్) మరియు క్రింద పేర్కొన్న మా అన్ని బ్రాంచిలలోనూ చెల్లించవచ్చు

3. బయటి ఊరు చెక్కులు మినహాయింపు లేకుండా స్వీకరించబడతాయి

4 డిపాజిట్లు తిరిగి బ్యాంక్ డ్రాఫ్టులద్వారా మా ఖర్చుతో చెల్లించడం జరుగుతుంది

5 పథకం 1 లో 60 నెలల డిపాజిట్లు కాని యితర డిపాజిట్లకి సంవత్సరానికి 14% చొప్పున ప్రతి రెండు నెలలకి చక్రవడ్డీ ప్రకారం డిపాజిటర్ అకౌంట్‌కి ప్రతి సంవత్సరమూ మార్చి 31 కి చేర్చబడుతుంది 60 నెలల డిపాజిట్ల విషయంలో సంవత్సరానికి 14% చొప్పున ప్రతినెలకి చక్రవడ్డీ ప్రకారం డిపాజిట్ అకౌంట్‌కి ప్రతి సంవత్సరమూ మార్చి 31 న చేర్చబడుతుంది ఈ డిపాజిట్లు గడువు పూర్తయిన తర్వాత విలువకి రిన్యూ చేసుకోవచ్చు

6. రెండు పథకములలోనూ చెల్లించిన/జమచేసిన వడ్డీ అమలులోవున్న ఆదాయపు పన్ను నిబంధనల ప్రకారం మొత్తం నుంచి పన్ను తగ్గింపుకు లోనుకాగలదు

7 డిపాజిట్ల మీద అప్పులు డిపాజిట్ మొత్తంలో 80% వరకూ అనుమతించబడతాయి అటువంటి డిపాజిట్లమీద కంపెనీకి ఉచితమని తోచిన విధంగా 2% కన్నా ఎక్కువ వడ్డీ చెల్లించబడుతుంది

8 ప్రవాసులైన భారతీయుల నుంచి కూడా డిపాజిట్లు స్వీకరించబడతాయి ఇందుకు కంపెనీకి రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా సాధారణ అనుమతి యిచ్చింది

అన్ని షరతులు, నిబంధనలు వున్న దరఖాస్తు పత్రాలు 21, పటుల్లోస్‌రోడ్, మద్రాసు 600002 వద్ద నున్న కంపెనీ రిజిష్టర్ ఆఫీస్ నుంచి మరియు క్రింద పేర్కొన్న బ్రాంచిలు/ఆఫీసుల నుంచి కూడా పొందవచ్చును, అంగీకరించిన డిపాజిట్లు నాన్-బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీల విషయంలో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా జారీచేసిన ఉత్తర్వులు అనుసరించి వుంటాయి

నాన్-బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలు మరియు మిసిలేనియస్ నాన్-బ్యాంకింగ్ కంపెనీలు (ప్రకటన) నిబంధనలు, 1977 అనుసరించి స్పష్టపరచవలసిన విషయములు క్రింద యివ్వబడినవి

ఎ) కంపెనీ పేరు : **సుందరం ఫైనాన్స్ లిమిటెడ్**

బి) కంపెనీ నెలకొల్పబడిన తేదీ : 11 ఆగస్టు 1954

సి) కంపెనీ మరియు దాని అనుబంధ సంస్థలు జరుపు వ్యాపారము మరియు శాఖల వివరాలు : కార్లు, జీపులు, తేలిక మరియు భారీ వ్యాపార వాహనాలు మరియు యంత్రసామగ్రి వాయిదాల పద్ధతి కొనుగోలుకు ఆర్థిక సహాయము మరియు పరికరాలు గడువు గుత్తగా యివ్వడమూ మరియు అనుబంధ కార్యకలాపాలు

**బ్రాంచిలు/ఆఫీసులు :** అహమ్మదాబాదు, బెంగుళూరు, బళ్ళారి, బొంబాయి, కాలికట్, కాననూరు, కోయంబత్తూరు, కడప, ఎర్నాకులం, ఈరోడ్, గుంటూరు, హుబ్లీ, హైదరాబాదు, కొట్టాయం, కుంభకోణం కర్నూలు, మధురై, మంగళూరు, మంజేరి, మార్గోవా, మైసూరు, నాగపూరు, నామక్కల్, నాసిక్, నెల్లూరు, న్యూఢిల్లీ, పాల్ఘాట్, పాండిచ్చేరి, పూనే, క్విలన్, రాయిచూరు, రాజమండ్రి, సేలం, శ్రీకాకుళం, తిరునల్వేలి, తిరుచూరు, తిరుచ్చి, తిరువేంద్రం, వెల్లూరు, విజయవాడ, విశాఖపట్నం మరియు వరంగల్లు

సబ్సిడరీ : **ఇండియా ఎక్విప్‌మెంట్ లీసింగ్ లిమిటెడ్.** 21, పటుల్లోస్ రోడ్, మద్రాసు 600 002 ప్రధానంగా పరికరాలను గడువు గుత్తగా యివ్వడము

డి) కంపెనీ యాజమాన్యం గురించి సంగ్రహ వివరణ - కంపెనీ బోర్డు పర్యవేక్షణలో దాని మానేజింగ్/హోల్‌టైమ్ డైరెక్టర్లచే నిర్వహించబడుతున్నది

ఇ) డైరెక్టర్ల పేర్లు, చిరునామాలు, వృత్తులు

| పేరు | చిరునామా | వృత్తి |
|---|---|---|
| శ్రీ టి.ఎస్. సంతానం (చైర్మన్-బోర్డ్ ఆఫ్ డైరెక్టర్) | "గోపాల్‌బాగ్" 180, మౌంట్‌రోడ్, మద్రాసు-600 006. | వ్యాపారవేత్త |
| శ్రీ టి.ఎస్. పద్మనాభన్ యం.ఎ.బి.యల్. (వైస్ చైర్మన్) | 4, బజుల్లా రోడ్, టి. నగర్, మద్రాసు-600 017 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ ఎస్ ఇ ఎస్ రాఘవాచారి ఐ సి ఎస్ (రిటైర్డ్) | ఫ్లాట్ నం 62, మొదటి ఎవెన్యూ ఇందిరానగర్, మద్రాసు-600 020 | రిటైర్డ్ గవర్నమెంట్ ఆఫీషియల్ |
| శ్రీ ఆర్.కె. శేషాద్రి | 71, పచ్చయప్పాస్ హాస్టల్ రోడ్ ఆఫ్ మెకానికొలాస్ రోడ్, మద్రాసు - 600 031 | రిటైర్డ్ గవర్నమెంట్ ఆఫీషియల్ |
| శ్రీ ఎస్ నారాయణన్ | 15, పార్థసారధి గార్డెన్, మద్రాసు-18 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ ఎస్.వి జి | 33, పోస్ గార్డన్, మద్రాసు-600 086 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ ఎస్ రామ్ | 29, వృధ్వీ ఎవెన్యూ, మద్రాసు-18 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ టి. రామభద్రన్ (మానేజింగ్ డైరెక్టర్) | 49, ఛామియర్స్ రోడ్, మద్రాసు 600 028 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ జి కె రామన్ బి ఎస్ సి బి యల్ డిప్లమా ఇన్ బి ఎమ్ (జాయింట్ మానేజింగ్ డైరెక్టర్) | 10, 12వ క్రాస్ స్ట్రీట్, ఇందిరానగర్, అడయారు, మద్రాసు-600 020 | కంపెనీ డైరెక్టర్ |
| శ్రీ ఎస్ రాఘవన్, [illegible] ఎ ఎ సి ఎస్ (జాయింట్ మే[illegible]జింగ్ డైరెక్టర్) | 16, నార్త్ స్ట్రీట్, శ్రీరామ్‌నగర్ మద్రాసు-600 018 | కంపెనీ డైరెక్టర్ |

యఫ్ & జి) ప్రకటన తేదికి ముందు కాలానికి సంబంధించిన మూడు ఆర్థిక సంవత్సరములకు పన్నులు, డివిడెండ్లు ఏర్పరచటానికి ముందర మరియు ఆ తర్వాత కంపెనీ లాభాలు

| ముగిసిన సంవత్సరం | పన్నుముందర లాభం | పన్ను తర్వాత లాభం | ప్రకటించిన డివిడెండ్ |
|---|---|---|---|
| | (రూ లక్షలలో) | | |
| 31.03 1987 (3నెలలు)* | 122 09 | 115 34 | 4% |
| 31 03 1988 | 555 57 | 468 07 | 20% |
| 31 03 1989 | 899.16 | 656 16 | 30% |

* 16% వార్షిక ఆధారం మీద

హెచ్) ఇటీవల ఆడిట్‌చేయబడిన రెండు బాలెన్స్ షీట్లయందు చూపిన కంపెనీ యొక్క సంగ్రహ ఆర్థిక పరిస్థితి (రూ లక్షలలో)

| బాధ్యతలు | 31-3-88 నాటికీ | 31-3-88 నాటికీ | ఆస్తులు | 31-3-89 నాటికి | 31-3-88 నాటికి |
|---|---|---|---|---|---|
| వాటాదనము | 600.00 | 600 00 | స్థిరాస్తులు* | 3516 63 | 3335 97 |
| రిజర్వులు మరియు అదనములు | 1983 19 | 1507 82 | పెట్టుబడులు | 333 55 | 211 55 |
| హామీగల ఋణములు | 4196.35 | 2456 28 | ప్రస్తుత ఆస్తులు | 22976 13 | 18253.97 |
| హామీలేని ఋణములు | 14415 75 | 12792.55 | ఋణములు మరియు అడ్వాన్సులు | 1197 78 | 673 29 |
| ప్రస్తుత బాధ్యతలు మరియు ఏర్పాట్లు | 6828 80 | 5118 13 | నానావిధ ఖర్చులు | — | — |
| | | | లాభము మరియు నష్టము ఖర్చు | — | — |
| మొత్తం | 28024 09 | 22474.78 | మొత్తం | 28024 09 | 22474.78 |

* రిటెన్-డౌన్ వాల్యూ పద్ధతి అనుసరించి డిప్రిషియేట్ చేయబడింది

| గమనిక . అనిశ్చిత బాధ్యతల గురించి సంగ్రహ వివరములు | 31.3.1989 రూ | 31 3 1988 రూ |
|---|---|---|
| iii) మొత్తం అసలు సొమ్ములో కాంట్రాక్టుల మొత్తం సొమ్ము అంచనా వేయబడియు సిద్ధపరచబడినది | 60,70,335 | 65,03,190 |
| ii) ఈక్రింది వాటికి సంబంధించిన కేటాయించని అనిశ్చిత బాధ్యతలు | | |
| 1) బ్యాంకులకి బాధ్యతలు | | |
| ఎ) డిస్కౌంట్ చేసిన చెక్కుల మీద | 20,06,725 | 22,16,114 |
| బి) గ్యారంటీల మీద | 50,55,050 | 38,24,038 |
| సి) లెటర్స్ ఆఫ్ క్రెడిట్ మీద | 7,48,651 | 5,51,543 |
| iii) అప్పులుగా గుర్తింపబడని కంపెనీ మీద క్లెయిములు | 31,49,015 | 11,13,642 |

ఐ) ఎ) ఉత్తరువుల ననుసరించి డిపాజిట్లమూలంగా కంపెనీ స్వీకరించగల మొత్తం — రూ 258.31 కోట్లు

బి) 31.3.89 నాటికి డిపాజిట్ల మొత్తం — రూ 144 16 కోట్లు

జె) కంపెనీ వద్ద క్లెయిమ్ చెయ్యని డిపాజిట్లు తప్ప వేరే గడువు ముగిసిన డిపాజిట్లు లేవు

కె) కంపెనీ ఈ విధంగా ప్రకటిస్తోంది

1) ఉత్తరువుల ప్రకారం అనుసరించవలసిన విధానాలను కంపెనీ అనుసరించింది

2) ఉత్తరువుల నిర్వహణ అనగా డిపాజిట్లు తిరిగి చెల్లింపుపై రిజర్వుబ్యాంక్ హామీ వుందని కాదు.

3) కంపెనీ అంగీకరించే డిపాజిట్లు హామీ లేనివిగా పరిగణించి హామీలేని బాధ్యతలలో చేర్చబడతాయి.

బోర్డు ఆజ్ఞతో

**సుందరం ఫైనాన్స్ లిమిటెడ్** తరవున

ఎస్ వెంకటేశన్

సెక్రటరీ

స్థలం మద్రాసు

తేదీ 28 జూన్ 1989

28 జూన్ 1989 నాటి తీర్మానం ద్వారా పై వివరములు ఆమోదించి ఈ ప్రకటన బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల అధికారములో మరియు వారి పేరుమీద జారీ చేయబడింది.

**సుందరం ఫైనాన్స్: ముప్పయి సంవత్సరాలకు పైగా అగ్రస్థానంలో**

# బూతు సంహారమ్

## ఉద్దేమట్టి గోపాలరావు



'రత్నం' అని గేటు దగ్గర నిలబడి కేకేశాడు వెంకట్రామయ్య. అప్పుడేటౌను నుండి బస్ దిగి వచ్చాడు. ఇది రత్నం ఇల్లేనా కాదా అని గేటు ప్రక్కన కట్టిన బోర్డు చూసి రత్నం ఇల్లేనని నిర్ధారణ చేసుకొన్నాడు.

వెంకట్రామయ్య ఊరు వదిలి టౌన్లో స్థిరపడ్డాడు. ఒకప్పుడు రత్నం వెంకట్రామయ్య పశువులను కాసేవాడు. ఆ రోజుల్లో 'ఒరే రత్నం' ఒరే రత్తిగా అని పిలిచేవాడు. ఇప్పుడలా పిలిస్తే రెండు చెంపలు వాయిస్తాడు. ఎందుకంటే రత్నం ఈ ఊరి సర్పంచ్.

కొన్ని సంవత్సరాల క్రితం వెంకట్రామయ్య ఆ ఊరి మోతుబరి రైతు, సర్పంచి కూడా. ఆ రోజుల్లో రత్నంగానీ రత్నం కులం వాళ్ళుగానీ వెంకట్రామయ్య ఇంటి ముందు నుండిగానీ వెంకట్రామయ్య కులంవాళ్ళ ఇంటి ముందునుండిగానీ చెప్పులేసుకొని వెళ్ళటానికి కూడా వీలులేదు. చెప్పులు చేతిలో పట్టుకొని పోవల్సిందే.

'రత్నంగారూ' అని మరోసారి కేకేశాడు వెంకట్రామయ్య.

'ఎవరూ- లోపలికి రాండి' అని రత్నం కేకేశాడు.

అసలు రత్నానికి తెలివితేటలు లేకుండా, రాకుండా తానెంతో జాగ్రత్తపడ్డాడు ఆ రోజుల్లో- కానీ 'వాడి' వలన రత్నానికి చదువు సంధ్య అబ్బి ఇంతవాడయ్యాడు. రత్నానికి సాయం చేసిన 'వాడి' మీద వెంకట్రామయ్యకు పట్టరాని కోపం వచ్చింది.

అసలు ఆ వూర్లో బ్రాహ్మణులు, వైశ్యులు, చాలా సంవత్సరాల క్రితమే పట్నవాసానికి వెళ్ళారు. వెంకట్రామయ్యతో సహా వాళ్ళ కులం వాళ్లంతా ఈ మధ్యనే పట్నాలకు చేరారు. ఇప్పుడు ఆ వూర్లో రత్నం కులం వాళ్లదే రాజ్యం.

రత్నం భార్య వచ్చి గేటు తలుపు తీసింది 'రత్నం ఉన్నాడమ్మా' అని అడిగాడు వెంకట్రామయ్య. 'ఉన్నారు- రండి లోపలికి' అని పిలిచింది ఆవిడ. వెంకట్రామయ్యగారు వరండాలోకి వెళ్ళి నిలుచున్నాడు. రత్నం లోపలి నుండి రాలేదు. వరండాలో రెండు పెద్ద పటాలున్నాయి. ఒకటి అంబేద్కర్ ఫొటో. రెండవది 'వాడి' ఫొటో. 'వాడి' ఫొటో చూడగానే వెంకట్రామయ్య పళ్ళు పటపటా కొరికాడు.

రత్నం ఇంట్లో నుండి వరండాలోకి వచ్చాడు. రత్నంది భారీ విగ్రహం.మెలిదిరిగిన కండలు. నిశితమైన చూపు. మంచి ముఖ తేజస్సు.

'ఏం వెంకట్రామయ్యా- ఇలా వేంచేశావు?' అన్నాడు రత్నం.

కనీసం గారు అని కూడా సంబోధన లేనందుకు వెంకట్రామయ్య ముఖం చిన్నబోయింది.

ఎటువంటి వెంకట్రామయ్యకు ఎటువంటి గతి పట్టింది.

'ఇదో ఓ కుర్చీ పట్రా' అని భార్యను కేకేశాడు. రత్నం శ్రీమతి తెచ్చిన కుర్చీలో కూర్చుంటూ-

'ఏం కావాలి- వెంకట్రామయ్యా'

నిలబడే వున్న వెంకట్రామయ్య ముసలి పనికిరాని ఎద్దులా రత్నం ముందు క్రింద కూర్చోలేక 'పొలం అమ్ముదామని వచ్చా' అన్నాడు.

పొలం అమ్మమని కొడుకులు చేస్తున్న వత్తిడి తట్టుకోలేక రత్నం దగ్గరకువచ్చి తల వంచవలసి వచ్చింది వెంకట్రామయ్యకు. ఒకప్పుడు తను ఎన్ని పొలాలు కొన్నాడో ఎంత ఆర్జించాడో ఇప్పుడు తన పాలేరు దగ్గర అభిమానం చంపుకొని నిలబడాల్సి వచ్చింది.

'అమ్మవయ్యా దానికి నా ఆజ్ఞ దేనికి?' అన్నాడు రత్నం.

'ఈ ఊర్లో మోతుబరివి నీవే కదా. నీ ఆజ్ఞ ఈ ఊర్లో సుగ్రీవాజ్ఞ కదా. ఐనా నీవు తప్ప కొనే స్థోమత మాత్రం ఎంత మందికి ఉంది కనుక' కాస్త పొగిడితేనన్నా మనసు కరుగుతుందేమోనని ఆశపడ్డాడు వెంకట్రామయ్య.

'ఇదుగో ఓ గ్లాసు మజ్జిగ తీసుకరా' అని భార్యను కేకేశాడు రత్నం.

భార్య తెచ్చిన మజ్జిగ త్రాగుతూ 'సరే ఎకరం ఎంతకు అమ్ముతావు' అన్నాడు రత్నం.

మరీ ఏక వచన సంబోధన వెంకట్రామయ్య మనసును కలిచివేస్తున్నది. ఇదే ఊర్లో తను ఎలా బ్రతికాడు? తనకున్న ఇద్దరు కొడుకులకూ కూతురుకూ లక్షలకొద్దీ డొనేషన్లు కట్టి డాక్టరు కోర్సులు చదివించాడు. వాళ్ళు ముగ్గురూ తలా ఒక ఊర్లో ప్రాక్టీసుపెట్టి లక్షలకొద్దీ సంపాదిస్తున్నారు. భార్యపోయిన దగ్గర్నుండీ తనొక్కడే గుంటూర్లో లాడ్జిలో రూం తీసుకుని హోటల్ భోజనంతో కాలక్షేపం చేస్తున్నాడు. ఏళ్లలో పొలం అమ్మి తెస్తేనే మా దగ్గర ఉండమని కొడుకులు వార్నింగ్ ఇచ్చారు!

'ఎకరం ఇరవై వేలు ఉందిగా ఊర్లో' అన్నాడు వెంకట్రామయ్య

'ఊర్లో ఎంతైనా ఉండనియ్యండి. ఎకరం నాలుగువేల చొప్పున ఇస్తే ఇవ్వండి- లేకపోతే బీడు పెట్టుకో' అని కుర్చీలో నుండి లేచి ఇంట్లోకి పోబోయాడు రత్నం.

'ఇది అన్యాయం' అన్నాడు వెంకట్రామయ్య.

'అన్యాయం అనే మాట అనే అర్హత నీకు లేదు వెంకట్రామయ్య' నీ ఇష్టమైతే ఎకరం నాలుగువేల చొప్పున అమ్ము లేదంటే తక్షణం నా ఇంట్లో నుండి వెళ్ళిపోవచ్చు. బస్సు వేళ కూడా అయిపోతున్నది- నాకు అవతల బోల్డు పనులున్నాయి.

క్షణం ఆలోచించాడు వెంకట్రామయ్య. ఇప్పటికే పొలం పరిస్థితి అస్తవ్యస్తంగా ఉంది. ఆ ఇరవై ఎకరాలు ఎలాగో అమ్ముకోకపోతే ఈ మాత్రం ధర కూడా భవిష్యత్తులో రాకపోవచ్చు.

'సరే. నీ ఇష్టం వచ్చిన ధరకే తీసుకో!' అన్నాడు వెంకట్రామయ్య.

'నేను సోమవారం రిజిష్టారు ఆఫీసు దగ్గరకు వస్తాను మన ఊరి కరణం గారు కూడా టౌన్లోనే ఉంటున్నారుగా వారి సాయంతో మీకు ఆ రోజే డబ్బు కట్టి రిజిష్టరు చేయించుకుంటా.'

కరణంగారు... వెంకట్రామయ్యకు ఆ మాట విని చీమలు ప్రాకినట్లు అనిపించింది. ఎదురుగా ఉన్న నన్ను ఏక వచన సంబోధన. ఉద్యోగం ఊడి ఊరొదిలి పెట్టిన కరణాన్ని కరణంగారు అని సంబోధనా?

'సరే సోమవారం రిజిష్టరు ఆఫీసు దగ్గర ఎదురు చూస్తూ ఉంటా' అని వెళ్ళిపోయాడు వెంకట్రామయ్య.

వెంకట్రామయ్య వెళ్ళిపోగానే బరువు దించినట్లు ఫీలైనాడు. ఇప్పుడు మనసెంతో తృప్తిగా ఉన్నది.

* * * *

సుమారు ఇరవై ఐదు సంవత్సరాల క్రితం అప్పుడు రత్నానికి పదిహేనేళ్ళుంటాయి. చేలో జొన్న పీకుతున్నాడు. గంటసేపు పీకితేకాని పెద్ద మోపుకాదు. పెద్ద మోపు తీసుకెళ్తేగాని తన యజమాని వెంకట్రామయ్య ఊరుకోడు. పైగా ఇది వెంకట్రామయ్య పొలం కాదు. జమదగ్ని శర్మ పొలం. ఎవరన్నా చూస్తారేమోనని చాటు చాటుగా కోయాలి. కోసిన మేత వరకు పెద్ద మూట కట్టి నెత్తిన పెట్టుకున్నాడు-

ఇంతలో జమదగ్ని శర్మ పొలం దగ్గర ప్రత్యక్షమయ్యాడు.

'ఏంరా రత్నం దొంగతనం చేస్తున్నావా?' అన్నాడు. 'కాదు స్వామీ. మీ చేలోనే కోసుకొని రమ్మని వెంకట్రామయ్య గారు పంపారు. అందుకని'

'ఐతే నీ తప్పు లేదన్నమాట- సరే ఎలాగు కష్టపడి కోశావు- తీసుకపో- లేకపోతే నీవు ఇబ్బంది పడతావు' అన్నారు శర్మగారు.

'అదేమిటండీ తీసుకపొమ్మంటారు- తప్పు కాదా?' అన్నాడు రత్నం.

'తప్పే ఐతే నీ తప్పు కాదు నీ యజమాని చెప్పింది నీవు చేస్తున్నావు కనుక ఆ పాపం నీ యజమానికే చెందుతుంది.'

జమదగ్ని శర్మ వేదం చదువుకున్నాడు. సంస్కృతం, తెలుగు ఇంగ్లీషులు క్షుణ్ణంగా నేర్చుకొన్నాడు. స్వంత ఊరు కదలకుండా పిల్లలకు ప్రైవేట్లు చెప్పుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ఐతే సంతానభారం అధికం ఐదుగురు ఆడపిల్లలు, ఒక్కడే మగ పిల్లవాడు.

ఆస్తిపాస్తులంతా అమ్మాయిల పెళ్ళిళ్ళకే చాలా వరకు కరిగిపోయింది. కొడుకు చిన్నవాడు. ఇప్పుడే హైస్కూలు చదువుకు వచ్చాడు.

'చూడు రత్నం ఆ గడ్డి మోపు మీ యజమాని ఇంట్లో వేసి మా ఇంటికి ఓ సారి రా' అని చెప్పి శర్మ వెళ్ళిపోయాడు.

రత్నం మనసెంతో బాధపడింది. తనను దొంగతనంగా శర్మగారి పొలంలో తీసుకరమ్మనటం వెంకట్రామయ్యకు ఇది మొదటిసారి కాదు. ఇంతకు ముందు ఎన్నోసార్లు తీసుకెళ్ళాడు గానీ ఈసారి పట్టుబడ్డాడు. శర్మగారు తననుగట్టిగా అరిచినా బావుండేది- కానీ ఆయన మెత్తని మాటలు తనలో అనూహ్యమైన మార్పును తెచ్చాయి.

గడ్డి మోపు తెచ్చి పశువులకు వేసి- త్వరత్వరగా ఇంటికి వెళ్ళి స్నానం చేసి సూర్యాస్తమయం అయేలోగా శర్మగారి ఇంటికి వెళ్లాడు రత్నం.

'రత్నం లోపలికి రా' అని ఆహ్వానించాడు శర్మగారు.

'మీ ఇంట్లోకి రావొచ్చాండీ' అనుమానంగా అడిగాడు రత్నం. రత్నాన్ని వెంకట్రామయ్యగారింట్లో డైనింగ్ హాల్లోకిగానీ వంట గదిలోనికి కానీ రానివ్వరు. అన్నం పెట్టినా చింది పడేట్లు ఎత్తి పడేస్తారు.

'ఏ అభ్యంతరం లేదు- ఏ శాస్త్రంలో కూడా మీరు మా ఇంట్లోకి రాకూడదని వ్రాయలేదు- లోపలికి రా' అన్నారు శర్మగారు. చాప ఇచ్చి 'కూర్చో'మన్నారు.

'చూడు రత్నం రోజూ సాయంకాలం ఒక గంట మా ఇంటికి రా' అన్నారు శర్మగారు.

'ఏం పని చెయ్యమంటారు'

'పని కాదు- నీకు చదువు చెబుతా- నేర్చుకుంటావుగానీ'

'చదువా? నాకా అండీ!'

'ఏం చదువుకోవా? ఏం కష్టం లేదు'

'సరేనండీ'

'రేపు మంచిరోజు- తప్పక రావాలి సుమా' అన్నారు శర్మగారు.

ఐదు వసంతాలు దొర్లిపోయాయి. రత్నానికి తెలుగు ఇంగ్లీషు సంస్కృతాల్లో మంచి పునాది వేశారు శర్మగారు. ఇంతలో శర్మగారి కొడుకు కాలేజీ చదువుకు వచ్చాడు. శర్మగారి ఆస్తి అప్పటికే చాలా ఐపోయింది. కుర్రాడి చదువుకోసం పట్నంలో కాపురం పెట్టాడు. కుర్రాడు ఇంటర్ ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు.

కొడుకుని ఇంజనీరింగ్ చదివించాలని శర్మగారి పట్టుదల. ఐతే చేతిలో చిల్లిగవ్వ లేదు, తన స్వంత ఊర్లో ఆరెకరాల పొలం తప్ప. పట్నం నుండి తన ఊరు వచ్చాడు. ఆ వూర్లో పొలం కొనాలన్నా అమ్మాలన్నా సర్పంచి వెంకట్రామయ్యకు తెలియకుండా జరగటానికివీలు లేదు. నేరుగా వెంకట్రామయ్య ఇంటికే వెళ్ళాడు శర్మ.

గేటు దగ్గరే రత్నం ఎదురయ్యాడు.

'ఏం రత్నం. మీ యజమాని ఇంట్లోనే ఉన్నారా'

'ఉన్నారండీ- పిలుస్తాన'ని లోపలికి వెళ్ళాడు.

వెంకట్రామయ్యగారు అప్పుడే భోంచేసి తాంబూలం వేసుకొని ఇంటికొచ్చిన శర్మను చూసి 'ఏమయ్యా- ఏం పనిమీద వచ్చావు' అని వెంటనే రత్నంవైపు తిరిగి ఒరే రత్నం వరండాలో ఉన్న కుర్చీలన్నీ పోల వేసి ఒక్కటి ఉంచు అన్నాడు. రత్నం మనసులో బాధపడుతూ కుర్చీలన్నీ లోపల వేశాడు. మిగిలిన కుర్చీలో వెంకట్రామయ్య కూర్చొని

'ఏం చెప్పరేం? ఏం పని మీద వచ్చారు' అని అడిగాడు శర్మగారిని.

-శర్మగారు నేల చూపులు చూస్తూ- మా వాడు ఇంటర్ ఫస్ట్‌క్లాసులో ప్యాసయ్యాడండీ. మద్రాసు ఐ.ఐ.టి.లో ఇంజనీరింగ్ సీటు వచ్చిందండీ.

'ఆ వస్తే'

'డబ్బు కావాలండీ'

'నా దగ్గర చెట్టుకు _ డబ్బులు?'

'అదికాదండీ'

'ఏది కాదండీ'

'నా పొలం అమ్ముతానండీ'

'అమ్ముకోవయ్యా- దానికి నా ఆజ్ఞ దేనికో'

'మీకే అమ్ముతానండీ. మీరు తప్ప ఇప్పుడు ఎవరు కొంటారండీ'

'సరే కొంటాలే, ఎన్నెకరాలుంది?'

'ఆరెకరాలండీ'

'ఊర్లో ఎకరం ఐదువేలుంది కాని పైకం లేదూ అంచేత ఎకరం ఐదువందల చొప్పున అయితే తీసుకొంటా లేకపోతే నీ ఇష్టం' అని లేచి ఇంట్లోకి పోబోయాడు.

ఈ సంభాషణంతా రత్నం వింటూనే ఉన్నాడు- శర్మగార్ని కనీసం కూర్చోమనికూడా అనకపోగా ఏకవచన సంబోధన చేయటం రత్నానికిచాలా బాధవేసింది. ఆ మహా పండితుడి కాలి గోర్లపాటి చెయ్యని వెధవ. ఆస్తిని చూసుకొని మిడిసిపడటం తప్ప. ఐనా తనేం చేయగలడు.

'సరేనండీ మీ ఇష్టం వచ్చిన ధరకు తీసుకోండి'

'సరే నేను రేపు పట్నం వస్తాను. రిజిస్టారు ఆఫీసు దగ్గర కలువు- ఇక వెళ్ళు' అని శర్మను పంపించాడు.

ఋతువులు క్రమం తప్పకుండా మారుతూనే వున్నాయి. కాల చక్రం కలియుగంలో త్వరితగతిన తిరుగుతున్నది. పల్లెలో అనేక మార్పులు వచ్చాయి. వెంకట్రామయ్య తన కులం వాళ్ళతో సహా పిల్లల చదువుకోసం పట్నం చేరాడు. రత్నం ప్రైవేటుగా బి.ఎ., ఎం.ఎ. వ్రాసుకొని ఊర్లో వ్యవసాయాన్ని నమ్ముకొని స్థిరపడిపోయాడు.

వెంకట్రామయ్య పొలాన్ని చౌకగా కొని ఆ పొలం మొత్తాన్ని 'జమదగ్నిశర్మ మెమోరియల్ ట్రస్టు' క్రింద జమకట్టి హైస్కూలు కాలేజీల స్థాపనకు కృషిచేస్తున్నాడు.

అందుకే తన ఇంటిలో నిలువెత్తు అంబేద్కర్ ఫొటో ప్రక్కనే 'జమదగ్ని శర్మ' ఫొటో పెట్టుకొని పూజిస్తున్నాడు- ●

## మీ జి.కె. ఎంత? జవాబులు

(1) అయిదుగురు-వారు (1) ఐ. కె. ఆర్. వి. రావు (ఆర్థిక శాస్త్రవేత్త), (2) జస్టిస్ డి. డి. బసు (రాజ్యాంగ నిపుణుడు), (3) డా. సి. ఆర్. రావు (గణితం), (4) డా. ఎ. అప్పాదొరై (రాజకీయ శాస్త్రం) మరియు (5) శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి. (2) విలియం ఇవార్ట్‌గ్లాడ్‌స్టోన్ (3) శంకర్-జైకిషన్ (4) స్కూలంటే భయపడటం (5) ఫిబ్రవరి 28 (6) గున్నార్ మిర్డాల్ (1974 ఆర్థికశాస్త్రం); ఆల్వామిర్డాల్ (1982, శాంతి) (7) షెర్లాక్‌హోమ్స్. 1900-1988 మధ్య తీయబడిన 194 సినిమాల్లో 69 మంది ఈ పాత్రను పోషించారు. (8) రాజేంద్రప్రసాద్ (9) ఏప్రిల్ 11, 1984 (10) చండీఘడ్.

# "కబాడీ కబాడీ"
## ఇక చెడుగుడు ఏమైంది?

'కబాడీ' మన దేశీయ క్రీడ. ఇంతవరకు మనం పాశ్చత్య క్రీడలను అభిమానించి, ప్రోత్స హించాము. ఇప్పుడు మన దేశీయ ఆట 'కబాడీ' విదేశాలలో ఆదరణ పొందుచు న్నది. ఆసియా క్రీడలలో ప్రదర్శన క్రీడగా గుర్తింపు పొందినది. తెలుగునాట 'చెడు గుడు' దాదాపు 6, 7 దశాబ్దముల క్రితం వరకు "కుప్పల చెడుగుడు"గా వ్యవహరించ బడి, ఆ తర్వాత గత 3, 4 దశాబ్దముల క్రితం వరకు చెడుగుడు ఎక్కువగా మన ప్రాంతములో ఆదరించబడినది గత దశాబ్ద కాలముగా కబాడీ స్థానము పొంది చెడుగుడు గుర్తింపు కోల్పోయినది.

పడమటి చెంచయ్య, నార్ల రామా రావు, అవధాని, వై. రాధాకృష్ణమూర్తి, కె. రామమోహన్‌రావు, ధనంజయ, బి.వి. సుబ్బారావు (కొల్లూరు), ఖాదర్ ఖాన్ (బాపట్ల), సంపతాచారి (పొన్నూరు), రామిరెడ్డి (ఇంటూరు), గడిపాటి అంజయ్య (తెనాలి), సినీనటుడు కీ.శే. ముదిగొండ లింగమూర్తి, కనుమూరి సత్యం, దాసరి శ్రీరాములు, సీతారామయ్య, తిలక్, హబీబ్, పుచ్చా కృష్ణమూర్తి, చెంచయ్య, గరికిపాటి నాగేశ్వరరావు, సుబ్బులు, జయరామయ్య మొదగువారు చెడుగుడు ఆటలో తెలు గునాట ఖ్యాతిపొందారు. తెలంగాణ ప్రాంత ములో యీ ఆట అంతగా ప్రచారములో లేదు. ఈ తరం వారికి వీరి గురించి అంతగా తెలియదు. చెడుగుడు ఆట ప్రభావం తగ్గుట, కబాడీ ప్రవేశ పెట్టుట, పాశ్చాత్య ఆటలలో మనవారికి ఆసక్తి పెరుగుటతో మన దేశీయ క్రీడ గుర్తింపు లేకుండా పోయింది.

## హిట్లర్ జోక్యం

కబాడీ ఆట అంతర్జాతీయ స్థానమునకు చేరుట అర్థశతాబ్దము క్రితం కొద్దిలో తప్పి నది. 1932 బెర్లిన్ ఒలింపిక్ క్రీడోత్సవాలలో 'ప్రదర్శన' క్రీడగా ఆడబడి హిట్లర్‌చే విమర్శ పొంది ఖ్యాతిపొందవలసిన అవకాశము కోల్పో యినట్లుగా చెప్పబడుచున్నది. కాని మన దేశ కబాడీ అధినేతల కృషి ఫలితముగా 1982 ఢిల్లీ ఆసియా క్రీడోత్సవాలలో తిరిగి ప్రదర్శన ఆటగా ఆడబడినది. అందరి మెప్పు పొందినది. అంతతో తృప్తిచెందక మన జాతీయ కబాడీ అధినేతలు స్త్రీ పురుషుల జట్లను జపాన్, బంగ్లాదేశ్, కొరియా, పాకిస్తాన్, శ్రీలంక, థాయిలాండ్ మొదలగు దేశాలకు పంపించి ఆట ప్రచారమునకు కృషి చేసారు. ఇప్పుడు ఆ దేశాలు మన కబాడీ ఆటను గుర్తించి, ఆసక్తిలో మన 'కోచ్'లను ఆహ్వానించారు. ఇప్పుడు కబాడీ ఆసియా క్రీడలలో అవకాశము పొందినది. ఆసియా కబాడీ ఫెడరేషన్ ఏర్ప డినది. కబాడీ ఆట ప్రచారమునకు, యువ తలో ఆసక్తి పెంచుటకు ఆసియా కబాడీ ఛాంపియన్‌షిప్ నిర్వహించబడినది.

మన జాతీయ కబాడీ సమాఖ్య అధ్య క్షుడు జనార్దన్‌సింగ్ ఘెలాట్, ఆసియా దేశాల ప్రతినిధులను సమావేశపరచి ఆసియా కబాడీ సమాఖ్య ఏర్పరిచినారు. సమాఖ్య ప్రథమ అధ్యక్ష స్థానము జనార్దన్‌సింగ్ ఘెలాట్‌కు యిచ్చి గౌరవించారు.

కొంతకాలం క్రితం జైపూర్‌లోసవాయి మాన్‌సింగ్ స్టేడియంలో ఆసియా కబాడీ ఛాంపియన్‌షిప్‌లు జరిగాయి. మనదేశం, బంగ్లాదేశ్, నేపాల్, జపాన్, మలేషియా జట్లు పాల్గొన్నాయి. పాకిస్తాన్‌లో ఎన్ని కల సంబరం యుండుట వలన పర్యటనకు ప్రభుత్వము అనుమతించలేదు. పోటీలలో పాకిస్థాన్ నుండి గట్టి పోటీ యుండ కలదు అని ఆశించారు. పాకిస్థాన్ రాకపో వుట కొంత నిస్పృహ కలిగినది. శ్రీలంకకు ఆటలో అంతగా అనుభవము లేదని ఆదేశ ప్రభుత్వము అనుమతించలేదు.

ఆఖరికి అయిదు దేశముల మధ్య జరిగిన స్త్రీ, పురుషుల ఆసియా కబాడీ ఛాంపియన్ షిప్‌లో ఎటువంటి గట్టి పోటీ లేకుండా మన దేశం సులభముగా విజయాలు సాధించినది. ఈ పోటీలలో పాల్గొన్న నాలుగు విదేశాలలో, మన దేశ కబాడీ జట్లు పర్యటన చేసి ఆ దేశాలలో ఆట ప్రవేశపెట్టుటయేగాక, మన దేశంతో ఆడిన అనుభవముతో ఆ దేశాలు ఆడాయి. మనదేశం జపాన్ పర్యటన తర్వాత పెనాంగ్ (మలేషియా)లో ఆడినది. మలే షియా జట్టు కొన్నిరోజుల శిక్షణ తర్వాత వచ్చినది. జపాన్ దేశజట్లు కొంత పట్టుద లగా ఆడాయి. కాని జపాన్ మహిళా జట్టు అయిదుగురుతో వచ్చినది. మన దేశ క్రీడా కారిణు లు యిద్దరు ఆ జట్టుతో ఆడారు. బంగ్లాదేశ్ కొంత పట్టుదల, నైపుణ్యం చూపి నది. మలేషియా- జపాన్‌ల మధ్య జరిగిన పోటీ కొంత ఆసక్తిగా జరిగినది. జపాన్ జట్టులో సుఖావా, ఘబుచ్చి, మలేషియా జట్టులో బాలసుబ్రహ్మణ్యం, మహమ్మద్‌జైన్, మన జట్టులో సుఖమిందర్‌సింగ్, బల్వాన్ సింగ్, కెప్టెన్ అస్సన్‌కుమార్ ప్రతిభావంత ముగా ఆడారు.

మన దేశానికి ప్రథమ స్థానము, బంగ్లా దేశ్ ద్వితీయ, నేపాల్ తృతీయ, జపాన్ నాల్గవ, మలేషియా ఆఖరు స్థానం పొందాయి. ఈ పోటీలలో పాల్గొన్న నాలుగు విదేశాలు కబాడీ ఆట నేర్చుకోవాలి అనే ఆశయంతో వచ్చాయి. పోటీలో మనదేశంపై గెల్పు సాధించగలమని ఆశతో రాలేదు. కాని జపాన్ త్వరలో కబాడీ ఆటలో ప్రావీణ్యం సాధిం చగల అవకాశములు ఎక్కువయున్నవి. వారి పట్టుదల అట్లు అనిపించింది.

-ముకరమ్



## శివశివమూర్తివి...

జన్మదిన సంచిక కమ్ వినాయకచవితి సంచిక ముఖచిత్రం చూడగానే మేమూ 'శివశివ మూర్తివి....' పాట పాడాలనిపించేటంత అద్భుతంగా ఉంది. "విదేశాలలో ఓ బొజ్జ [redacted] నిజమేనా? అనిపించింది. [redacted]', 'తాజాకాలమ్'లు పరా[redacted]ఇకపోతే సీరియల్‌లు నాలుగూ మన 'పత్రిక' అనే అందమైన సౌధానికి నాలుగు స్థంభాలలాగా ఉన్నాయి.

'మాట'కారుల పేజీ' కొంతమంది పాఠకులను నిరాశపరుస్తుంది. వీక్లీ కొని చదువుతారా? అనే విషయాలు ప్రచురించడం అనవసరము. 'మాట', బ్రాకెట్లో పేరు, ఊరు ప్రచురిస్తే ఎక్కువమంది పాఠకులను సంతృప్తి పరచవచ్చు.

హాస్యనటుల ప్రశ్నకు వేసిన జోక్స్ కడుపుబ్బ నవ్వించాయి. ప్రథమ బహుమతి పొందిన హాస్య నవలిక 'సాహిత్య హంతకోపాఖ్యానం' వ్యంగ్యంగా, హాస్య రసస్ఫోరకంగా రోజు రోజుకీ పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న సాహిత్య హంతకులకు హెచ్చరికలా ఉంది.

'ఏ విజయలక్ష్మి?!' అనే హాస్యనాటిక ఇంతకు ముందు విన్న చిన్న జోక్ ఆధారంగా వ్రాయబడినదైననూ కొద్దో గొప్పో ఆసక్తి కలిగించేలా ఉంది.

ఇంత ఉన్నతంగా తీర్చిదిద్దిన 'పత్రిక'లో నాకు నచ్చని విషయము కనపడినది. అదేమిటంటే 'పెద్దలకు మాత్రమే' అనే బిట్‌లో పామెల్లాబోర్డస్ గురించి వ్రాసిన విషయము చాలా అసభ్యముగా తోస్తున్నది. 'పెద్దలకు మాత్రమే' అనే హెడ్డింగ్ కనపడిన వెంటనే దానిని చదువుట ఈ కాలం పిల్లల నైజం.

-నెల్లూరు మనోహరరెడ్డి,
(చిల్లకూరు)

## ఎదురు చూపు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక గురించి ప్రతి శుక్రవారం ఎదురు చూసే పాఠకులకు చక్కని విజ్ఞానాన్ని, వినోద వికాసాల్ని అందించే పత్రికగా తీర్చిదిద్ది సకాలంలో విడుదల చేయవలసినదిగా మనవి.

**ఈవారం సలహా!**

**కాకి చెంచా ఒకటి తెచ్చి మీ ధాబా మీద పడేస్తుందా? దాన్ని యిదుగో మీ చెంచా అని మీ ప్రక్కవాళ్లకిచ్చేయ్యండి. 'గుడ్ విల్' పెరుగుతుంది!**

# వీక్లీ పోస్ట్

(4 వ పేజీ తరువాయి)

ముఖ్యంగా సంపాదకీయం, తాజాకాలమ్, మాటకారుల పేజీ, కథలు నాకు నచ్చిన శీర్షికలు. 1-9-89 నుండి మీరు ప్రచురిస్తున్న మీకు తెలుసా జి.కె.? జనరల్ నాలెడ్జి ప్రశ్నలు ఉపయుక్తంగా ఉన్నాయి. వారం వారం క్రమం తప్పకుండా ప్రచురించండి.

యనమండ్ర శ్రీనివాస భాస్కరరావు,
(కొత్తపేట)

## హాయిగా నవ్వించాయి

అబ్బా! ఏమిటు ఎడిటర్‌జీ! వినాయక చవితికి కనీసం ఒకటి, రెండు రోజులైనా ముందుగా అందించాల్సిన ప్రత్యేక సంచిక వినాయక చవితి వెళ్ళిన 15 రోజులకా అందించేది? మరీ ఇంత అలసత్వమైతే ఎలా భరించాలి చెప్పండి. ఈ మధ్య మళ్ళీ లేటవుతోంది.

జన్మ దిన ప్రత్యేక సంచికను చాలా అందంగా తీర్చిదిద్దారు. ముఖచిత్ర గణేష్ ముద్దుగా వున్నాడు. చిత్రకారుడికి అభినందనలు. వినాయకుడికి నాయకుల్నీ, ప్రజల్నీ జోడించి భలే వ్యంగ్యంగా, సరదాగా వేసారు. మరీ మరీ చూడ బుద్ధేస్తోంది. ప్రత్యేక వ్యాసాలూ, కవితలూ కూడా బాగున్నాయి. సాహిత్య హంతకోపాఖ్యానం హాస్య నవలిక ఆద్యంతం హాస్యంతో లాస్యం చేయించింది. పాపం అప్పారావుని తలచుకుంటుంటే నవ్వాగటం లేదు. ఏ కళైనా స్వతహాగా అబ్బాలే తప్ప బలవంతపు బ్రాహ్మణార్థంలా రుద్దితే ఇలాగే వుంటాయి పాట్లు. సాయిబాబాగారికి అభినందనలు. బహుమతి పొందిన మూడు హాస్య నవలలూ కూడా హాయిగా నవ్వించాయి. పుష్పవిలాపం పేరడీ కూడా చాలా బాగుంది. మొత్తంమీద ప్రత్యేక సంచికను ప్రత్యేకంగానే తీర్చిదిద్దినందుకు ధన్యవాదాలు.

-మోటమర్రి బేబీ కళ్యాణి, బెండమూర్లంక

## శ్రీ సరస్వతీ ఆలయం

అతి పవిత్రమూ, ప్రాచీనము అయిన సరస్వతీ దేవాలయం దేశంలో ఎక్కడో కాదు, మన ఆంధ్రప్రదేశ్‌లోనే వుంది.

అదిలాబాద్ జిల్లాలోని, మాధోల్ తాలూకాలో "బాసర" గ్రామం పవిత్రమైన సరస్వతీ క్షేత్రం. ఈ ఆలయం గోదావరి ఒడ్డున వుంది. ఇక్కడ వ్యాసుడు చాలా కాలం తపస్సు చేసాడని గోదావరిలోని ఇసుకలో "జ్ఞాన సరస్వతి" విగ్రహాన్ని నిర్మించి, ఇక్కడ ప్రతిష్ఠించాడని ఇక్కడ స్థల పురాణం చెబుతున్నది. ఇది ఎండోమెంట్ వారి అధీనంలో వుండి నిత్యపూజా నైవేద్యాలతో, దినదినాభివృద్ధి చెందుతున్న పవిత్ర ఆలయం.

టెంపుల్స్ ఆఫ్ ఇండియాలో ఈ ఆలయ ప్రసక్తి లేకపోవడం విచారకరం.

గరిశకుర్తి రాజేంద్ర
(కామారెడ్డి)

★ ★ ★

మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అదిలాబాద జిల్లాలో "బాసర్" అనే గ్రామంలో సరస్వతీదేవి ఆలయమున్నది. ఇది చాలా పెద్ద క్షేత్రం. ఈ దేవాలయం అదిలాబాద్ జిల్లాలో వుండుటవలన, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్‌వారు ఆ జిల్లాలో నెలకొల్పిన గ్రామీణ బ్యాంక్‌కి "సరస్వతీ గ్రామీణ బ్యాంక్" అని పేరు పెట్టారు.

జి. వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం

★ ★ ★

సరస్వతీదేవికి గుడి మనదేశంలో (ఆంధ్రప్రదేశ్) నిజామాబాద్ జిల్లాలో గోదావరి నది-దరినే వున్నది.

మంతా జనార్ధనరావు, పార్వతీపురం

# సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

## గళ్ళనుడికట్టు-20



కూర్పు : పింగళి వి. కృష్ణారావు

### ఆధారాలు

**నిలువు**

1. అప్పడములో బెల్లపు అప్పచ్చి
3. ఒక రాముడి ఆయుధం
4. ఈమె నిద్ర ప్రసిద్ధం
8. దేవుని చేరే మార్గం
9. దీని ఆచూకీ తేలికగానే తెలుస్తుంది
10. పొదరిల్లు
11. కంటికి దీనివల్ల చాలా బాధ
14. కావ్యేషు–రమ్యం
15. తిక్కన తండ్రి
17 వక్కకు తోడుగా కారం

**అడ్డం**

2. ఆకులు కూడ తినని పార్వతి
5. ఒకటి నిలువు లాంటిదే పన్ను
6. నాలుగు నిలువులో చివర మారితే అల
7. ఇది ఒక రకమయిన కవిత్వం
12. తమ్మినిబట్టి బ్రహ్మను చెయ్యండి
13 దుష్యంతుడి భార్య
16 నీరు ఇది ఎటుంటే అటు ప్రవహిస్తుంది
18. అంగీకారము
19 పదిహేడు నిలువు లాంటిదే కోతి
20. సోమవారం వాడు అందంగా వుంటాడు

ఆధారాలున్నాయి. నుడికట్టు గళ్ళు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు. 200/– లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు అన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే!

- ఎడిటర్

**ముగింపు తేదీ: 10-11-1989**

ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపినవారి పేరు : ..........................................

పూర్తి చిరునామా : ..........................................

.......................................... పిన్‌కోడ్ :

## గళ్ళనుడికట్టు-18

### బహుమతులు

వందలాది పాఠకులు అత్యంత ఉత్సాహంతో ఈ సాహితీ పోటీలో పాల్గొన్నారు. వారందరికీ మా అభినందనలు! సరియైన సమాధానం 29 మంది పంపించారు. మా నియమావళి ప్రకారం లాటరీ తీయగా ఈ క్రింది 10 మంది పేర్లు వచ్చాయి! బహుమతి మొత్తం రు. 200 లను వారికి సమంగా పంచగా రు. 20 ల చొప్పున లభిస్తున్నది. త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఒకరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. కాని తెల్ల కాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు. పత్రికలో కూపన్‌నే నింపాలి. మీ జవాబు మా వద్ద గల సీల్డు జవాబుకి సరిపోవాలి. ఒక పజిల్‌లో ఒకరికి ఒక బహుమతి కంటే ఎక్కువ రాదు! సరైన సమాధానం వ్రాసిన మిగిలిన 19 మంది పేర్లను కూడా ఈ క్రింద యిస్తున్నాము.

- ఎడిటర్




### రు. 20ల వంతున ఆల్ కరక్టు జవాబుకి బహుమతి పొందినవారు

కె. వి. శైలజ (విశాఖపట్టణం), చంద్రజ్యోతి (చిలకలూరిపేట), కె. భరత్‌కుమార్ (చీరాల), జోశ్యుల కనకదుర్గ (విజయవాడ), ఎల్. ఎన్. ఎం. చల్లా (ముసునూరు), వి. విలసిత (వరంగల్), పాలడుగు శివరంగారావు (హైదరాబాద్), జి. సుజాత (విజయవాడ), సుదర్శనం వల్లీనాథ్ (మత్స్యపురి), వి. శ్రీనాథ్ (తెనాలి).

### సరైన సమాధానాలు వ్రాసినవారి పేర్లు

జి. దిలీప్ (ఒంగోలు), కె. లక్ష్మీనారాయణ (భీమవరం), మెట్లపల్లి సత్యనారాయణ (విజయవాడ), వి. జగదీష్ (వరంగల్), పద్మావతి కొండూరు (విశాఖపట్నం), బి. రాఘవరెడ్డి (శిద్ధవరం), ఎస్. మాధవిలత (వరంగల్), వి. ధనలక్ష్మి (తెనాలి), టి. కె. వి. సురేంద్రబాబు (పొదిలి), ఎం. వెంకటలక్ష్మి (సికిందరాబాద్), ఎ. ఉషారాణి (నందివెలుగు), వింజమూరి సుబ్బలక్ష్మి (వరంగల్), టి. శిరీష (కాజీపేట), టి. వి. కృష్ణయ్య (వరంగల్), టి. సత్యనారాయణ (కాజీపేట), పి. కేశవయ్య (అనంతపురం), టి. సుధీర్‌బాబు (తెనాలి), పి. ఎస్. రత్నమ్మ (కడప), ఎ. కుమారస్వామి (పెద్దకారంపల్లి).



1988 సంవత్సరానికి విజయలక్ష్మి స్మారక ట్రస్టు అవార్డుకు ఎంపికైన 'దాసి' చిత్ర దర్శకుడు శ్రీ బి. నర్సింగరావు. ప్రముఖ దర్శకుడు కృష్ణ సంస్మరణార్థం 1986 లో ఈ ప్రతిష్ఠాత్మక అవార్డును నెలకొల్పారు. సాహితీ, సాంస్కృతిక రంగాల్లో విశేష కృషి సల్పిన వ్యక్తులకు ఈ అవార్డును అందజేస్తుంటారు. 1987 సంవత్సరానికి ఈ అవార్డు 'తమస్' దర్శకుడు గోవిందనిహ్లానీకి దక్కింది.



## "లియో" బ్లాంక్ క్యాసెట్‌లు

గత నాలుగు సంవత్సరములుగా 140 తెలుగు చిత్రాలు క్యాసెట్స్‌ను మార్కెట్ చేసి బహుళ ప్రజాదరణ పొందినది లియో. పి. రామకృష్ణ పట్టుదల, దీక్షతో కృషి చేసి లియో చరిత్రలో మరొక నూతన అధ్యాయంగా యిటీవల ఈ బ్లాంక్ క్యాసెట్స్‌ను విజయవాడలో రిలీజు చేశారు. కంపెనీ పార్ట్‌నర్ అయిన శ్రీపి సాయిబాబు వీటిని రిలీజు చేశారు. కంపెనీ జనరల్ మేనేజర్ శ్రీ పి. సుబ్రహ్మణ్యం స్వాగతం చెప్పగా, లియో మిత్రులు శ్రీ గోపాల్ వందన సమర్పణ చేశారు.

# అదీ-ఇదీ-అన్నీ




ఇటీవల ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ భవన్ అంబేద్కర్ ఆడిటోరియంలో ఆంధ్రా ఫిలిం సొసైటీ (న్యూఢిల్లీ) జవహర్‌లాల్ నెహ్రూ శత జయంతి ఉత్సవాల సందర్భంగా రెండు రోజులపాటు నిర్వహించిన నాటకోత్సవాలకు కేంద్ర సాంస్కృతిక శాఖ సహాయమంత్రి శ్రీమతి కృష్ణసాహి ప్రారంభోత్సవం చేసారు.

ఈ కార్యక్రమానికి ముఖ్య అతిధిగా విచ్చేసిన ఎ. ఐ. సి. సి. (ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. ఆర్. మల్లు, శ్రీమతి కృష్ణ సాహి, ఉపాధ్యక్షులు శ్రీ అశోక్, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. వి. ఎల్. నాగరాజుగార్లని ఈ చిత్రంలో చూడవచ్చు.



ఇటీవల అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో "కళా సాహితీ నీరాజనం" కార్యక్రమంలో హైదరాబాద్ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ ఆచార్య శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిని మాజీ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు సత్కరిస్తున్న దృశ్యం. శ్రీ కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడు, శ్రీ పి. ఎస్. ఆర్. అప్పారావులను కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.

Editorial Adviser: ***S. RADHAKRISHNA***, Editor: ***VEERAJI***,
Printed and Published by ***S. NAGESWARARAO*** for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248.

GA135

# రూపాకు స్మితా పాటిల్ అవార్డు

1989 సంవత్సరానికి 'స్మితాపాటిల్' అవార్డు ద్రౌపదికి దక్కిందట. ఈ ద్రౌపది ఎవరో వేరే చెప్పవలసిన పనిలేదు కాని చెప్పటం ధర్మం కదూ! దేశవ్యాప్తంగా అశేష ప్రేక్షకుల ఆదరణకు పాత్రమైన టి. వి. మహాభారత్‌లో ద్రౌపది పాత్రధారిణి రూపాగంగూలీ ఈ అవార్డు చేజిక్కించుకుంది.

ప్రియదర్శిని అకాడమీ వారు ఏర్పాటు చేసిన ఈ అవార్డు ద్రౌపది పాత్రను అత్యద్భుతంగా పోషిస్తున్న గంగూలీ కివ్వటం సమంజసంగానే వుందంటున్నారు అనేకమంది.

రవివర్మ గారి సైరంధ్రి

(10వ పేజీ చూడండి)